# సంపాదకుని పరిస్తావన

మహారాష్ట్రులకోసమై మహారాష్ట్రునిచే మహారాష్ట్రభాషయందు రచితమై, యాంధ్రములోనికి పరివర్తితమై, ప్రకటింపఁబడిన నవలలలో "చిన్నకోడలు" మొదటి దని చెప్పవచ్చును. మా మిత్రులు శ్రీ వాసుదేవరావుగారు పూర్వము కొన్నిపుస్తకములు మహారాష్ట్రభాషనుండి తెలిఁగించిరి, కాని యవి బంగాలీ నవలలకు మరాఠీతర్జుమాలు. వీరి సోదరుఁ డిటీవలఁ గొన్ని నవలలు సరాసరిగా మహారాష్ట్రభాషనుండి యాంధ్రీకరించినట్లు తెలియవచ్చినది. నే నెఱిఁగినంతవఱకు మరాఠీనుండి కథలను సూటిగా మనభాషలోనికి మార్చిన వారిలో మొదటివాఁడు మన్మిత్రము శిష్యుఁడు నగు శ్రీ నల్లగొండ మంగయ్య.

ఈనవల మహారాష్ట్ర సంఘాచారములను దెలుపుటకు రచింపఁబడినను మనసంఘమునకుఁగూడఁ దగిలియున్నట్లు స్ఫురించుచుండును. ఏలన, ఆంధ్రులకును మహారాష్ట్రులకును చాలవిషయములందు సాదృశ్యము కలదు. పాదరక్షలు, అంగవస్త్రధారణము, పొడుగుకోటు, పాగా, నామధేయాంతములు మొదలగు సామాన్యవిషయములలోనే గాక సాంఘికవ్యవస్థలలోసయితము మనకును వారికిని పోలిక యున్నది. మహారాష్ట్రులు ప్రాచీనాంధ్రుల సంతతివా రను సిద్ధాంతము మహారాష్ట్ర విద్వద్వరేణ్యులగు శ్రీ భండార్కరు మొదలగు నితిహాసపరిశోధకు లంగీకరించినదే. ఒకానొకసంఘస్థితిని వర్ణించు గ్రంథ మితరసంఘముల లోపాలోపములను స్పృశించుచున్నచో నట్టిది బహుజనోపాదేయ మగుట నిస్సంశయము. ఈనవలయు నట్టిదే.

ఇందలి యితివృత్తము సహృదయరంజక మనియు, రంగములు నూతనము లనియు, పాత్రలయందు వైశిష్ట్యము కలదనియు, సర్వోత్కృ

రచనలో ననుస్యూతమనియు నెంచి, యీపుస్తకమును గ్రంథమాలలోఁ జేర్చితిమి.

ఆదిమగ్రంథకారుడగు కాశీనాథుఁడు నవలలోని గ్రామనామముల నేలనో యుల్లేఖింప లేదు. అయ్యది లోపమైనను గ్రంథభాగములో నెచ్చటను దద్విషయమై సంశయము కలుగదు. గంగాబాయి మరణ వృత్తాంతము సుసంగతముగా నున్నట్లు తోఁచుట లేదు ఇట్టి వర్ణన మేదో యింగ్లీషునవలలోఁ గలదు.

మనభాషలో స్వతంత్రముగా రచింపఁబడు నవలలలోఁ జాల వాని కన్న నిది యెక్కువ హృదయంగమముగా నుండుననియు, బంగాళీ నవలల కాంధ్రీకరణములు చదువువారల కించుక మార్పు కల్పించి, మహారాష్ట్రమున మానసికవిహారానందము సమకూర్చు ననియు నమ్ముచున్నాము.

శివశంకర శాస్త్రి

సాహితీసమితి. గుంటూరు

# పీఠిక

ఈగ్రంథము శ్రీయుత కాశీనాథ రఘునాథమిత్రగారిచే మహారాష్ట్రభాషయందు "ధాకట్యా సూన్ బాయి" యను పేర గద్యములో వ్రాయఁబడినది. ఈనవలా కారుఁ డీగ్రంథమునే గాక స్వకపోలకల్పితములును, బెంగాలి, ఇంగ్లీషు గ్రంథముల కనువాదములును గొన్నిటేని దన మాతృభాషయందు విరచించి ఖ్యాతి గాంచియుండెను. వీరి శైలి మృదుమధురము, భాష పాత్రోచితము, కథాచమత్కృతి నవీనము, పాత్రపోషణ మద్వితీయమునై యలరారు చుండును.

ఈగ్రంథము నేనాంధ్రీకరింతునని వ్రాసిన వెంటనే శ్రీమిత్రగారు నాకనుమతి యొసంగిరి. అందులకై వారి కనేక వందనములు.

శ్రీశ్రీ అడ్డేపల్లి లక్ష్మణస్వామిగారు నాయీగ్రంథమును దమసరస్వతీగ్రంథమండలికిఁ గైకొనినందులకు వారికి నెంతయుఁ గృతజ్ఞుఁడను.

శ్రావకరపు నరసింహము.

# చిన్నకోడలు

## ౧

వైశాఖమాసము. పగలు పదునొకండుఘంటలసమయము. ఎండ మిక్కిలి తీక్ష్ణముగఁ గాయుచున్నది. ఇంటినుండి బయట కడుగిడుట కెవ్వరికిని మనసొప్పుట లేదు. వీధులు నిర్మానుష్యముగ నుండెను. ఇంతదనుక పొలములలో మేయుచున్నపశువులు మెల్లమెల్లన వృక్షచ్ఛాయల నాశ్రయించుచుండెను. ఉష్ణకాలమున వెడలినపక్షిగణంబు లీసమయమున మేతలకై సంచరించుట మాని, తరుసంతతులపై నతిశీతలము లైనచివురుజొంపములమాటున డాగి యుండెను. పురప్రాంతవిశాలతరుబృందము లింతకుమున్ను కోకిలాది ద్విజసంతతులకలరవములతో నొప్పుచు నిప్పట్టున ప్రశాంతముగ నుండెను. ఎల్లెడల శాంతిదేవిసామ్రాజ్యము వ్యాప్తమై యుండెను.

గ్రామబాహ్యప్రదేశము లిట్లు సుశాంతముగఁ గానవచ్చుచున్నను పవనానదిపై మాత్రము సందడి మెండుగ నుండెను. ఆగ్రామమునఁ గలవృద్ధప్రౌఢతరుణస్త్రీలు బాలికలు మొదలగువారి కోలాహలము మిన్ను ముట్టుచుండెను. కొందరు స్నానమొనర్చుచుండిరి. కొందఱు బిందెలు భాండములును దోముచుండిరి కొందరు వస్త్రములుదుకుచుండిరి. కొంద ఱుతికినమడుఁగుల నారవేయుచుండిరి. కొంద ఱేమో సేయుచుండిరి. ఇట్టు లెంతయు సందడిమీఱి యుండెను. ఇందఱాడువాండ్రొక్కెడఁ జేరి శాంతత పేరైన నెత్తవచ్చునా? ఇరువురుస్త్రీలు కలిసికొనుటయు స్తబ్ధముగా నుండుటయు నెప్పుడైన సంభవించునా?

ఆసమయమున పవనానదీతటమున మహాత్తరవిషయ మొక్కటి చర్చింపఁబడుచుండెను. సగుణాబాయివలనఁ దద్విషయము ప్రారంభ-

మన్యాను. " లేదమ్మా! ఇంతయుపద్రవ మెక్కడను జూడలేదు. గోపికాబాయీ, మనయాఁడుముండలు చదువుట వ్రాయుట నేర్చుకొనుటెందులకో? ఉద్యోగములు తగులబెట్టు దురు కాఁబోలు! ఈముండలు తెగఁబడినారు. "

హస్తమునఁగలభాండము చప్పుచప్పున నీటిలో ముంచి గోపికాబాయి యిట్లనెను "కానిచో మతేమి? కానిలే, నేనొక్కటి చెప్పెదను. దాసిమొగము ముండ! దాని కెంత గర్వమే! మగని కేమైన సంపాదనా చట్టుబండలా? మెడలో రెండు గుల్లల లయిన నున్నవా యింతపొగరుకు? ఒంటికి చిన్నమెత్తుబంగారము లేదుకద! పొద్దున తినిన సాయంత్ర మెట్లురా భగవంతుఁడా, అనేదిగులు. మఱియూ చచ్చుఁదాని కీమిడిసిపా టెందుకో?"

"బాగుగా చెప్పితివి!" అని యమునాబాయి తన యంగీకారమును సూచించుచు "ఆరోజున పార్వతి బిడ్డలిద్దఱు సన్నమో రామచంద్రా అని వీధిలో నేడ్చుచు నిలుచుని యుండ మాయింటికిఁ గొనిపోయి నేను వారిరువురకు నన్నము పెట్టితిని. దాని కేమిచేటో! దాని కది విష మయిపోయినది! ఎక్కడనుండియో పరుగుపరుగున వచ్చి, నోటికి వచ్చినట్లు కూసి, ఆపిల్లల సిద్దఱను తెగబాది యింటికిఁ దీసుకొని పోయినది. అమ్మా! నిజము చెప్పినను నమ్ముదువు, అసత్యము చెప్పినను నమ్మఁగువు. ఆరోజునుండి దానిపైఁగైన నెత్తుటలేదు." అనెను.

ఇంతలో నానాతల్లి యుతుకుచున్న చీరె వస్త్రే చేతఁ బట్టుకొని యిట్లనియెను. "ఏమమ్మా! చదువుట వ్రాయుట వచ్చినందువల్లనే నా యీపిల్లవాని కింతయతిశయము? అమ్మా, నాకును మిగుల భయమగుచున్నది. మానానాపెండ్లాము కూడా చదువుకొనిన" దఁట. యమునాబాయి తనలోఁ దాను నవ్వుకొనుచు గుడ్లు మిటకరించుచు

"పిన్నీ! నీ కాథయు మక్కుఅలేదులే. మీద్వారకది వానాకాలపు చదువేలే!" అని పలికెను.

అంత యశోదాబాయి యిట్లనెను. "స్త్రీలు విద్యనేర్చికొనుటెంతయును మంచిదేగాని చెడుగేమాత్రమును కాదు. అంతే మొందుకమ్మా! పార్వతిసంగతి పోనిమ్ము. రాధమ్మ చిన్న కోడలు లక్ష్మి గతి చూడుము! వెళ్లినమార్గశిరమాసమున మామగారితద్దినమునకు వచ్చినది. అందఱితో నాడుచుఁ బాడుచు నెంతకలసిమెలసి యున్నది! చిన్నతన మైనను ఎంతమర్యాద, ఎంతయణఁకువ! గర్వ మన నెట్టిదో యది యెఱుఁగనే యెఱుఁగదు—

"అయితే పిన్నీ! లక్ష్మి యింతవఱకు అత్తవారింటికిఁ గాపురమునకు రాలేదేమో?" అని గంగాబాయి నడుమఁ బ్రశ్నించెను.

నానాతల్లి తాను చేయుచున్నపని మాని యిట్లనియె. "వచ్చె నెందులకు! తినుటకిట నేమి యున్నది? కూటికి గతి లేనికాఁపురము! లక్ష్మి బావ సదాశివరావు ఎప్పుడు నిల్లు కనిపెట్టుకొని కూర్చుండి యుండును. పనిపాటులు లేవు. ఇఁక విశ్వసంగతి చూడ పనిలోను మాటలలోను వట్టివ్యర్థుఁడు! పాపము, కానిడబ్బు సంపాదించు తెలివి కూడ లేదు. అతని సంగతి యింకను నీవు వినలేదుకాబోలు. (ఇటునటు చూచి రహస్యముగా) వెనుక మామగారితద్దినమునకు లక్ష్మి వచ్చినప్పుడు దానినగ లన్నియు లాగికొనినారఁట. అందుల కనియే దానితండ్రి యింతవఱకు దాని నత్తవారింటికిఁ బంపలేదు"

యశోదాబాయి యిట్లనెను. "లక్ష్మి మగఁ డల్లరిచిల్లరివాఁడని చెప్పెదరు. కాని వాఁ డెంతో పరోపకారబుద్ధి కలవాఁ డమ్మా! రాత్రి గాని పగలు కాని యేదేనియాపద కలిగి యెవ్వరైనను కేక వైచినఁజాలు, విసుఁగుకొనక పరుగెత్తుకొని వచ్చును. వినాయకరావు వంటిదయాదాక్షిణ్యములు గలవానిని నేనుమాత్ర మెక్కడను

చూడ లేదమ్మా!"

ఇవ్విధమున వాఁడు వాగలసంభాషణ మెంతయు వింతగా నుండెను. ఇంతలో రణమని బిందె చప్పుడుచేయుచు పార్వతియత్తగారు రాధాబాయి మెల్ల మెల్లగ పవనానది రేవు సమీపించెను. అంత నాస్త్రీ లెల్లరు రాధ వచ్చె రాధ వచ్చె నని కనుసన్నల నొకరి కొకరు దెలిపికొనుచు నిశ్శబ్దముగ నుండిరి. కొందఱు మునువటివలెనే తమతమ భాండములు వడివడిఁ దోముచుండిరి. కొంద ఱున్నరన్ను రని బట్టల నుతికికొను చుండిరి. కొందఱు పవనానదీతటమునఁ గల గణపతివిగ్రహమునకుఁ బ్రదక్షిణము లొనర్చు చుండిరి. ఇట్లు వారు తమతమ కార్యములయందు నిమగ్నలై యుండిరి. ఎవరికోట నొక్కమాటైన వెలువడుట లేదు. గంభీరములు, విరక్తములు నగు రాధచూపులు తమపైఁ బ్రసరింపఁగనే వారు తమతమపనుల నెట్లో యట్లు ముగించుకొని నిశ్శబ్దముగ నింటిత్రోవఁ బట్టిరి. నానాతల్లి తప్ప తక్కినయందఱు మెల్లమెల్లగా నంతర్ధాన మయిరి.

కొంతసేపటికి రాధ తనలో "ఔరా, రవ్వంతైన నజ్ఞానము లేదే! ఈసిగ్గుమాలినది నాకెక్కడ దాపరించిది! నేఁ జచ్చినతరువాత తన స్థితి యెట్లుండునో రేపుకాని తెలియదు. నాతల పగిలి చచ్చియైన పోను! భగవంతునకుఁగూడ నాపై దయ రా లేదు! వాఁడు నన్నె త్తుకొనియైనఁ బోవఁడు! రెండుజాములప్రొద్దెక్కినది. ఇంతవఱకు స్నాన మైన లేదు. దిక్కుమాలినదుండను! చచ్చియయిన నేనే పాచిబిందె చేతబట్టుకొని రావలెను—" అనుకొనెను.

నానాతల్లి విఘ్నేశ్వరునకుఁ బ్రదక్షిణ మొనర్చి యుతికిపమడుఁ గులు భుజముపై వైచికొని, యిట్లనెను. రాధమ్మపిన్నీ! నీసంగతి జూడ "ముక్కుచిన్న ముత్తెము పెద్ద"వలె నున్నది. ఇంటుకు నీవయా స్వభావమేకదా కారణము? నే నొకటి చెప్పెదను. పిల్లలను చిన్న

నాఁటినుండియే భయభక్తులతోఁ జూచవలయును."

రాధ దీనవదనయై యిట్లనెను. "ఉమా, నీవు నాకు పెరదానవు కావు. గావున మనసిచ్చి చెప్పుచున్నాను." అని ఉమాబాయి చేయి పట్టుకొనియెను. వారిరువురు నొడ్డునకు వచ్చి సోపానముపై గూర్చుండిరి పిమ్మటఁ గొంతతడవునకు రాధాబాయి ఉమాబాయితోఁ దనపెద్దకోడలు పాల్పడు దుఃఖములను జెప్ప మొదలిడెను. కాని యవి తుదముట్ట నయ్యెను పలుకుచుఁ బలుకుచు నామె యాకస్మికముగా గద్గదకంఠయై మాటాడఁజాలదయ్యెను. కన్నులనుండి గంగా యమునాప్రవాహములు ప్రారంభమయ్యెను.

ఉమాబాయి మంచిమాటలతో నామె దుఃఖమును నివారింప సాగెను. ఆమె యిట్లనెను "పిన్నీ! పార్వతిని కొన్ని దినములు పుట్టి నింటికిఁ బంపుము. నీకీసమయము మనకనుకూలముగా లేదు. అందువలన జెప్పుచుంటిని. కొన్నిదినములలో లక్ష్మిని దీసికొని రమ్ము. ఆపిల్ల నిజముగా లక్ష్మియేసుమా!"

రాధ కన్నులు దుడిచికొని యిట్లనియెను. "దానినిచటికిఁ దీసికొని వచ్చి యేమి చేయుదును. అయ్యయో బాల్యమునందె చక్కని విద్య నేర్చినదే. అందువలన దిగులుపడుచున్నది. ఇఁక మావినా యకునిసంగతి నీ కెఱిఁగియే యుంటివి కదా! ఆవెఱ్ఱివెధవకు సంసార గోష్ఠియే లేదు. ఎప్పుడు గోళీలపని చక్కఁబెట్టుటకు మాత్రము వాఁడు సిద్ధము. ఈదినము వరకు చెప్పగావింటిని. వ్యాసభట్టుగారి అన్నపెండ్లా మునకు మేనమామగారి తమ్మునికొడుకు బానసవీధి వచ్చిపోయినాఁ డఁట. ఆశవము మావినాయకుఁడు మోసినాఁ డఁట. వెంకోజీపంతులు పిన్నతండ్రిభార్య కాశీయాత్రకుఁ బోవుచుండఁ దా నావెంకుఁ దోడుగ నరిగెనఁట. పీనుఁగ మోసిన నాఁటిరాత్రి శ్మశానములో నెక్కడ జడిసినాఁడో చిన్నకుంక యని తెల్లవాఱువఱకు నేను వాని

తలదగ్గఱనే కూర్చుంటివి. ఈలాటి కెలిమాలినవాం డెచ్చటను లేఁడే ఉమా ఈలాటితుంటరిపనులుచేసి నన్ను వేధించుకొని తినుచున్నాఁడు—"

ఉమాబాయి నవ్వుచు నిట్లనియెను. "కోడలిని తీసికొనివచ్చినచో మనవానిమనసు సంసారమునందే వర్తించును. ఇదియే మంచి యుపాయము."

ఇట్లు వారిరువురు కొంతసేపు ప్రసంగించిరి. అనంతరము ఉమాబాయి తనదారి నేగెను. పిమ్మట రాధ బిందె భుజమున నిడికొని యింటిదారి పట్టెను. రాధహృదయాకాశమున ఉమాబాయిపలికిన యాతుదివాక్యమే ప్రతిధ్వనించుచుండెను. అట్టియోజనతోనే యామె దారిని నడచుచు నింటి కరిగెను.

౨

సదాశివరావుగృహ మొకటియంతస్తుమేడ. మంచికాలమున తాతతో కట్టఁబడినను నీసమయమున నందు శిథిలము లైనభాగము లచ్చటచ్చటఁ గానవచ్చుచుండెను. వీధిగుమ్మమునంటియే యొక్కచావడి యుండెను. అయ్యది యిప్పుడు కూర్చుండుటకుఁ గాని నిలుచుటకుఁ గాని యేమాత్రము యోగ్యముగ లేదు. ఎలుకలు పందికొక్కులు మొదలగునవి రేయుం బవళ్ళచ్చట నిర్విఘ్నముగ విహార మొనర్చుచుండును. చావడిలో నొకప్రక్క దేవతార్చనగది యున్నది. ఇప్పు డయ్యదికూడ కీటకప్రభృతులకు లీలావిహారభూమియై యొన్నకు కనువైన చిమ్మటలకును దత్కీటకములకు సంపూర్ణసామ్రాజ్యము స్థాపించుట కెంతయు ననువై యుండెను. బీటువారినగోడల యందు మఱ్ఱి రావి మొదలగువృక్షములు వ్యాపించి యుండెను. పడమటింటిసంగతి యింకఁ జెప్పనక్కఱయే లేదు. దానియందు మూఁడు నాల్గు చిన్నగదులు కలవు. అవియు సాధారణస్థితియం దున్నవి.

అందొకటి వంటకు తక్కువవి పడక మొదలగువానికి. అట్లు గృహ స్థితి శోచనీయమై యుండెను. దొడ్డివైపున నున్నవసారాపైని నొక పెంకైన నిలుచుటకు వీలు లేకుండ విరిగిపడి యుండెను. గోడ లచ్చ టచ్చట నేల గూలుచుండెను అచ్చటచ్చట కసవు నిలిచి యుండు టచే దుర్వాసన మెండుగ నుండెను. ఇంటి నెచ్చట జూచినను మూర్తీ భవించిన దారిద్ర్యదేవత విరాజమానయై యుండెను. రాధ గృహము జేరి భుజముపై నున్న యుదకభాండము స్వయంపాక గృహమున నుంచి కట్టుకొన్న తడిబట్ట విప్పి "పిల్లా పిల్లా ఓసిపిల్లా" అని కేక వైచెను.

పార్వతి తనగదియందు చాపపై బడి గుఱ్ఱుకొట్టుచు నిద్రించు చుండెను అత్తగారు పిలిచినపిలుపు సంతయు నామెకు వినరా దయ్యెను. పార్వతి యెందో పనిమీద నిరుగుపొరుగిండ్ల కేగి యుండనోపు నని రాధ తలంచెను మరల వెంటనే యామెమనసున కేమిస్మరణకు వచ్చెనో గాని తత్క్షణమే పార్వతి నిద్రించుచున్న గదిగవాక్షమున కడ్డముగ బెట్టిన బల్ల నొక్కవిసురున దొబ్బి లోనికి తొంగి చూచెను. పార్వతి లోన గుఱక పెట్టుచు హాయిగ గాఢసుషుప్తియందు మునిగి యుండెను.

చిన్నతనమునుండియు పెద్దనోరు పెట్టుకొని బడబడవాగు వ్యాధి రాధాబాయికి గలదు. ఎవరితో గలహించినను క్షణకాలములోనే మరల వారితో నవ్వుచు మాటలాడును. పాప మీమె యంతఃకరణము నిష్కాపట్యము. గృహకృత్యములను జక్కబెట్టుటయం దామె కెంతయు నాసక్తి. కాని పని చేయునప్పుడు నడుమనడుమ నెవ్వరినైన పెద్దనోరు పెట్టుకొని కేకలు వేయుచు, గొణుగుచు, సణుగుచునుండినగాని యామె యుత్సాహముతో పని చేయ నోపదు. వివాదమునకే గాని జగ డమునకుగాని యెవ్వరు లేని యుప్పు డామె తన దురదృష్టమునకు వగ

చూచుచుఁ గూగుచుండును. అట్లు కానిచో పాపము నోరెఱుంగనిజంతు వులు, పిల్లి, ఆవుదూడ మొదలగువానిపై నానమయమునఁ దనసహ జపాండిత్యముఁ గనఁబఱచి తృప్తిఁ బొందుచుండును. తుదకు మనుజులు గాని మఱియేజంతువులు గాని కానరానియెడల నదృశ్యమైనట్టి కోపదేవతయైన సాక్షాత్కరించినఁ గాని యామెమనసునకు సంతుష్టియే కలుగదు. అటులయ్యు పెద్దకోడలగు పార్వతి సమక్షమున మాత్రి మామెనోరు తాళమువైచుకొని యుండును. పాప మొక్క మాటైన నాడ సాహసపడు. కారణ మీమె పార్వతియట్టిది. ఇప్పట్టున గోపిలు నిద్రించుచుండుట యామెకంటఁబడినది. ఇట్లు నాయాసముగఁ బ్రాపించిన సుయోగ మామె కోపాగ్నిలోఁ బోయిచ్చునా?

"ఇనుమంతయు బుద్ధి లేదే! తిండికి తిమ్మరాజు, పనికి పోతరాజు. అన్నట్లు పొట్ట పగుల మెక్కి అమ్మగారు హాయిగా శయనించి నది. నాప్రారబ్ధము నానోట మట్టికొట్టి సీటచుక్కయైనఁ బడ లేదే! దీనిని కొడుకునకు పెండ్లిచేసి తీసికొనివచ్చుట దేవతాగ్నిన పెట్టినవలె కూర్చుండఁబెట్టుటకుఁ గాఁబోలు! అనుకొని తినేవంగడ ములోఁ బుట్టినదానికి—"

అర్ధోక్తియందే పార్వతి తేకువ్రేసినదానిచందమునఁ బిచాలున లేచి రెండుకన్నవిసరునఁ దలుపు దెఱచుకొని బయటనడుగు పెట్టుచునే రాధ యాలికిపడియెను. పార్వతి కన్నులింతింతచేసి, కోపవేగమున గర్జించుచు, "ఎవరు నాతెండ్రియా మనగుకొని తిరువారు? ఇచట వెలిఁగి పడుచున్న దేమో కనఁబడుచునే యున్నదిగదా! మీవాకిట మాత్ర మేమనుఁ గూగిసలాడుచున్నది" అని పలికెను

పార్వతి నోటినుండి వెలువడిన నిందావాక్యములను పాప మామె దురలికి చక్కఁగ దెలియవచ్చినవి కావు. వారు నేనుఁ గూగులాడుచున్న దనుమాటమాత్రి మామెహృదయమునకు శూలమువలె నాటెను.

రాధనేత్రము లశ్రుపూరితము లయ్యెను. కొంతతడవున కామె యేడ్వఁదొడఁగెను. పార్వతి కిమెరోదన మొనర్చుట యణుమాత్రము నిష్టము లేదు. నిజమే. బిడ్డలు గలకొంప. మట్టమధ్యాహ్నసమయము. ఇట్టిసమయమునఁ బెద్దపెట్టున నేడ్చుట యమంగళముకాదా? పార్వతికి సహన మెటులుండును ? ఆమె తలపంకించుచు క్రోధపరవశయై యిట్లనియెను. "ఇదిగో నామాట వినుఁడు. మీరిట్లు వేళకాని వేళ నిండినయింటఁ గూర్చుని యేడ్చుచుండుట భావ్యముకాదు. ఎంతపాపిష్ఠివేళ నీకొంపలో నడుగుపెట్టితినో కాస యొక్కనాఁడైన సుఖ మెఱుఁగను. ఇఁటికి రానిమ్ము. దీనికి తగిన కట్టుబా టేదియో చేసిగాని నే నీ యింట గ్రుక్కెఁడు నీరైనఁ ద్రావను."

"చేయుము, చేయుము. ఏమిచేసెదవ మ్మా! నన్నింటనుంచి గెంటిం చెదవా ? చేయుము. నీవు సుఖముగా నుండుము. నేనుగూడ నీ బాధనుండి విముక్త నయ్యెదను ఈనిబొల్లి బెదరింపులు నానోట నేమియు కట్టఁజాలవు——" అని రాధ మిక్కిలి యేడ్వసాగెను.

పార్వతి తీవ్రతర మగుకోపమున నిట్లనియెను ఆహాహా ! యీగడుసు ముసలిమాటలు వినండి ! నే నన్నదానిలో నాయర్థ మేమైన నున్నదా ! "

పార్వతినోటనుండి యీపలుకులు వెలువడ రాధ యాగ్రహమునకు పరిమితి కానరా దయ్యెను. ఆమెయధరము చలింపఁ దొడఁగెను. ఇరువురును చేతులుచేతులు కలుపఁ జొచ్చిరి. ఒకరినొకరు కొండలపైఁ జేతులు వైచి క్రిందికిఁ బడఁద్రోయ యత్నించు చుండిరి. ఒకరి నొకరు తిట్టికొనఁ గడఁగిరి. ఏడుపులు మెం డయ్యెను. ఇట్లు ఘోర సంగ్రామము మిలిమిలాఉ చుండెను. ఇంట నిట్లు భయంకరకదనము జరుగుచుండ సదాశివరావు గృహమున కరుదెంచెను. లోపల జరుగుచున్న యీప్రచండయుద్ధప్రసంగ మాతనికి వీధిలోనికి వినవచ్చెను.

అనవ్వుడి చెవిసోఁకినంత నాతని ప్రాణములు పై కెగసిపోయెను. పాపము ముందున కాతని కడుగు సాగదయ్యెను. తాను లోని కరిగినచో నాకలహాగ్ని మఱియుఁ బ్రజ్వరిల్లునని యతఁడు విచారింపసాగెను. భయమున నాతఁడు మెల్లమెల్లన నడుగు లిడుచు పడమటింటిలోని తనగది జేరెను. కొడుకును గాంచినంత రాధ పెద్దపెట్టున రోదన మొనర్చుచు కోడలిదర్ణయమంతయుఁ జెప్ప మొదలిడెను. పార్వతియుఁ దన బెళుకుఁజూపుల నాతనిపైఁ బఱపి టక్కుచు నాగుచు సోలుచు భర్తకడ నత్తగారి గుణవర్ణన మొనర్పఁ గడఁగెను. అది విని వృద్ధురాలు నిర్ఘాంతపడియెను. సదాశివరావు మిక్కిలిచిక్కునఁ జిక్కుకొనియెను. ఒకవంక ప్రత్యక్ష మాతృదేవత, మరియొకవంక మూర్తీభవించిన ధర్మపత్ని. కొంతదనుక నాతఁడు పాషాణమూర్తివలె స్తబ్ధుడై యుండెను. వానికి నోట మాటయే లేదు. కొంతవడి కాతఁడు భార్య నతినిందాకరము లగుమాటలతో మందలించెను. అందులకుఁ బార్వతి మిక్కిలిరోదన మొనర్పఁ దొడఁగెను. అట్లు కొంతతడ వేడ్చియేడ్చి, నిదురించుచున్న తనబిడ్డల నిద్దురనుమేలుకొల్పి వెంట నిడుకొని బిరబిరనడచి యామె వీధివెంటఁ బడెను. పోవునపు డామె భర్తయెడ యథేచ్ఛముగ నొనర్పవలసిన షోడశోపచారపూజల కేమియుఁ గొఱత కలుగనిచ్చినది కాదు.

గృహమునుండి వెలువడునపు డామెను నెవ్వరు వారింపరైరి. సదాశివరా వామెను వారింపడయ్యెనే యని యతనిని నిందింపరాదు. రాధయాగ్రహ మింతవఱకును శాంతింపమి నామెకును వారించుట శక్య మైనదకాదు. అయినను పార్వతి పుట్టినింటి కేగు నని యెవ్వరును దలఁపరైరి. పార్వతియు నట్టియూహతో బయలుదేఱె నని చెప్పుటకు వలనుపడదు. తానేగుచుండ భర్తయో యత్తయో తన్ను బతిమాలుదు రని యట్లొనర్చి యుండును. ఇట్లు కొంతత

వచ్చెను. అప్పటికి తన్ను వారింప నెవ్వరు రారైరి. అట్లగుట నామెక్రోధానలము ద్విగుణిత మయ్యెను. క్రోధావేశమున వెనుక ముందు లరయక మంచిచెడుగులను విచారింపక రయమున నటనుండి నడిచి మఱియొకవీధిం జొచ్చి, యందున్న యొక శూద్రగృహమున కరిగి, యా యింటియామెను వెంట నిడికొని యామె పుట్టినింటి కేగెను. ఇచట సదాశివరావు తల్లితో స్పృశోకనము లగు నానావాక్యములతో నిట్లనియె.

"అమ్మా! నీవే యాలోచింపుము. నాయవస్థ యెట్లున్నదో! ఈదినము గడచిన రేపటిదిన మెట్లు గడచునా భగవంతుఁడా యని నామనస్సెప్పుడు నారాటము నందు చుండును. ఇందులో నీవును కోడలును రేయుంబవళ్లు పోరాడుచు రోదనము చేయుచున్నచో నామనస్సునకు స్వస్థత యెట్లుండును? ఇట్టియింట లక్ష్మి నిలుచుట యెట్లు?

కొమరుని పలుకులాలించి రాధ వెక్కి వెక్కి యేడువ దొడఁగెను. సంతాపార్ణవమున మునిఁగియున్న సదాశివరావు బి సెంకయు నొచ్చి యుండుటచే నాతఁడు తల్లి మాటాడ నసమర్థుఁడయ్యెను. అతఁ డట్లు మిన్నకుండుటవలన తల్లి మనసున కొంకోకష్టముగ నుండెను. ఆమె వెనుకటివృత్తాంతమంతయు జ్ఞప్తికిఁ దెచ్చుకొని పెద్దపెట్టున రోదన మొనర్పఁ దొడఁగెను. కాని యామె శోకించినంతను నది యొక మేమియుఁ గానరా దయ్యెను. సంతప్తమానసుఁ డగు సదాశివుఁ డటనుండి వెడలి తల్లిదుఃఖము కొంత శాంతించుటకై తాంబోలు మరల నటకు రాఁడయ్యెను.

రాధరోదనము తారస్థాయియందుండెను. క్రమక్రమముగా నయ్యది మధ్యస్థాయి ననుగమించెను. మంద్రస్థాయియందు మాత్ర మెంత కాల ముండఁగలదు? మెల్లమెల్లగ నది మంద్రస్థాయిని సమీపించె. తుట్టతుద కది శబ్దశూన్య మయ్యెను.

## 3

రమారమి యొంటిగంటకు మెల్లమెల్లగ వినాయకరావు గృహాభిముఖుఁడై వచ్చెను. వాకిటనుండియే యాతఁడు కేకలువేయ మొదలిడెను. "అమ్మా, అమ్మా, ఇ అమ్మా ఆ."

రాధ రోదన మప్పటికి కడముట్టి యుండెను. ఆమె తన పైట చెరఁగు తలగండ ముసుఁగిడి గదిలో నొకవైపున నేలపైఁ బరుండి నిదురించుచుండెను. సదాశివరావు తనగదియందు చింతాంబుధిమగ్నుఁడై కూర్చుండి యుండెను. అట్లగుట వినాయకుని కేక కెట్లు ఓయను ప్రతిశబ్దము వచ్చును? మరల వినాయకరావు "వదినే, ఓవదినే అరే ఇంట్లో నెవరును లేరా యేమి!" యనుకొనియెను.

వినాయకుని యారాంద్రఘోషము వినఁగనే సదాశివుఁడు సుంకసమున గదివెడలివచ్చి "ఎవరు—వినూ! ఇటు రా" అనియెను.

అన్నవదనుఁడగు సదాశివుని గాంచినంతనే వినాయకరావు భయమంది, రయమున నాతని డాసి కంపితగాత్రుఁడై "అన్నా యింట నెవరును కనఁబడరేమి? ఇదియేమి? అమ్మయును వదినెయు నెక్కడికైన వెళ్లిరా?" అని అడిగెను.

"అమ్మ లోపలిగదిలో పండుకొని యున్నది. మీవదిన యెక్కడికో పోయినది—జగ్గును రాముని వెంటబెట్టుకొని కోపమున."

"ఆ? పోట్లాట గీట్లాట జరిగినదని తోఁచుచున్నది"

"మహాయుద్ధము"

"సరే వదిన యెక్కడి కేగినది!"

"ఎక్కడికో వల్లకాటిలోనికి!"

అది విని వినాయకుఁ డేమియు మాటలాడలేదు. అతఁడు మెల్ల మెల్లగ నింటివెలుపలకు నడచుచుండెను. అట్లేగుట గాంచి సదాశివరావిట్లనెను. వినూ, యెక్కడికి పోవుచుంటివి?"

"వదిన యెక్కడికేగినదో విచారించి వచ్చెదను."

"చావలి మ్యాగయ్యాళిముండను. చాల పొద్దెక్కినది. నీవు ముందు భోజనము చేయుము. అమ్మకూడ నింతవఱకు భోజనము చేయలేదు. భోజనమైన పిమ్మట సావకాశముగ వెళ్ళవచ్చును."

"జగ్గు రాముడుఁగూడ నెంట నున్నారా?"

"అందువలననే యింకలో నెక్కడికి వెళ్ళును? అంతగా వెళ్ళిన రామశాస్త్రిగారింటికి."

అయినది వినాయకరావు ప్రయత్నము వెనుదిరిగినది. మరల నాతఁడు గృహాంతరము జొచ్చి తల్లి పరున్నగది ప్రవేశించెను. అచట చేరినంతనే కూర్చుండి కదనప్రకరణ మంతయు వేఱుగ నాతఁడు విచారించి తెలిసికొన నవసరములే దయ్యెను. ఆతఁడు నిశ్శబ్దమున నడుగు లిడుచు తల్లివా మంచము దగ్గఱకుఁ బోయి కూర్చుండి మెల్లమెల్లగ నామెపాదము లొత్తసాగెను. అప్పటికిని క్రోధావేశ ముక్కపెట్టుచు రానను చుట్టుముట్టెను. అట్లగుట వినాయకరావొనర్చు పాదసేవ యంతయు నామెకు రుచించ దయ్యెను. ఆపైన నామె కాలితో నాతని దొలఁగఁ ద్రోసెను. వినాయకరావు మాతృదేవతను శాంతిపఱచుటకై తన సహనమున భీష్మప్రతిజ్ఞఁ బూనియుండెను. ఆమె యేమి చేసినను నాతఁడు తనపనినుండి మాత్రము విరమింపఁ డయ్యెను. అందువలన తల్లి కెంతయు నాగ్రహము వచ్చెను. "పొమ్ము. ఇచటనుండి లేచి పొమ్ము. చచ్చినవాఁడా! మొగము చూపించఁబోకు. నీబుద్ధి బుగ్గిగాను! రేయుంబవళ్ళు నాయెముకలు విఱుగు చున్నవి. మీసంసారముమీఁద నిప్పుపెట్టా! దేవుఁడు నన్నొక్కమారు తీసుకొనిపోవఁడే! ఈవల్లకాటశ్రమయంతయు నాకు వదలియైన పోను!"

వినాయకరావు మాతృసేవయం దన్యథా వర్తింపక నవ్వుచు ని

ట్లనియెను. "అమ్మా! రెండుజాములు దాటినది. కడుపులో కాకులు కూయుచున్నవి. ముందన్నము పెట్టి తరువాత నీ యిచ్చవచ్చి నట్లన—"

రాధ కహంకారము మితిమీరెను. "చచ్చినవాఁడా! అన్నము పెట్టుమనుటకు నీకు సిగ్గన లేదే! సిగ్గుమాలినవిధవా! ప్రతిదినము నిద్దుర లేచునప్పటి కన్న మెట్లువచ్చును? ఒక్కవిధవవైన దమ్మిడీ సంపాదించుప్రయోజకత్వము లేదు. పెద్దగవిడిగే దెలవలె తినుట మాత్రమే! రెండుజాములైన గట? ఇంతసేపటివఱ కెక్కడ నణఁగిపోతివి? ఏమిపని వంగబెట్టుచుంటివి? నాపాప మిట్లు బద్ధలైనది. ఒక్కనికైన జ్ఞానము లేదు."

ఇవ్విధముగఁ దిట్లతోఁ గొంతవడి యరిచెను. వినాయకుఁడు తా నొనర్చుచుండిన పాదసేవమాత్రము విరమింపఁ డయ్యెను. జననివలన ననుదిన మిట్టిసంభావన జరుగనిది యెన్నఁడును కడుపులోని కన్నము పోదని పాప మాతనికి జ్ఞప్తియే యుండదు. ఎల్లప్పుడు నిది నవాఱ మగుట వినాయకుఁ డానందమున నిట్లనియెను. "అమ్మా శివాలయములోని నందీశ్వరుని నెఱు గుదువుకదా? మే మీయింట నందులము ముందు నందికి నైవేద్యము పెట్టుదురా లేదా? తరువాత నీయిష్టము వచ్చినన్ని యనుము. అబ్బబ్బా, నా కెంతో యాఁకలి యగుచున్నదే! ఇదిగో నాకడుపు చూడుము. ఎట్లులోపలికి పోయినదో?"

అమాయకుఁడు మూర్ఖుఁడు అజ్ఞాని యైనను నతఁడు కొమరుఁడు; ఎంతైన నామె కన్నతల్లి. ఎట్లు స్వస్థముగఁ బరుండగల్గును? వెనుకటివలె నోటితో ఒడఒడవాగుచు రాధ తడిబట్ట కట్టుకొని వంటయింటఁ బ్రవేశించి విస్తరి వైచి "చచ్చినవాఁడా! కూర్చుండుము. నీపిండము పిల్లులకు వేయుము." అని యఱచెను.

"ముందు నీకు పిండము వైచి తరువాత నాపిండము వైచుకో

నేనను అమ్మా! నీవుకూడ కూర్చుండుము. ఈదినము మనమిరువురము కూర్చుని తిందము." అని వినాయకుడు నవ్వుచు పలికెను.

అనుకూలాతిశయమున రాధాబాయి కన్ను లశ్రుభరితము లయ్యెను. ఆమె వెక్కివెక్కి యేడ్చుచు "మీయింట నే నిక నెప్పుడు నన్నము ముట్టను. గుప్పెడు తిండికొరకైన జీవించెద కాని మీయింట పంచభక్ష్యపరమాన్నములైనను నాకు వలదు. నోటికి వచ్చిన ట్లెల్ల నది నన్ను కూయునా? చేతులు రోతలునా? అక్కడికిని జరుగుచునే యుండును. దానిచే నడ్డమైన మాటలు పడలేక నా దేహము చిల్లులు పడుచున్నదే! పూర్వజన్మమున నెట్టిపాపము చేసితినో" యనియెను. వినాయకుఁ డిట్లనెను. "ఇప్పుడు నీ వంటివిగదా ఒక్కనికికూడ దమ్మిడీ సంపాదించు జ్ఞానము లేదని. మేము నీ కేమియును పెట్టుటలేదు. నీవే మాకు పెట్టు చుంటివి. ఇంక మాసొమ్మెక్కడ? మా యిల్లెక్కడ? పదినెలమయ మంటివా దానికి నే నేమిచేతును? సంసార మన్న నెంతో సహన ముండవలెను. నీవన్న లక్ష్యము లేకుండ వదిన మాటలాడు చుడును. అటు లుండుట యామెతప్పే ఊరిలో నందఱు నీవిషయమున నామెనే నిందించు చుందురు."

ఈతియ్యనిపలుకులవలన రాధక్రోధము క్రమక్రమముగ తగ్గసాగెను. వినాయకునిపయి నామెకుఁ బ్రేముడి మెండు. పుత్రుని వేడికోలు వలన నామె తానుకూడ విస్తరి వైచికొని వడ్డించుకొని భోజనమునకుఁ గూర్చుండెను. రాధ కాగ్రహ మొదవినతిరి నెంతిపై నగాని కఠిన వాక్కులను బ్రయోగించని యెడల నామె కోపాగ్ని చల్లారదు. వడివడి భోజన మొనర్చి రాధ కొమరునితో నిట్లనియెను "వినూ, మనజగ్గు రాముడు నెక్కడి కేగిరో వారి నొక్కమాటు వెదకి చూడరా, నాయనా!"

తల్లియనుమతి చొప్పున పిల్లల నరయ నేగుటకు వినాయకుఁడు

కొంచె మవకాశము కావలసి యుండెను. కత మీ మన, భోజనానం తరము గంజాయికమ్ము నసాళ మంటునట్లు పీల్చిగాని యాతఁడు కాలు బయటఁ బెట్టడు.

౪

సాయంసమయ మున సదాశివరావుగృహము మిగుల సందడిగ నుండెను. వినాయకరావు గ్రామ మంతయుఁ దిరిగితిరిగి వచ్చెను. వదినె గారిజాడ గాని, యామెబిడ్డలజాడ గాని యిసుమంతయుఁ దెలియ రాదయ్యెను. సదాశివరావు మిగుల వ్యాకులచిత్తుఁడై యుండెను రాధ మిగుల కలవళపడుచు డెను ఇంతలో గణపతితల్లి "పార్వతి యావలివిధిలోనిశూద్రస్త్రీలు వెంటఁగొని పిల్లకోఁగూడ పగలు రెండుజాముల వేళ పుట్టనింటికి వెళ్ళినది " అనువార్త కొనివచ్చెను.

ఈవృత్తాంతే మందఱకు నెఱను రాధమనసును మిగులఁ గలఁచి వైచెను. గణపతితల్లి సదాశివు గృహముననుండి రాగ నీవార్త వీధి పొడుగునను కంటఁ బడినవారికెల్లఁ దెలిపియే యుండెను. అట్లగుట గ్రామమున నిరర్థకముగఁ గూరుచుండువారును నోరుల న్యూనతఁ జూడ ముచ్చటపడు క్షుద్రస్వభావలు నగుస్త్రీలు పెక్కండ్రు గుంపు గుంపుగ మెల్ల మెల్లన సదాశివునిగృహ మలంకరించిరి కొండ ఱువవి తలు పాపము, దుఃఖిత యగురాధకు సమానముగ నెంత యో శ్రమ పడి కన్నుల నీరు దెచ్చి కొనిరి కొంద ఱంగనలు ముఖముల గాంభీర్యము దోలుకాడ నిట్టూర్పులు విడిచిరి కొందఱు పార్వతిని నిందింపఁ దొడఁగిరి. కొందఱు మరల దానిపైనైనఁ గలఁడఁగూడ దని రాధ కుపదేశింపసాగిరి. కొందఱు సదాశివుని దే లోప మనిరి. కొందఱు పార్వతి పుట్టనింటి వంశమును దూఱఁ జొచ్చిరి. నోటికి కేది వచ్చిన నది వాగి మెల్లమెల్లగ నెల్లరుఁ దమతమయిండ్లదారిఁ బట్టిరి ఒక్క తె యైనను దుఃఖమున మఱుగుచున్న రాధ నూఱడింప లేదు.

ధూర్తస్వభావ యగుపార్వతివలననే సంసారమున కెన్నియో యిక్కట్టులు వాటిల్లెను. అందు పార్వతి పుత్రద్వయముగూడఁ దోడు కొని చనుటచే ముదుసలి యగురాధ యెంతో యధీర యయ్యెను. ఆమెనోటితో బడబడవాగుటయే కాని పాప మామెమనసున దురుద్దేశ మణుమాత్ర ముండదు.

దీపములు పెట్టినపిమ్మట వినాయకరావు భోజన మొనర్చుచు నడుమనడుమ కునికిపాట్లు పడుచు సదాశివరావుతో "అన్నా! ముందు సంగతి యేమి?" అనెను

సదాశివుఁడు విరక్తితో "అంతవిచార మెందుకు? పోనిమ్ము. ఆ గయ్యాళి వెళ్ళుటయే మంచిది. ఆ దౌర్భాగ్యురాలి మొగ మింకఁ జూడఁగూడదు." అని పలికెను.

"అది యటు లుండనిమ్ము. అమ్మను సమాధానపెట్టు టెట్లు?"

"అహోరాత్రములు పోట్లాడుట కిరుగు పొరుగువా రెందఱో యున్నారుకదా!"

వినాయకునిమన సప్పుడే గంజాయిమీఁది కొక్కెదాటున పరువెత్తినది. సదాశివుఁడు చెప్పిన దేమో వానికి సరిగా తెలియ దయ్యెను. కడపటిరెండుమూఁడువాక్యములుమాత్ర మాతఁడు విని యిట్లనెను. "ఇరుగుపొరుగువా రనేకు లున్నమాట నిజమే. కాని వా రెవ్వరైన నమ్మను కొంచె మైన నోదార్చిరా?"

పాపము సదాశివుఁ డెంతయు విచారగ్రస్తుఁ డయ్యె. కొంతతడవు వఱకు దుఃఖాతిశయమున స్తబ్ధుఁ డై యుండి గంభీరస్వరమున "ఓరీ వినూ, ఇప్పు డై న దేమో మంచియే యైన దని తలఁచెదను." అని పలికెను.

ఇంతలో రాధ రోదన మొనర్చుచు లోపలినుండి వచ్చి సదాశివునితో నిట్లనెను. "ఏమిమంచిరా నాయనా! నాకుమాత్రము తల

మావులుగ నున్నది. ఊరిలో నందఱు మనలను కాకులు పొడిచినట్లు పొడిచెదరు. మన మెంత బీదవాండ్ర మయినను మానాభిమానము ను పాటింప వలదా? నానోరు పడిపోతే నాకావేళ నేమిదుర్బుద్ధి—"

రాధకన్నులు రెండును నిండిపోయెను. జనని యాకులపాటు గాంచి వంత పుత్రు లిరువురు దుఃఖించిరి. వినాయకుండు కొంతదనుక ఖిన్నుఁడై కూరుచుండి పిమ్మట చప్పుచప్పున నన్నముదిన దొడఁగెను. సదాశివుఁడు మనసున మిగులవిచారించుచుఁ గూర్చుండియుండెను. అట్లు కొంతసే పయినతరువాత సదాశివుఁ డిట్లనియెను. "అమ్మా, మనపైన నీ నింద లేకుండ పోవుట కిప్పు డేమి చేయవలయు నని నీయభిప్రాయము? చెప్పుము."

పయిటకొంగుతోఁ గన్నుల నొత్తియొత్తి యామె యిట్లనెను. "నాయనా తెల్లవాఱునప్పటికి పార్వతిని, పసిబిడ్డల నిరువురును తీసి కొనిరారా! నాబిడ్డలు వెళ్లిపోవుటచే నాయి ల్లంతయు చిన్నపోయి నది. నాయనా, నాకోడలితో నిఁక నెన్నటికిని పోరాడను. దేవుని తోడు దానిమాటమైన నెత్తను. అది నన్ను కొట్టినను సరే. ఆ ఊ అనను. నాకోడలు మంచిది. వెళ్లు నాయనా వెళ్ళు. తెల్లవా రుజామునసే బయలుదేఱి పొమ్ము. ఏలాగో దానిని మంచిచేసికొని రమ్ము. తీసికొని రమ్ము."

అత్తవారింటి కరుగుటకు సదాశివుఁడు మొట్టమొదట నిశ్చయింపఁ డయ్యెను. అది గాంచి వినాయకుఁ డిట్లనెను. "అన్నయ్యా, అమ్మ చెప్పినట్లు చేయుట మే లని నాయభిప్రాయము."

"పోనీ నీవు వెళ్ళరాదా?" అని సదాశివుఁ డనెను.

"అన్నయ్యా, ఇందులకు నన్ను క్షమింపుము. ఆపని నావల్ల కా దబ్బా! నీ వక్కడికి వెళ్ళినట్లయిన నే నిక్కడిపని యంతయుఁ జూచె దను. నీవు తిరిగి వచ్చువఱకు నే నిల్లు కదలను. సంసారభారము నేఁ

చూచుకొందును. నాతల తీసినను సరే, నీ యత్తవారింటికి మాత్రము నేను వెళ్ళను. నాకు భయము బాబో!"

వినాయకుఁ డనగా నితరులకార్యభారము వహించువాఁడే కాని యొక్కదినమునఁ గూడ గృహకృత్యములవిషయమై యాతనికి జ్ఞాపకమే యుండదు. అట్లగుట నిప్పట్టున నాగినోట వెలువడిన యీమాటలు విని సదాశివుఁడు లోలోన సంతసించుచూ చిఱునవ్వుతో నిట్లనెను. "వినూ, నీవే నిజముగ నింటిపనులు చూచునెడల మా యత్తవారింటికే కాదు, ఎచటికి బొమ్మన్న నచటి కరుగుటకు నేను సంసిద్ధుడను."

మఱునాఁ డరుణోదయమునకుఁ బూర్వమే సదాశివుఁ డత్తవారి గ్రామమునకుఁ బ్రయాణమయ్యెను. రాధ సజలనయనయై ప్రేమపురస్సరముగ పార్వతి కెన్నియో సమాచారములఁ జెప్పి పంపెను.

x

సదాశివరా వింటినుండి వెడలినదితడవుగఁ బాచిపని చేయుశూద్ర వనిత సఖూబాయి ముంగిటఁ జొచ్చి "అమ్మగారూ! అమ్మగారూ! యింకానిద్దుర లేవలేదా యేమిటి?" అని కేకవైచెను.

రాధ లోననుండి మండిపడుచు నొక్కుదుటున బయటికి వచ్చి "ఓసిభడవముండా! నీవన్నము తినవా? నీకీబుద్ధి యెవరు చెప్పిరే! నాకోడలిని తీసుకొనివెళ్ళుటకు నీ కేమవసరము వచ్చినదే? ఇంతవఱకును నీవేమో మంచిదాన వనుకొంటిని. కాని ఇంతపని చేతువని తలంచలేదు నీవు లోలోపలనే గోతులు తీయుచుండవు!" అనెను.

సఖూబాయి భయముతో "సామిసాచ్చిగా పారోతమ్మగారు పోట్లాడి వెళుతుండదని నాకు తెలియలేదమ్మా! నాతోటి ఇల్లా చెప్పారు. మాఅయ్య కొంట్లో సాలా జబ్బుసేసిందంట. అందుకోసం యెల్లాలి

రమ్మన్నోరు. అమ్మా, యేంసెయ్యనూ ? నిబద్ధిఅనుకుండా ! పాసి మొగమైనా కడుక్కోలా అలాగే వెల్లాను. వదినెమ్మగారిల్లా అబద్ధాలుచెప్తారని నాకేం తెల్సు ?" అని పలికెను.

రాధకోపం మితిమీఱి నిట్లనియెను. "ఆహాహా, యెంతటక్కులాడివే ! ఓసీ నిజముగ దాగితంత్రికి రోగము వచ్చినట్లయిన బిడ్డల నుకూడ వెంటబెట్టుకొని యెందు కొంటరిగ బోవుచే ? అవకతవకవు ముండా ! నీవుచేసినపని తప్పని తెలుసుకొని, అది కప్పిపుచ్చి నన్నగతాళి చేయుటకు వచ్చితివా ?"

సఖూబాయినేత్రములు అశ్రుభరితము లయ్యెను అది వెక్కి వెక్కి యేడ్చుచు నిట్లనెను. "లేదండమ్మా! మీపాదాలసాచ్చి ! నాబిడ్డతోడు! నాకేం యెరిక లేదు మారాజులు తమ గంజి తాగి తమర్నే నా ఆచ్ఛేపించడం ? తనుగు మాకు తల్లాంటోరు. లేదు లేదమ్మగారూ ! నే నెప్పుడల్లా—"

రాధ పెద్దగొంతుతో కేకలువేయ దొడగెను. రాధ కంతట దాసిపై కొంచెము దయపుట్టెను కావున శాంతస్వరమున నామె యిట్లనెను. "ఓసీ నీకు కొంచె మైనా జ్ఞాన మున్నచో నాతో చెప్పి మఱివెళ్ళుదానవు. యీయిల్లేమి త్రోసులా ఆమడలా ?"

సఖూబాయి కన్నులు దుడిచికొని తల యూచుచు "ఔనౌను. నాకీమాట తోసిందికాదు. ఇయ్యాల్నుంచీ ఇకెప్పుడల్లా సెయ్యను. నా కిప్పుడు తెలిసివచ్చింది." అని చెప్పెను.

"సరే, యేమేసఖూ ! నిన్ను జూడగానే యక్కడివా రంద రేమనిరి?"

"యేంసెప్పనమ్మా ! మమ్మల్నిసూసి అంతా తెల్లమొగా లేశారు. ఎవళ్ళూ యేం నోరెత్తలేదు. వదినెమ్మోరుమట్టికి లాంది. యికెప్పుడు మాత్తోరింటికి రాను. మాఅత్తమ్మ సేతుల్లో వల్లేను. యేషా

ద్దే సూసినా చావనార్థాలే. బువ్వన్నా కడుపునిండా పెట్టడు. ఇట్టే కేంటేంటో చెప్పింది. అయన్నీ చెప్పటానికి నోరాడదు."

సఖూ చెప్పిన యీ సమాచారమంతయు విన[illegible]యున రాధశరీర మాపాదమస్తకము కంపింప నిట్లనెను. "స-రే, స-రే, ఇంక నెన్నఁడు నిక్కడికి రాదు! సరే మంచిపనే! దానిసంగతి యంతయు తెలిసిపోయిందిలే!"

సఖూ మరల నిట్లనెను "అమ్మా! మరిసిపోయినా వదినమ్మ అన్నుండాడే ఆయనగోరు, లేదు లేదు, ఇప్పుడూ దీన్నత్తోరింటికే పంప నన్నాడు. ఇంకోమాట లచ్మీబాయమ్మగారి అళ్ళయ్యా కాపురానికి పంపనన్నాఁడని వదినమ్మోర్లు అళ్ళతో చెప్పింది అమ్మా! యేంచెప్పను! అళ్ళకిమ్మతియ్యా, అళ్ళంతా పకపకా నవ్వేరు."

ఆమాటలు వినినంతనే రాధకోపానలము జాజ్వల్యమానమై ప్రజ్వరిల్లసాగెను. క్రోధావేశముచే నామెకన్నులు గిరగిరఁదిరుగఁ దొడఁగెను. కొంతగడచిన స్వస్థ నిలిచి యుండి పిదప నిట్లనెను. "నాకుఁగనుక నీసంగతి నిన్ననే తెలిపియుండినచో మానదానిని నక్కడికి పంపకపోదును. సరే, సఖూ, ఇట్లుమాడు ఈసంగతి యంతయు నూరిలో నెవరికిని చెప్పకుసుమా! మా పరువంతయు పోవును సుమా!"

సఖూ కొంచెముగాంభీర్యము తెచ్చుకొని యిట్లనెను. "అమ్మా! నాకీసుద్ది మీరు చెలవియ్యాలా? అంతేనా? నేనోరికైనా చెపుతానా?"

ఇంక నేవియో రెండుమూడు శాంతవచనములు పలికి సఖూ యట నుండి బయలు దేఱెను. గృహాము వెడ[illegible]యునంత ప్రయత్నము చేసినను తద్విషయము దా[illegible]దయ్యెను. రాధ

యీవిషయ మేరివద్దను గొంచెముకూడఁ దలపెట్టవల దని సఖూహృదయమునఁ బదిలముచేసి యుండెను. కాని యావృత్తాంత మెవ్వరిచెవి సైనబడవైచి తనభారమును తగ్గించుకొనిన గాని దానిమనసునకు తృప్తి కలుగదయ్యెను. గృహము వెలువడి నప్పటినుండియు నీరహస్య మెవ్వరిముందయిన నెప్పుడు పాఱవేతునా యని యాపె తొందరపడుచుండెను. కాని పాపము, దానిదురదృష్టమువలన నెంతదూరము నడచినను, దారియందు దొక్క పిట్టకూడ కానఁబడ లేదు. విధినంటుకొనియే వడ్లవానియిల్లు కలదు. సఖూ యింటఁ బ్రవేశించి బిగ్గఱగా నిట్లని కేకవైచెను. “యేంసేత్తాండావు వొడ్డోరిప్పా?”

వడ్లవానిభార్య యాసమయమున వంటయిల్లూడ్చుచుండెను. ఆమె చేయుచున్నపనిని వదలి తొందరగా నివలికి వచ్చి “ఏమి టంటావు సఖూ?” అనెను

సక్కుబాయి దొంగవలె నలువంకలఁ గలయఁ జూచి, యెవ్వరు లే రని దృఢమైన పిదప రహస్యముగఁ బార్వతి సమస్తవృత్తాంతము చాతుర్యమున కొంత కల్పించి గాని చెప్పి బహువైచి చివర కిట్లనెను “ఓసే, దాన్నత్తగారికి గాని చెప్పొద్దంది. వొరికన్నా చెప్తే పాతకం మనపళ్లో యేముండుతుంది? మనం పేదోళ్ళం— నాకూట్లో దుమ్ము పడ్తుంది. అప్పతో యాళ్ళంతో చెప్పి ఆళ్ళ నల్లరి సేస్తే నే నరకూప్పంలో పడనూ? నువే చెప్పు?”

వడ్లవానిభార్య యించుక నవ్వి “కాదటే?” అన్నది.

ఈవిధముగ ద్రోహబుద్ధిగలను కంట బడినవారి కెల్ల సక్కుబాయి యీవృత్తాంతము తూచా తప్పకుండఁ జెప్పివైచెను. తనకుఁ గొంచెము పరిచయము గలవా రెవ్వరైన నెదిరించు చుండినను వారల మేలుకొల్పి యీవృత్తాంతము సవిస్తరముగఁ దెలుపు చుండెను. ఇవ్విధమున నిది గ్రామ మంతయు వ్యాపింపఁ జేసెను.

# ౬

ఉదయము తొమ్మిది గంటలయ్యెను. వినాయకుఁడు ఉఁ ఉఁ హాహా హా హా అని కాలుసేతులు సాగదీసికొనుచు, కొడలు విరచికొనుచు నొక్కవిసరున బడకనుండి లేచెను. అతఁడు ప్రాతఃకృత్యముల నిర్వర్తిం చునప్పటికి తొమ్మిదిన్నర గంటలయ్యెను. అనంతరము వినాయకరావు గారి దినచర్య ప్రారంభమయ్యెను. ప్రప్రథమమున చిలుము (గంజాయి త్రాగుసాధనము) సిద్ధమైనది. అతఁడు మిల్లువిడచి బయట కేఁగు నప్పుడు నిత్యకృత్యములలో నెదానికుం దైన పౌరబగను గాని నాల్గుగ్రుక్కల చిలుము పీల్పుటయా మాత్రము పోకుండదని యింతవఱకెన్నఁడును విడువకుండెను. అట్లుగట చక్కగ కడిగి తుడిచి పరిశుభ్రపఱచిన ప్రియురాలగు మగుఁ ఆగజాయి నాలుగైదుదమ్ములు పీల్పుటలో సమగ్రశక్తి ఖర్చుచేసి, మిక్కిలితీవిగో దూమ మును చుట్టలుచుట్టలుగ వదలి చిన్నచిన్న మేఘముల గల్పించుచు స్తంభమున కానుకొని వినాయకరావు కూర్చుండెను. ఇంతలో "వినూ! ఓరే వినూ! ఒకే ఎనిగింటలు కొట్టినారురా. సీచాదస్త మింకను కాలేదఁటరా! నీవు బాజారునకు వెళ్ళు టెప్పుడు? వెచ్చములు తెచ్చుటెప్పుడు? నేను వంట చేయు టెప్పుడు? ఏమి చేయ నమ్మా యీపిల్లవానిని! ఇంత నొక్క బిడ్డఫుట్టించైనను—" అని తల్లి పలుకగా,

"వాని కాలస్య మేమిటి? అప్పుడే తిరిగివచ్చినాఁ డననూకొను" మనుచు వినాయకు డుత్తరీయము పైనవైచి కొని తలపై టోపీ పెట్టుకొని తల్లికడకు వచ్చి వెచ్చము లేమేమి తేవలయునో యామె వలనఁ దెలిసికొని యింటినుండి వెలుపలకు వచ్చెను. అంతలో వాని కొకవిషయము స్మరణకు వచ్చెను. బాజారున కేఁగు టెందులకు? దగ్గఱ పైకము లేనిచో బాజారులోనివస్తువు లింటికి వచ్చు టెట్లు?

వినాయకునికడ నొక్క చిల్లిగవ్వ యైనలేదు. ఎటనుండి వచ్చును? పాపము వాని కేమియు నుద్యోగము లేదు. ఉద్యోగము చేయుట కావశ్యకము లగు శక్తియుక్తులును వానికడ లేవు. శుభాశుభముల కిచ్చటనైన దొరకినదక్షిణలు పాణిసమాన మగు గంజాయిచిలుము యం దెప్పటి కప్పుడే భస్మమగుచుండెను అప్పటికిని వానికి గంజాయి క్షుధాశాంతి యగుట లేదు దగ్గఱ డబ్బేమియు లేనపుడు మాత్రము వినాయకుడు గంజయికొఱ కెవ్వరిపాదములనైనఁ బట్టు కొనుచుండును. అటులొనర్పుటచే నేదోయొక మాదిరిగ గంజాయి క్షుధ తీరగలదు. కాని యింటికి కావలసిన వస్తువు లెవరి పదములపైఁ బడినను దొరకవు. దీనికి జేబులో పైసా యుండితీరవలయునే! వినాయకుఁడు లజ్జితుఁడై తలవంచికొని నేలఁజూచుచు నిలచియుండెను.

అప్పటి కప్పుడే కొమరుని స్థితి రాధకు జ్ఞప్తికి వచ్చెను. పాప మాపె యేమి చేయఁగలదు? "చచ్చినవానికి బుద్ధి లేదు. నన్ను బెదరించి తినుటతప్ప మూఁడుపుట్లు——" అని యేమేమో గబగబ నాలుగు తిట్టి స్వయంపాకగృహమునఁ బ్రవేశించి శిథిలమైన యలమారులో, లోపలగ, జీలకఱ్ఱబుట్టలో, కడు జాగరూకతతో దాచి యుంచిన పదునాలుగణాలనరలో నాణాలు తీసి, వినాయకున కొసఁగెను. అణాలు దృష్టిపడినంత వినాయకుఁడు ప్రఫుల్లవదనుఁ డయ్యెను. అతఁడు చప్పుచప్పున వీథిలోనికి వచ్చి హుటాహుటిగ బజారువైపునకు నడచెను.

వినాయకుఁడు బాజారునకు వచ్చినదితడవుగ నప్పుడే యొకదుకాణదారుని కేకవైచి తా నొసఁగుగంజాయిదమ్మును స్వీకరించి వెళ్ళవలసిన దని వేఁడికొనియెను వినాయకుఁ డాదుకాణదారుని వేఁడికోలును, గంజాయిమీఁది మోహమును ద్రోసివేయఁజాలక కూర్చుండెను. చిలుము తయారగుచుండ లోకాభిరామాయణము చెప్పుకో

నుచు మెల్లమెల్లగ రెండు మూడు నాల్గు అయిదు ఆఱు ఏడుసార్లు దమ్ము వీల్చెను. వినాయకుఁడు తన్మయుఁడై పోయెను. వాని కివు డటిచేత స్వర్గము గానవచ్చు చుండెను.

ఇట్లు మకాణామునందు జరుగు చున్నకథ రక్తికట్టు చుండెను. ఇంతలో యజ్ఞేశ్వరభట్టు వడివడివచ్చి వినాయకుఁ డచట గూరుచుఁ డుటఁ గాంచి యాశ్చర్యమున నిట్లనియెను. "బళ్లే, ఎట్టిసంసారివిరా! ఊరంతయు దిరిగినను నీజాడయే కనబడదు! నీ విక్కడ సంతోష ముగ ముచ్చటలు వినుచుఁ గూర్చుంటివి. లే-లే తొందరగ పరుగె త్త వేమి? హరభట్టుపినతల్లి చావునకు సిద్ధముగా నున్నది. త్వరగ పరుగెత్తు ప ం- న- న నేను వా వా -ని మంత్రము చెప్పుటకు దీసికొని వచ్చెదను. ఇట్లు చెప్పి యజ్ఞేశ్వరభట్టు వడివడినడచి యవ రకర్మ చేయించు పౌరోహితునియొద్దకుఁ బరువెత్తెను. యజ్ఞేశ్వరభ ట్టు వలన నీసంగతి విని నంత వినాయకుఁ డొక్కక్షణ మైన విలంబ న మొనర్పక హరభట్టు పినతల్లి గృహమునకు వచ్చిచేరెను.

ఆహాహా! వినాయకరావున కెంతయాత్రము! ఎంత పరోపకార పారీణత! సర్వభక్షకుఁ డగునయ్యగ్ని దేవుని తొందరకంటెను వినా యకుని తొందర యెక్కువగ నున్నదే! వినాయకుడు వచ్చి చూచు నప్పటి కాగృహమంతయు నిశ్శబ్దముగ నుండెను. మృత్యుదేవత సామ్రాజ్యము ప్రబలి యుండెను. ఇంటియందు మరణోన్ముఖయగు ముదుసలి తప్ప నిం కెవ్వరుఁ గాన రారైరి. ఆమెను భూశయన మొనర్పుట కైన సంశోకడు లేడు. ఇంతలో బయటనుండి యజ్ఞే శ్వరభట్టరుదెంచి, దుఃఖము సూచించు వినాయకుని మొగమును గాంచినంత నాతఁడు నిశ్చేష్టుఁడై, కొంతవడికి చేత నున్న దహన సామగ్రి యటనుంచి, వెనుదిరిగిపోయి, యిరుగుపొరుగు మనుష్యులను పోగుచేసికొని వచ్చెను. అంత నాప్రేతమును శ్మశానమునకుఁ జేర్చిరి. వినాయకుఁడు దహనాదిక్రియ లొనర్పుటయం దగ్రేసరుఁడు.

వినాయకునకు వీఁడు తనవాఁడు వీఁడు పెరవాఁడను భేదము లేదు. పాపము మిక్కిలి సాధుశీలుఁడు. అనాథులకును, నిరాశ్రయులకును, సహాయము నొనర్చుట యనిన నీతని కెంతయు సంతసము. శ్మశానమున నందఱు చల్లని చెట్లనీడల ముచ్చటలాడుకొనుచుఁ గూర్చుండి యుండ నమాయకుఁడగు వినాయకుఁడు తీవ్రమగు నెండలో జాము సేపు చితిసమీపమున నుండి దహనసంస్కార మునర్చెను. ఆవృద్ధ ప్రేతము దహనమగునప్పటికి సంధ్యాకాల మయ్యెను. అనంతరము నదిలో స్నాన మొనర్చి యందఱు నిండ్ల కరిగిరి.

తాను బాజారున వెచ్చములు కొనిపోవుటకై వచ్చి యుండుటయు, ఇంటియందు తల్లి తనకై యెదురు చూచుచుఁ గూర్చుని యుండు ననియు, నాకస్మికముగా నతనికి స్మరణకు వచ్చెను. అంత నప్రయత్నముగ వానిచేయి రొండిపైకిఁ బోయెను. నదిలో స్నాన మొనర్చునప్పుడు రొండిడబ్బు లెప్పుడు జలసమాధి యయ్యెనో పాప మంతవఱకు నాతఁ డెట్లు తెలిసికొనఁ గలుగును? ఇప్పుడుమాత్ర మాతఁడు నిర్విణ్ణహృదయుఁ డయ్యెను. ఇప్పట్టున మాత్రము తల్లి తనయెడఁ గల ప్రేముడి చాటంప దనుభయమున మెల్లమెల్లగ వినాయకుఁ డింటిముంగిలికి వచ్చి చేరెను. మెల్లగఁ జెవియొగ్గి వినియెను. గృహమున నెవ్వరిసవ్వడియుఁ గాన్పింపదయ్యెను. ఒకటి రెండుఘడియలప్రొద్దు పోయినది. అప్పటికైన నింట దీపము నెలుగుట లేదు. వినాయకుఁడు మెల్లగ భీతిగొల్పు స్వరమున 'అమ్మా అమ్మా ఓఅమ్మా అ—' అని పిలచెను.

అప్పటికిని ప్రత్యుత్తరము లేదు. అప్పుడు వినాయకుఁడు తిరుగ నుచ్చైస్స్వరమున, "అమ్మా—మ్మా—అ—" అని కేక వైచెను. వెంటనే యాకసమున నొకప్పుడెట్లు భయంకరశబ్ద మగునో యవ్విధమున రాధ గర్జన వినవచ్చెను. "ఓరి తెల్లమొగమా! ఇప్పడా యింటికివచ్చుట?

ఎప్పుడు వెళ్లుట, ఎప్పటి లోకము! ఇంకసేపు వెచ్చరులు కొనచుసే యుంటివా? చచ్చినవాడా! నన్నొక్కమాటే చంపరావేటరా! నీ చేతులలో బాధ——!"

తల్లియొక్క యీ యావదసంభావన నాకర్ణించి యంత వినాయకుని ప్రాణము తెక్కడికక్కడఁ జేరుకొనియెను. వానికి జననిస్వభావము తెలిసియే యుండెను. తన్నెప్పుడు మిగులఁ గట్టుతో యుప్పు దాపి కోపాలము చప్పున చల్లారవలసినదే! ఇది వినాయకుని బాగుగ తెలిసియుండుటచే రాత్రి మాటలాడుటకు సాహసించెను: "అమ్మా! మీనాయన పి తాత మమ్మరాలు చచ్చిపోయిరి. ఆను దవాన ముసళు వెళ్ళితిం పాంకు ఎక దగుటచే నెవరును వచ్చినారు కారు. నేను మాత్రము వెళ్ళినాను. అమ్మా! నీవే చెప్పుము? అట్టిసమయములో నుపేక్ష చేసి చో దైవము మెచ్చునా?"

రాఘవు, మిక్కిలి యాగ్రహము జనించెను. "నీ మెప్పులమీద నీమీద నిప్పుపెట్ట! చచ్చినవాడా! ఎనుగులను తగులవేయుటకా, నీవు జన్మమెత్తినది? నీవుకెప్పు ఎవడు కొనయును నోరంగ లేదా? లోకులెల్ల తుచ్ఛపు ముండాకొడుకులో చూతురు. ఈ పనికి చచ్చినవాళ్లు నావద్దను పిలువ వచ్చెనో ఇంకే దేని సుభకార్యములలో మాత్ర మా చచ్చినవాళ్ళకు మావాండ్లు జ్ఞాపకమే యుండదు! ఈ పిచ్చి ముండాకొడుకున కింతబుద్ధి యేది? బజారుకని యింటనుండి బయలు దేరి, మనవను వదలిపెట్ట, యెవతెతో తగలవేయుటకు బసుగెత్తైనా! సర్కారువారు నిన్ను ఎనుగులను తగుల వేయుటకు నియమించి నారా; ఎవఁడైన చచ్చినాఁడని కబురు చెవిఁ బడిన జాలును, విధవవు పరుగెత్తుకొని పోదువు! పెద్దగుఱ్ఱమువలె నుంటివి నీ కింకను సంసారబాధ్యత యేల కలుగదు? నీకు బుద్ధివచ్చున దెప్పుడు? నీ, చచ్చినతరు.——"

ముసలి యాగ్రహము సమాప్తమగు సమయమునకు గంగా యమునల సంగమము తప్పక కావలసినదే! అట్లగుట నామె కొంతవడికి రోదన మొనర్చెను. కన్నులు, హృదయము, ఆగ్రహావేశమునుండి మరలినపిమ్మట కొమరుని సంగతి స్మరణకు రా నామె యిట్లనియెను. "నాయనా, వినూ! ఇంతకు నీ వేమైన భోజనము చేసితివా?"

వినాయకుఁడు భయపడుచు 'రామరామా' ఇంతవఱకుఁ గుక్కెఁడు నీళ్ళు కూడ నే నోటిలో పోయఁగను!'' అని పలికెను.

రాధ కోపాగ్ని మరలఁ బ్రజ్వలింపసాఁగెను. ఆమె యధరము చలింపఁ దొడఁగెను. ఒకతీరు నామె లోకుల నిందింప దొడఁగెను. "ఆ చచ్చినవాండ్రది మనసో పాషాణమో, కాని నాబిడ్డ కన్నము పెట్టవలయు నని యొక్క చచ్చినవానికైనఁ దోఁచఁగూడదా? సిగ్గుమాలిన ముండకొడుకులు! పిలుచుటకు మాత్రము పరుగుపరున వచ్చెదరు— నీతియు జాతియు లేదుముండ ——"

వినాయకుఁ డామెను నిరాగ్రహగా నొనర్ప నిదియే మంచి యదనని గ్రహించి చప్పున క్రిందఁ గూలఁబడి దుఃఖల జాలిగొలుపు నిట్లనియెను "అమ్మా! ఏమే! నా కెంతో ఆఁకలి యగుచున్నదే, తినుట కేమైన పెట్టవా? హు——హు——"

ఇప్పట్టున రాధమనస్సు నీరయ్యెను. ఇప్పుడు తండ్రివైపున నెవరో చచ్చినందున కామె కణమాత్రము విచారము కలిగినది. ఆమె కన్నులనుండి రెండుమూడశ్రుబిందువులుకూడ జాఱినవి. అనంతరము పుత్రుఁ డీదిన మంతయు నుపవాస మని యావృద్ధురాలికి స్మరణకు వచ్చెను. ఆమె వెంటనే దీపము వెలిగించి "ఆ డబ్బు లేవి? ఇటు లిమ్ము" అని కొమరునితో ననెను.

వినాయకుఁడు నిరుత్తరుఁ డయ్యెను. ఏమిచెప్పవలయునో వానికి

దోఁచ దయ్యెను. చివఱకెంతో ప్రయత్నముమీద నాతఁడు జడియుచు "స్నానము చేయుమనందులకు రెండిడబ్బులు ఏదిలో నెక్కడ పోయెనో నాకు తెలియదు" అని పలికెను.

"మంచిపని చేసితివి! నాయనా దొడ్డపనిఁ జేసితివి!"

రాధ మరల నేడ్చుటకుఁ బ్రారంభించెను. ఇంచుకవడి యేగినంత నామె రోదనము సమాప్తమయ్యెను. పిదప నామె యిట్లనెను. "అయితే పిల్లఁడా! నిన్నరాత్రి కట్టు అన్నము వేపుకొని తినుటెందులకు? ఇట్లయిన నీవు సంసార మెట్లుఁ జేసెదవురా?"

తల్లి చెప్పినమాటలాతని మనసున నాటయ్యెను. మరల నాతఁడు కఠినస్వరముతో "అమ్మా! ముందు నాకేమైన దినుటకుఁ బెట్టవా? పెట్టి తరువాత నీవు చెప్పఁదలఁచిన దేమో చెప్పుము." అనెను.

ఎంతైనను తల్లిప్రాణము కదా? ఆమె చప్పున లేచి, గూటినుండి రెండుగుప్పెళ్ళ యటుకులు తెచ్చి వానిముందు బోసి "ఇవి తిను నాయనా! ఇవి తప్ప వంటకమేమియు లేవు." అని చెప్పెను.

ఇట్లనుచుండఁగా నాసనేత్రద్వయము సశ్రుప్రాంత మయ్యెను.

అటుకులు కంటఁబడఁగానే వినాయకుఁడు సంతోషముతో నాత్రముతో నాయటుకులు నోటినిండా బోసికొని బొక్కసాగెను. తల్లి వానికి సమీపముననే కాళ్ళు పారజాచికొని కూర్చుండెను. ఆమె కన్నులనుండి మరల గంగాయమునలు ప్రవహింపసాగెను. "ఈగిన మెంత పాపిష్ఠిదానను! నాబిడ్డ ఎన్నిపడి యుండెనే! ఒక్కపిడచైనను వానినోటఁ బడలేదుగదా! నాజిహ్వా మండిపోను! అమ్మా కులదేవతా! నూరుకాలములపాటు నాబిడ్డలు సుఖవంతులై యుండునట్లనుగ్రహింపుము. అంబా! నారక్తముతో నీకభిషేకమొనర్చెదను. నానోట వచ్చు తిట్లన్నియు నాబిడ్డలకు దీవెనలు చేయుము. నాయాయు

వంతేయు నాయిరువురు బిడ్డలకును కోడండ్రకును, మనుమలకు నొసగి వారిని చిరంజీవులుగ నొనర్పుము. అమ్మా తల్లీ! నీ ముందు నేను కొంగుపట్టి వేడుచుంటిని. నాజిహ్వ మండిపోను. నాపిల్లల నేను నిష్కారణముగ—"

వృద్ధురాలగు రాధమ్మ యును దుఃఖపూరిత మయ్యెను. ఇచట వినాయకుఁడు యథాప్రకారముగ నటుకులు నమలుచు, రాగిచెంబె డుదకము కడుపులోని కెక్కించి త్రేన్చుచు నిట్లనెను. "అమ్మా! ఏడ్చెదవెందులకు? తిట్లా! హాహాహా! అవి తిట్లుకావే, అని యన్నియు మాకు దీవెన లగుకొనుము! ఈ భాగ్యమునకు నీ కంత విచార మెందుకే?"

"లేదురా నాయనా! ఈదినమునుండి నేనిక నెప్పుడును మీమీఁద కోపపడను!"

రాధ మరల లోని కరిగి మఱియొక గుప్పెడటుకులు దెచ్చి వినాయకునిముందుఁ బెట్టెను. ఇప్పట్టున మాత్రము వినాయకునిసంతోష మునకు పారము కానరా దయ్యెను. అతఁడటుకుల వడివడి నోటఁ బోసికొని, పిమ్మటఁ గడుపునిండ నీ రెక్కించి దాహశాంతి చేసికొనెను. అనంతరము నిత్యాగ్రకమణిక చొప్పున చేఁతము హస్తమున ధరించి, సర్వత్రలత్వము గంజాయిదేవిని ధ్యానించి, సంతోషాంతరంగుఁడై నిద్రింపఁ జనియెను. అత డారాత్రి యయ్యదె నొకప్రక్క నుండి మఱియొకప్రక్కకొత్తిగిలనైన లేదు. పాపము, రాధకుమాత్ర మారాత్రి నిద్ర పట్ట దయ్యెను. ఆమె ముద్దులకొమరుఁడు వినాయకుఁ డాదిన మంతయు నుపవాసముగదా! ఈవిషయ మామె మనసును నొప్పించి యుండుటవలన రేయి యంతయు నామె సెజ్జపై కట కటఁబడుచు బరుండియుండెను.

## ౭

మరునాడు రమారమి పండ్రెండు, ఒంటిగంటకు రాధ వంట సిద్ధమైనది ఆమె వినాయకరావును భోజనమునకు రమ్మని కేకవైచెను. వినాయకుఁడు మంగళాసనము మొసరుచు వచ్చి పీఠముపై విరాజమానుఁడయ్యెను. భోజనానంతరము హస్తప్రక్షాళన మొనర్చినది తడవుగ వినాయకునకు కంట కాలు నిలువదయ్యెను. కుమారుని భోజనమైనవంటనే తల్లియు భోజనమునకుఁ గూర్చుండెను ఒకటి రెండు కబళములు గర్భకోశమున ప్రవేశించెనో లేదో యింతలోఁ బొరుగున గల ఉమాబాయి మెల్లమెల్లగ వంటయింట ప్రత్యక్షమయ్యెను వచ్చినది తడవుగ నామె "వదినె నిజమేనా యీసంగతి?" అన్నది.

రాధ చకితయై తత్తరముగా 'ఏవిసంగతే ఉమా?' అనెను.

'ఇక్కడ గంద్రగోళమేమీ పార్వతి తనపుట్టినింటకడ చెప్పిన దంటే! ఎందుకమ్మా?"

రాధకు శరీరమంతయుఁ జెమటలు జొట్టులు ప్రాఁకినట్లయ్యెను. 'చెప్పిన చెప్పనిమ్మా దానితండ్రి యెంతగొప్పవాఁడైనను యింత మాత్రమునకు నాతిల యేమియుఁ దీయఁబోడు లే' అని పలికెను.

"అవును కానిచో వారికి జడియుటవా యేమి? ఎంతైనను నీ వింత దానవు నీవు వారియొకు, వని కేమిటి! అయితే వదినె! ఎవరో యనుకొనుచుండగా విన్నాను — నిజమో అబద్ధమో దైవమున కెఱుక. పార్వతి నిచ్చుటకే బంపుటకు దానితండ్రి కష్టము లేదంటే! లక్ష్మీతండ్రికూడ తన యమ్మాయిని నిచ్చుటకే బంపనన్నాడంటే! నిజమేనా రాధమ్మవదినె?"

శరీర మాద్యంతము కంపింప రాధ యిట్లనెను. "వాళ్ళనోట మన్ను బోయా ఎంపరుగా! మా సదాశివునకు తిరిగి పెండ్లి చేసెదను. పదిమూఁడేండ్లపిల్ల సిద్ధముగా నున్నది. ఇప్పుడు తీసికొనివచ్చి మా వాని

కాళ్ళమీఁద పడవైచెదరు!"

నానాతల్లి తా నేకోర్కెతో నిట కరుదెంచెనో యామెకోభీష్టము నెఱవేఱు లక్షణ మేమియుఁ గానరాదు. మనసులోన మిగులఁ జింతించి "అహాహా! ఇది మిగుల చిత్ర మైనకథ. గ్రామ మంతయు దప్పు లేకుండ నిశ్శబ్దముగ జాటించవలెను. ఇదియే మంచితరుణము. ఇట్లొనర్పనిచో స్త్రీజన్మ మెత్తి యేమిసార్థకము. మరల నొక్కసారి ప్రయత్నించి చూచెదఁ గాక" యని తలపోసి యిట్లనెను. "ఏమి రాధమ్మ పిన్నీ! నీకోడలి కింతమాత్రపు జ్ఞానము—"

"నాకోడలిజ్ఞాన మెట్టిదో నేను చాలకాలమునుండి యెఱిఁగియే యుంటిని. అది యిప్పుడు క్రొత్తగాఁ దెలిసికొన నవసరము లేదే?"

హరహర! ఈప్రత్యుత్తరము విని పాపము ఉమ హతాశయయ్యెను. తలవంచికొని యామె మెల్లమెల్లగ వచ్చినత్రోవఁ బట్టెను. ఆమె యటనుండి వెడలుట తడవుగ నప్పడె యాస్థానమున యమునా బాయిగారి శుభాగమన మయ్యెను. అప్పుడే పచనారంభమునకలి భోజనమునకు ద్వితీయవిఘ్న మాపాదిల్లినదే! యమునను జూచి మెత్తనిదానివలె నటించుచు నిట్లనెను ఏమిపిన్నీ! నీవేమో పార్వతి నింటినుండి వెడలఁ గొట్టినావఁట?"

"ఏ యర్ధాయుస్సుముండ యది చెప్పినది?"

యమున గంభీరస్వరముతో "గ్రామ మంతయు వ్యాపించిన సంగతి యిప్పుడు నీవు దాఁచిన దాఁగునా పిన్నీ?" అని పలికెను.

రాధ యించుక చల్లఁబడి యిట్లనెను. "నాకోడలిని నేఁ గొట్టెదను, తిట్టెదను, పెట్టెదను, నాయిష్టము. ఇందు లోకుల కేమి సంబంధము? ఇతరులను గుఱించి యిట్టి కానిపోనిమాటలాడుకొనుమని వీండ్ర కేచచ్చినవారు చెప్పిరి?"

ఇంక నేమున్నది! పాపము యమునాబాయి ప్రయత్న మంతయు

నిష్ఫల మయ్యెను. అమ్మగారు నిలువున నీరైనది. అప్పట్టున లేని గాంభీర్యము దెచ్చుకొనుట కేదిదారో యుక్తిపన్ని "నేనునుదియు నదియే" యనుచు గబగబ వెనుదిరిగి ఎవాడకుండ నాము తనయింటి త్రోవ బట్టెను.

రాధ చల్లారినయన్నముప్ప మరలఁ జేయివైచెను. మరల నామె దురదృష్టము. ఆమె యదృష్టములో నీదినమ భోజనము లిఖించియుండ లేదని తోఁచుచున్నది. యమునాబాయి యరిగి రెండుమాఁడు నిముసములు గడచెనో లేదో యప్పుడే ప్రక్కవీధి మాళినాబాయి తొందరతొందరగ రాధయింటి కరుదెంచెను. మాళసాబాయి యనగా సామాన్యస్త్రీ కాదు. గ్రామమునఁగల జనులందఱు ముఖ్యముగ నామెయెటనోటికి మిగుల భయపడుచుందురు. పిధిగుమ్మము తో పాదము మోపినదో [illegible] యప్పుడె యొక్క పట్టుఁ మొగులు మ్రోతే వలె నిట్లనెను. "నీవయునుమిూఁద నీమిూఁద నిప్పులుపోయ! ఇన్ని యేండ్లు వచ్చిన నీటికున కోడలిని మనుమలను కొట్ట వెడలఁగొట్టుటకు నీకేమి సిగ్గయినలేదా! ఫూ, నియేళ్ళపైన—"

ఇప్పట్టున మాత్రము రాధకోప మూకిన మండెను. ఆమె కోపా వేశమున నిట్లనియెను "ఎవతె యీకూఁత కూసినది?"

అయినది మొగ మింతైనది. మాళసాబాయి మనోరథ మూడేఱినది. ఇంతకన్న నామెకుఁ గావలసిన దేమి? ఆమకింరిస్వర ముక్క పెట్టున న ప్తమస్వరముఁ కెగసినది. "ముసలితొత్తా! ఎవరి నే భడవాముండ అనెదవు? ఎవరు నేనాభడవాముండను? ఓసి అర్ధాయుస్సుముండ! ఎందుకే యేండ్లువచ్చినవి! నీవుముండవు నీ—"

ఆగ్రహమున రాధ ఆపాదమస్తకము కంపింపఁ దొడఁగెను. తన ముందరివి స్త్రరి చుట్టమిట్టి యుపెటపట్టుకొని లేచి నిలువఁబడెను. అంతట వారిరువురినడుమ నపూర్వశబ్దములతోను, అపూర్వవాక్సరణితోను

అపూర్వాభినయములఁగోడను తుములయుద్ధము ప్రారంభ మయ్యెను.
కొంతతడవున కా సంగ్రామము కడముట్టినది. పాప కుందు రాధ సంపూర్ణపరాజయము నందినది. గయ్యాళియగు మాళసాబాయి ముందు నిష్కపటయు, సాధుశీలయు నగునాకుడుసలి యెందుల కక్కఱకు వచ్చును? మాళసాబాయి రణరంగమున విజయ మొంది తన విజయార్భటిచే దిగంతములను ప్రమోగించుచు వెడలిపోయెను.

## ౨

సదాశివునియత్తవారిగ్రామము పల్లెటూరు కాదు. మ్యునిసిపాలిటీ, పోలీసు స్టేషన్, మునసబ్ కోర్టు, సెకండరీపాఠశాల, లైబ్రరీ మొదలగు నవి కొన్ని యచటఁ గలవు. బ్రాహ్మ క్షత్రియ వైశ్యాది సకల జాతులకు నాహార వసతులు గలవు. అందు నైష్ఠికబ్రాహ్మణ గృహములు మెండు. ముసల్మానులయిండ్లుకూడఁ గొన్ని యుండెను. ఊరిబయట చెఱువులు, వల్లసితోఁటలుఁ గూడఁ గలవు. వీథులు వెడల్పు గలిగి వచ్చిపోవుపల్లెటూరిజనులతో సందడిగ నుండును. ఇట్టియూరు గాంచినవా రెవరు దీనిని పల్లెటూ రందురు? అట్లు తలఁచినవా రెవ్వ రేని యీగ్రామపణ్యవీథిని గలరెండుమూడు సువాసనా సమృద్ధములగు నత్తరుదుకాణముల గాంచినంత శంకావిముక్తులగుదు రనుట నిశ్చయము. ఇంక నా రాత్రులయందు సదుమనసుమ వారయోషిజ్జనమంజులకంఠరవమును సారంగ, సతారు, వీణె, ఫిడేలు హార్మోనియమనోహరవాద్యసుమధురధ్వనులును వీథివెంట నడచు యువకులకర్ణరంధ్రములఁ జొచ్చి వారలఁ గ్లీనులుగఁ జేయుచుండును. ఇట్టిపురమును కుగ్రామ మనఁ జెల్లునా?

రామచంద్రపంత్ సహస్రబుద్ధే అనుప్రసిద్ధబ్రాహ్మణు డొకం డీపురమునఁ గలడు. పూర్వ మితఁడు బొంబాయిరైల్వేకంట్రాక్టరు

ఆ కాంట్రాక్టులో నీతిఁ దమితముగ ద్రవ్య మార్జించి యాయుద్యోగము విడిచిపుచ్చెను. ప్రస్తుత మీతఁడు సర్వసంగపరిత్యాగ మొనర్చి యీశ్వరధ్యానతత్పరుఁడై యున్నాఁడు.

ఈతని జ్యేష్ఠపుత్రిక గంగాగారు పాపమామె బాలవితంతువయి నందున పితృగృహమున గృహకృత్యనిర్వాహ మామెకొలపైఁ బడి యెను. ఈగంగ తరువాత రామచంద్రపంతులకు నారాయణరావు, మాధవరావు ననునిరువురుపుత్రులు కలిగిరి. వీరిలోఁ బెద్దవాఁడు స్వర్గస్థుఁడై యాఱుమాసములే యయ్యెను. ఆతని పత్ని హతభాగిని లక్ష్మి తన చిన్నకుమారునితోఁ గూడ తండ్రియింటనే నివసించు చుండెను. కనిష్ఠుఁడు చిరంజీవి మాధవరావు. ఈతని ప్రథమపత్ని గతించి నందున రెండువత్సరములకుముందు ద్వితీయవివాహముఁ జేసికొని యెను. భార్యపేరు మనోరమ. రామచంద్రుని ద్వితీయపుత్రిక పార్వతి. ఈమెయే సదాశివరావుగృహిణి రాధపెద్దకోడలు లీపార్వతియే. పార్వతి తరువాత రామచంద్రునకు సంతానము లేదు. రామ చంద్రునిపత్ని యిహలోకయాత్ర ముగించుకొని యాతని దుఃఖాబ్ధిఁ బడద్రోసి చని యిప్పటికి సుమారు పదివత్సరము లయ్యెను. వృద్ధుఁ డగు రామచంద్రుఁడు మరల వివాహ మాడలేదు. ఇది ప్రస్తుత కాలమానస్థితులను బట్టిచూడ నాశ్చర్యమై గన్పట్టుట నిక్కువము.

రామచంద్రుని వయసు దాదాపు డెబ్బదివత్సరములు మీఱియుండియు శరీరపాటవమును గనించిచూడ వయసంత యుండునా యని సందేహము కలిగింపక మానదు. ఆపురమున నాతనికి గౌరవాధికారము లెక్కువగ నుండెను. గ్రామస్థులందఱు నాతనియెడల భయభక్తులు గలిగిమెలఁగుచుందురు. ఆతని మాట రామబాణమే! ఎందులకుకాదు? కాంచనము మహామహిమగలది. అది యెవనికడ నుండునో వాఁడెట్టివాఁడైనఁ గానిండు—వాఁడే పండితుఁడు. వాఁడే

కులీనుఁడు. వాఁడే గుణవంతుఁడు. అట్లగుటచే రామచంద్రునివా
క్యమోఘ మగుటయం దబ్బురమేమి?

ఇప్పు డాత డీమాయాప్రపంచమున నైహికచింతలఁ బరిత్య
జించి కేవల పరమాత్మచింతనమందే కాలము గడుపుచుండెను. మంత్ర
తంత్రములందుఁ గూడ నాతనికిఁ బూర్ణపాండిత్యము గలదనియు,
అష్టాంగయోగసిద్ధులుగూడ నాయనకుండెనను ప్రతీతి కలదు. ఆతఁ
డొకప్పుడు కంట్రాక్టరుగా నుత్తరహిందూస్థానమున కరిగియుం
డెను. అచట నాతనికిని, ఒకానొక గోసాయికిని పరిచయ మయ్యెను.
ఆతఁడు యోగదీక్షఁ బొంది ప్రసన్నుఁడయ్యెనే. గురువిషయ
మున నీతఁడు చూపు భక్తియుక్తులు తనకు గలిగిన యీ సమ
స్తైశ్వర్యములకును గురుకృపయే కారణ మని రామచంద్రుని విశ్వా
సము. ఈతఁ డిప్పటికి సప్పడవరము బహువల్లరిదగ్గ లాభముగఁ
కృతార్థుఁ డగుచునే యుండెను.

రామచంద్రపంతులు యౌవనంబున త్యాగమూర్తి యీశ్వర
ధ్యానమునఁ దనయాయువు గడప కృతసంకల్పుఁడై యుండెను కాని
శివిల్ క్రిమినల్ వ్యవహార పరిష్కారముగ, అధికార యోగమును
నతని యోగసమాధి నిష్ఠాభంగమునకు విఘ్నములుగా నుండెను. రామ
చంద్రుని బాహ్యాచరణమును గనిన క్రొత్తవా రాతని మహాసాధు
పురుషునిగఁ దలంచు చుందురు. చిరపరిచితులుమాత్రము మాతనిని
పరోక్షమున నిందించుచునే యుందురు.

తత్పూర్వ బాహ్యప్రదేశమున గల చండికాదేవి రామచంద్రునకుఁ
బ్రసన్నయయి, అప్పుడప్పు డర్ధరాత్రములందు దర్శన మొసఁగు
చుండు ననియు ప్రతీతికూడ గలదు.

రామచంద్రుని బాహ్యప్రకృతి యెట్టివారిమనస్సుల నైన భక్తి
భావనసమన్వితముగఁ జేయఁగలిగి యుండెను. ఉన్నతము స్థూలము

నైన శరీరమును తప్తసువర్ణోజ్జ్వలదేహకాంతియు గళమునందలి స్వర్ణ ఖచితరుద్రాక్షమాలికలును మొదలగువానివలన గలిగిన సమాజభక్తికి దోడుగ విపులసంపత్తి కూడ నుండెను మఱి కావలసిన దేమి ?

జనకుని యీ యాధ్యాత్మ్యచరణము నారాయణరావునకు మాత్ర మేమియు దృష్టిగోచరముగ నుండెడిది కాదు. మీదుమిక్కిలి దీని మూలమునఁ దండ్రికొడుకుల కప్పుడప్పుడు కలహము సంభవించుచుండెడిది. నారాయణరావు కంట్రాక్టు సేయుచు దానివలన కొంత ద్రవ్య మార్జించుటవలన రామచంద్రునకు వానిపట్టున నించుక జంకుండెడిది. పాపము నారాయణరావు కాలగృత్యుముఖమునఁ బడి తండ్రిమార్గము నిష్కంటకము చేసెను. సంసారమునకుఁ గర్తయు, చేతికి నోటికి నక్కఱకు వచ్చినవాఁడును, నవయౌవనుఁడునైన నారాయణరావు కాలధర్మము నొందుటకు గ్రామవాసు లెల్లరు దుఃఖించిరి. రామచంద్రుఁడు కుమారమరణమున విశేషదుఃఖము గలిగి నట్లు ప్రవర్తింపక ట్టి చూడ గొప్పి మట నేగు రామచంద్రుని యాయథార్థమానుషవాక్ప్రవర్తనము కన్నులార జూచియుండిరో వారికా విషయము మనస్సునకు నాటియుంటనే వారు వాని వెనుకనే తమలో నెన్నోమాటలు గల నాతని శపించుచుందురు. ఎవ్వరు వాని యథార్థప్రవర్తన మెఱుఁగరో వారీతని మాయామోహములు లేనిసాధుపురుషుఁడని నిశ్చయించి యాతని మిగులఁ బ్రశంసించుచుందురు.

కనిష్ఠుఁడగు మాధవరావు బాల్యమునుండియుఁ దండ్రికత్యంత ప్రేమాస్పదుఁడై యుండెను. పోవరుని పశ్చిమదేశపు కంట్రాక్టు పని యిప్పు డీతఁడే చేయుచుండెను. ఈతఁడు బొంబాయి విశ్వవిద్యాలయమున బి. ఏ. పరీక్షయందుఁ గృతార్థుఁ డయ్యెను. ముందు ఎల్. ఎల్. బి. కి కూడ నేగ నమకట్టి యుండెను. దురదృష్టవశమున

ఈసమయముననే సోదరుఁ డగునారాయణరావు కాలగతి నొందుట వలన దండ్రి యనుమతిప్రకారము వకీలుపని విడిచి అధికలాభము గల యీకంట్రాక్టుపనిలో బ్రవేశించెను. నారాయణరావు మరణానంతరమున రామచంద్రునిమహాత్మ్యము ద్విగుణీకృత మయ్యెను. అతఁడు కంట్రాక్టుపని మాధవరావుపేరఁ బెట్టించెను. విగతభర్తృక యగు నారాయణరావుభార్యను లక్ష్మిని, ఆమెపుట్టినింటి కనిపివైచెను. అప్పటినుండియు పాపము వైధవ్యమున మునిఁగియున్న యాపరదృష్టు రాలియొక్క గాని యామె యనాథార్భకునియొక్క గాని క్షేమ సమాచార మైన నాపాషాణహృదయుఁడు రామచంద్రపంతు కనుఁగొన డయ్యెను.

మాధవరావు తనబుద్ధి కేది తోఁచిన నది రహస్యముగ నొనర్చు చునే యుండును గాని పైకిమాత్రము జనకుని మతానుసారము ప్రవర్తించు చున్నట్లు నటించును. అతని కేధర్మములయందును విశ్వాసము లేద దానవలన, పేదే కీడు మూడునేమో యనుశంక యైన నాతనికి లేదు. ఆ వారి సమాచారవ్యవహారము లేమియు నాతనికి రుచింపవు. అట్లయ్యుఁ దండ్రిసముఖమున తన యనవాస మేమియు ఒరుల కగుపడక యల్లప్పుడు జనకునిమతమే తన కామోదముగఁ బ్రకటించు చుండును. అట్లగుటచే నితఁడు రామచంద్రునకు ప్రేమాస్పదుఁ డయ్యెను

గంగ బాలవితంతు వయినందున తండ్రి యీమెను మిగుల నాదరపూర్వకముగఁ బ్రేమించు చుండెను. దానిపరిణామమే యీమెవిలక్షణమున కొకి తనవా మకారి యయ్యెను. గంగ దర్పము వలన భూమిమీఁద గడగడవడకు ననుటయం దేమియు నతిశయోక్తి లేదు. ఈమె స్వభావమున గలవిశేషవిషయ మే మన నెవ్వరైనను సుఖముగ నున్ననెడ కన్నులతోఁ జూడఁ జాలదు. అవిషయ

మైనం దనచెవులతో విన నోపదు. ఈమెకు వైధవ్యము సంప్రాప్త మైనప్పటినుండియు ననుదినము తనగుణము నట్లని దైవ ప్రార్థన మొనర్చుచుండును "దేవా! ప్రపంచమున గల స్త్రీజాతి నెల్ల నావలె ననాథ నొనర్పుము!" ఎవ్వతెకైన భర్త మరణించె ననువార్త యీమె చెవిని బడెనేని సెంతయు సంతసించును. మత్సరము ద్వేషము దర్పము అహంకారము అనుచితాభిమానము వీనిసజీవప్రతిమ నెవ్వరేని చూడదలంచినచో వారు గంగి నొక్కసారి దర్శించిరేని వారిమనోభీష్టము తప్పక నెరవేఱగలదు.

రామచంద్రుని కనిష్ఠకన్యకయు సదాశివుని పత్నియునగు పార్వతి విషయ మిట్లు చెప్పవలయును. గంగకు స్వభగిని యయ్యును రూప మునందును గుణగణములందును నితర విషయములందును గంగకు కనిష్ఠయే.

## ౬

సదాశివరావు వాదినము సాయంతనమే శ్వశురగృహమునకుఁ జేరెను. మామ యగు రామచంద్రరావంతు వీధియరుగుపై నిలుచుండి యుండెను అతఁ డల్లుని విశేషముగ నాదరింప లేదు. సదాశివుడు మామగారికి నమస్కార మొనర్పగానే "సుఖముగా నుంటివా?" అని మాత్రము విచారించి యాతఁడు తనపనిమీఁద నేగెను సదాశివుఁడు చావడి లోనికిఁ జని యొంటరిగఁ గూర్చుండి యుండెను అతనింజూచి పరి చారకుఁడు తమలపాకులపళ్ళెము దెచ్చి యాతనిముందుఁ బెట్టెను. సదాశివుఁడు తాంబూలము నమలుచు గూర్చుండెను. ఇంతలో మాధవ రావు సాయంకాలపు షికారునకై బయటికిఁ బోవుచు బూట్సు కిఱ్ఱుకిఱ్ఱుమని మోగఁ జావడివైపునకు వచ్చెను. బావమఱఁదిని చూచినంతనే యాశ్చర్యచకితుఁడై యిట్లనియెను. "ఎవరువారు! ఓహో! సదాశివరావా? ఎక్కడనుండి త్రోవ తప్పి——"

సదాశివుఁడు వినయముతో "ఒక్కమాటు మిమ్ములఁ జూచి పోద" మని పలికెను.

"ఏమంటివి ? ఇంతయనుగ్రహమా ! హాహా ! సరే దాని కేమి. కాని, నిజ మే మోచెప్పుము."

'మీచెల్లెలు కోపగించివచ్చినది. దాని ఁ గొంపోవుటకువచ్చితిని.'

"తీసికొనిపోయి చావఁగొట్టుట కాలోచించుట లేదుగద ?"

"చావగొట్టుటకా? అదెట్లు బావా !"

"గొంతుక కురిపెట్టికాని, లేక అన్నము పెట్టక యుపవాసము లుంచి కాని !"

ఈపలుకు లాలించినంత సదాశివుని మోము కోపమున నెఱ్ఱవా రెను. కాని యాకోపమును లోలోపలనే మ్రింగి "మేము దరి ద్రులము గాన మావిషయమున మీ రిట్లు చులకనగ మాట్లాడ సాహసించితిరి." అని యతఁడు పలికెను

"ఓహో ! దరిద్రులైన నిట్లావచ్చుట లేదే ! కడుపునిండ నన్నము లేనేలేదు సరిగదా , మీచెల్లెలి దుర్భావ లాడి దానిని హింసింతురా! ఇట్టి నియమట నది యెట్లుండ నేర్చును ? అనరాని మాట లని, నొప్పించెనిచో నది నీయిల్లువిడచి వచ్చునా ?"

"ఇదిగో చూడుఁడు; మీ రనుకొనునట్లు మీచెల్లెలిస్వభావము కూడ నంతమంచిది కాదు."

"అదియెట్లున్న నుండనిమ్ము. మీరు దానిని గొట్టి చంపివైచె దరా? మంచిది. దానిని పోషించుసామర్థ్యము భగవంతుఁడు మాకింత కలుగఁ జేసి యున్నాఁడు. మీరు చెప్పెడుచొప్పున నడుచుకొనక పోవుట దానిలోపమా ? అటులైన నుతెందులకు నీవు దానిని మరల కోడ్కొని పోవచ్చితివి? సరే, నీవు వచ్చుటయే మేలాయెను. నీకుకూడ నిట నుండ నిష్టము కలదేని నిన్నుఁ బోషించు

టకు మా కేమియు నభ్యంతరములేదు."

"అట్టియూహతో నే నిటకు రాలేదు."

"మంచిది. ఆసంగతి ముందు చూచుకొనవచ్చును నే నిప్పు డొకింత బయటికిఁ బోవలసి యున్నది" అని మాధవరా వొయ్యారముగఁ జేతికఱ్ఱ గిరగిరఁ ద్రిప్పికొనుచు బయటికిఁ జనియెను. ఇచ్చట సదాశివుఁడు ఖిన్నవదనుఁడై కూర్చుండి యుండెను. కొంత తడవున కీతనిరాక వినగనే పుత్రద్వయము, జగన్నాథుఁడు రాముఁడు తండ్రిని డాసిరి. జగన్నాథుఁ డాతనితొడపైఁ గూర్చుండెను. రాముఁడు తనమృదుహస్తముల రెంటిని తండ్రిమెడకుఁ బెనవేసి యాతని వీఁపుపై నెక్కెను ఇరువురు సంతసమున జనకుని మోమువంకఁ జూడఁ దొడఁగిరి. వారవ్యక్తమధురవాక్కులచే నెన్నియో ప్రశ్న లడుగుచు తండ్రిని ప్రముదితాత్ముని జేసిరి పుత్రపరిష్వంగ సుఖాబ్ధిలో మునిగి సదాశివుఁడు తన కట జరిగిన యవమాన మంతయు మఱచెను. ఆతనిమనను ప్రఫుల్ల మయ్యెను. ఇంతలో పరిచారిక సదాశివునితో "లోనికి రమ్మనుచున్నా" రని తెలిపెను. సదాశివరా వటనుండి లేచెను. పుత్రులిరువురు నాతని కొంగు బట్టికొని కుప్పిగంతులు వైచుచు లోని కరిగిరి.

సదాశివరావు లోని కరిగి పీటపైఁ గూర్చుండుట తడవుగ గంగ యిట్లు ప్రారంభించెను. "ఏమినాయనా, పిలిచినను వచ్చువాఁడవు కావే! రెండురోజు లైనను మనసు పట్టలేకపోతివి కాఁబోలు! వెను కనే తఱుముకొని వచ్చితివి. అగునులే! ఇప్పు డాలాగే యుండును. రేపు నీకుఁగూడ నాఁడుబిడ్డ పుట్టి దాని నత్తింటికి పంపినచో నప్పుడు తెలిసి వచ్చును. సరే. ఇంతతొందరగ వచ్చితివి; ఇప్పు డంత యవసరమైనకార్య మేమి తలపెట్టితివి?"

"దానిని దీసికొని పోవుటకు వచ్చితిని."

గంగ యోరచూపుతో పార్వతిని జూచి "మాటలాడ వేమి ? నీ వీపుపై దెబ్బలు మానినవా ?" అనెను.

పార్వతి తలవంచి, ముకుపుటము లదర, గద్గదస్వరముతో "ఏమి మాటలాడమనెదవు ? తీసికొనిపోవుటకు వచ్చిరా ! అప్పుడు పిలుచుటకు నోరాడలేదు కాబోలు !" అని పలికెను.

పార్వతినోటినుండి వెలువడిన యీవినయ మధురవాక్కు లాలించిన తోడనే సదాశివుని దర్భపాతాళమున బడియెను. కొంతవడి యాతడట్లే స్తబ్ధుడై యుండెను. తుదకాతడు "నీయట్టి సిగ్గుమాలినది మ హెచ్చటను గాన్పింపదు" అని పలికెను.

పార్వతి కింతమాత్రము చాలును. ఆమె ముందటికంటె ధేరస్వరమున ని ట్లనెను "ప్రతిష్ఠ మీయుందును, మీతల్లియందును, మీవాండ్రయందును మాత్రే భవించినది జగమున గలమర్యాద యంతయు మీయింటనే నిండి యున్నది నే సిగ్గుమాలినదానను, నాయక్క సిగ్గుమాలినది, నా వారందఱు సిగ్గుమాలినవారే ! మఱి యింతమర్యాద గలవారు మీరీసిగ్గుమాలినదానిని మరల మీయింటికి దీసికొనిపోవుట కేమొగము పెట్టుకొని వచ్చితిరి ?"

భర్తపై నిట్లు కసిదీఱ వాగ్బాణములను ప్రయోగించి జేవురించిన తనమొగము గంగవైపునకు ద్రిప్పి యామె గంభీరస్వరముతో ని ట్లనియెను. "అక్కా ! నిముఱిది నీడకు వచ్చినాను. నీ వేమి చేయుదువో నీయిష్టము. ఇదిగో నేను ఖండితముగా జెప్పుచుంటిని. నాదగ్గఱకుమాత్ర మెవరును రావలసినయవసరము లేదు సుమా !"

పిమ్మట గంగ విచిత్రముగ జేతులు ద్రిప్పుచు, నుచ్చైస్స్వరమున ని ట్లనెను. "అమ్మా ! ఇది యంతయు నా కేమో మిగుల చిత్రముగ నున్నదే ! భార్య కోపముచే వచ్చినచొ, దాని నేవియో రెండు తియ్యని మాటలు చెప్పి సమాధానపఱచుకొని బుజ్జగించినచో నదియే

పాదములవద్దఁ బడియుండును. అంతేకాని గడపలో కాలు పెట్టెనో లేదో అప్పుడే పోరాటము ప్రారంభమా! త్రోవలో నేమైన గ్రాంది గింది త్రాగిరా లేదుకద!"

సదాశివుఁడు దీర్ఘనిశ్వాసము విడిచి "మంచిగా, త్రాంగి త్రాగి వచ్చితినా! సరే యిప్పుడే వచ్చెదను" అని యటనుండి లేచి పోవు చుండెను. ఇది గాంచి పార్వతి తన యక్కతో నిట్లనెను. "చూచి నావు గద! నీ వేమో యనుచుందువే! నీపైఁ బ్రేమ యున్నది—— ప్రేమ యున్నది. ఆ ప్రేమోత్కర్షి మిపఁడైనఁ గానవచ్చినదా?"

మఱఁదికి నిక్కముగఁ గోపము వచ్చె సరియు, నాతఁ డిప్పుడు నిజముగ వెడలి పోవుచుండె ననియు, గంగ గ్రహించి, యామె వాని కేమ్మైన చేయి పట్టికొని యి ట్లనెను. "ఏమిరా! దీపములు పెట్ట వచ్చిరి. ఈవేళ నిప్పు డెటకుఁ బోయెదవు? రాక రాక వచ్చినందుకు రాత్రి యుండి, అంతగా వెళ్ళవలె యుంటినచో నీయిష్టము, ప్రొద్దున వెళ్ళవచ్చును."

గంగ వచించిన యీకడపటమాట సూత్రము పార్వతికి రుచించ దయ్యెను. మఱల నట భర్త క్రిందఁ గూర్చుండుట గాంచి వానిముం దేమియు మాటాడ లేదు. గంగను లోలోన మిగులఁ దిట్టి, తనలో "సరే, ఈరాత్రి కిట నుండనిమ్ము. మఱి రే ప్రుదయమున నె ట్లేగు దురో చూచెదగాక!" యనుకొనెను.

సదాశివుని యొక్కయు నాతని భార్యయొక్కయు నాతని వదిన యొక్కయు సంభాషణ మంత ముగిసెను. ఇంతలో పదునాల్గువత్సరముల వయసు గల బాలిక తనమనోహరమందస్మితముచేతను, లోకోత్తర లావణ్యప్రభచేతను నలుగడలు నానందోత్సుల్ల మొనర్చుచు, మంగ గమనమున సదాశివుని వెనుకకువచ్చి నిలిచి యిట్లనియెను. "అన్నా! మాయింట నందఱు సుఖముగ నున్నారా?"

ఆ బాలిక నోటనుండి యీ వినయమంజులశబ్దములు వెలువడు చుండగనే గంగయొక్క భయానకగర్జన మిట్లు వినవచ్చెను. "ఎవతెగా సిగ్గుమాలినది! దీనికి నే నాడు బిడ్డ నను లక్ష్యమే లేదే! తమ కూఁతురు చావలేదింకను బ్రతికియే యున్నదని యెఱిఁగియుఁ దల్లి దండ్రులు లేదు జన్మల కైన దీని యోగక్షేమమే కనుఁగొనరు. ఈమె గారు మాత్రము, సు__ఖ——ముగ నున్నారా, అని వచ్చి యెంతో ధీమాతో నగుచున్నది. ఏమైపోయెద రాతల్లిదండ్రులు? భూమిమీఁద లేకుండ బోయెదరా? నే నెప్పుడు వాండ్ర పేరైన తలపెట్టను. దీనియధికారము చూడగ నత్తింటికోడలువలె లేదే!"

శరవిద్ధ యగుహరిణశాబకమువలె నాకన్యక భయవిహ్వలచిత్తయై యిటు టు జూడ నోడఁగెను పిమ్మట నామె మెల్లమెల్లగ నటనుండి జరిగి యొకమూలకుఁ జని నిశ్శబ్దముగ నేల గూర్చుండెను. తన యాఁడబిడ్డరూపము వహించిన ఢాకిని గంగ యాసమయమున నచట నున్నగాని పాప మాపె యెఱుఁగదు ప్రజ్వలితాగ్నిపై జలసేచన మొనర్చినచో నదెట్లు నిస్తేజమగునో యట్లే యబ్బాలిక తేజోవిహీన యయ్యెను. నయనానందకర మగు నామె యపూర్వ లావణ్యప్రభ యస్తంగత మయ్యెను ఆమె మృదులాధరముపై మధురమందహాసవికాసము లోపించెను. గ్రీష్మాతపమున వాడిన సుకుమార కుసుమమువలె నామె సౌందర్యము క్రమ క్రమముగ మలిన మగుచుండెను. సదాశివరావు నిర్విణ్ణుఁడై పోయెను ఇంత వఱ కాతనినోటమాటైన వెలువడదయ్యె. ఆకస్మికముగ విద్యుత్పాత మైనచో మనుజుఁ డెట్లు విస్మితుఁ డగునో యట్లే సదాశివుఁ డెంతయు విస్మితు డయ్యెను. కొంతతడవున కాతఁడు "మనోరమా! మీయింట నెల్లరు సుఖు లై యున్నవారు." అని చెప్పెను

పాప మామనోరమ యీ మాట వినెనో లేదో యేమియుఁ

త్తర మీయఁదయ్యెను. కారణ మేమన నప్పు డామె కేవలము జీవచ్ఛవమువలెఁ బడియుండెను. మనోరమ సదాశివుని పినతల్లి కూఁతురు. మనమాధవరావు ద్వితీయపత్ని.

మరల మేఘగర్జన బయల్వెడలెను. "ఓసే! నీవు కాఁపురమునకు వచ్చి యిప్పటికి రెండు సంవత్సరములైనది. ఇప్పటికైన నీకు వాండ్ర నీచస్వభావము బోయి పడినట్లు తోఁచదే? అపేక్షలులేని చచ్చిన వాండ్రు, వాండ్రమొగము మండ! ఆలాటివాఁడు తండ్రియట! అట్టి ముండకొడుకు చచ్చిన నేమి బ్రతికిన నేమి? వాఁడిచ్చేటి నీకిప్పు డేమిలెక్క? నా కొమరుఁడు వాండ్రను పురుషాంతరముల వఱకు భూమిమీఁద లేకుండఁ బోయినారే, చింతలేదు, దీనిస్వభావ మేమోకాని యెవనో యొకరిని సంపాదన చేయుచుండ నుండ లేదు" అని గంగమ్మ యఱచెను.

ఇంతలో బయట బూట్సు కిఱ్ఱుకిఱ్ఱను మ్రోత వినవచ్చెను. అప్పుడు పార్వతి యిట్లనెను. "అక్కా! లెమ్ము అన్నయ్య వచ్చు చున్నట్లున్నది నాలుక కరుచుకొనుము, పొమ్ము"

మనోరమ మెల్లమెల్లగ లేచి నసకొని తడవుగ మరల పాప మామెపై విసుగుకొనకయే మయ్యెను. గంగ భయంకరస్వరముచే బలికిన శబ్దము వజ్రఘాతమువలె నామె చెవి సోకెను. 'వంట, వడ్డన, యేమియు నక్కఱలేదు. మగనికగ్గలిక వెన్నుట ముగిసిన నొంటికాలి మీఁద తయారు? ఈ సిగువగాలినది మాకెక్కడ దాపురించినదో! పద, నడు, వెళ్ళి మేడమీఁద కూర్చో! ఇంతకంటె నీకు నీవు చేయుపని యేమి? అంటే భోజనములు కానిదే క్రిందికి వచ్చేవు జాగ్రత్త! ఈగరిటె నీవీపు మీఁద పడినదే!"

మనోరమ చప్పుడు కాకుండ మెల్లమెల్లగ మేడమీఁదికిఁ బోయెను. పోవునప్పు డామె తనలో నేమియో గొణుగుకొనుచు నెవ్వరికి

వినరాకుండ దీర్ఘనిశ్వాసము విడిచెను. పొరలివచ్చు దుఃఖాశ్రువు లాధాకిపేదృష్టి బడునేమో యను భయమున మెల్లగ దుడిచికొనియెను.

సదాశివుని భోజనాదికము లైనపిమ్మట గంగకును వానికిని నిన్నే కొంతతడ వేదో సంభాషణ జరిగి నిద్రించు సమయ మగుటచే గంగయటనుండి లేచిపోవుచు తనచెల్లెలితో నిట్లనియెను "నిష్కారణముగ నిట్లు రేయుంబవళ్లు కలతపడి పోట్లాడెదవు? ఇదె—నీవు నాకగ్గలి పండుకొందువుగాని, ఎడవుము, సదాశివరావు నిచటనే పండుకొననిమ్ము."

పార్వతి మూతి ముడుచుకొనుచు వికృతస్వరమున "సరే సరే, నన్నింక తీర్పు చెప్పు మనేను." అని గంగను తలుపవతల కొక్కవి కుస ద్రోసివైచి ద్వారము బంధించెను. గడియ జాగ్రత్తగ వైచి తిగివచ్చి చూచునప్పటికి భర్త చెక్కిట చెయి చేర్చి యేమియో యాలోచించుచు కూర్చుండి యుండెను. చుబుకముక్రింది హస్తమును ప్రక్కకుదీసి పార్వతి ప్రియమారగ నిట్లనియెను 'దేనిని గూర్చి యిట్లు యాలోచించుచున్నారు? మీ ప్రియురాలికి కొంచెము చెప్ప కూడదా?"

"ఓహో! చెప్పకూడకేమి? నీసోదరివంటి సోదరి నాకుంగూడ నొక్కతె యున్నయెడల నేనెంతో యదృష్టవంతుడనై యుందును."

"ఏమి యదృష్టము గలుగును?"

"మఱి నీ యీ గడుసుతన మంతయు మటుమాయమై యుండును, గదా."

పార్వతికి దీని యర్థము సరిగాఁ దెలిసినదో లేదో యెవ్వరికిఁ దెలియుదు? అప్పుడా ప్రసంగమును మార్చి యెవ్వియో యుక్తులచేతను వినయభాషణములచేతను, పగని మనసును వశపఱచికొనఁ బ్రయ

త్నము నొనర్చు చుండెను. శీఘ్రముగనే దంపతు లిరువురకుం బ్రణయకలహము ప్రారంభ మయ్యెను.

౧౦

గంగ యింటనుండి వెడలి స్వయంపాకగృహమునకు వచ్చెను. ఇంక మాధవరావు భోజనము కావలసి యున్నది. గంగ భోజనపాత్రము దలుగున వన్నియు నాయత్త పఱచు చుండెను. మాధవరావు నటునిటు జూచుచు వచ్చి పీటపైం గూర్చుండెను భోజన మునర్చుచు నాతండు గంగతో నిట్లనియె. "అక్కా! వడ్డించుటకు గూడ నీవే రావలయునా తక్కినవా రందరెట కేగిరి? ఇంకెవరు లేరా యేమి వడ్డించుటకు?"

తన భార్యయే తన కన్నము వడ్డించవలయు ననియు నెవ్వియో ముచ్చటలు చెప్పుచు దగ్గఱ గూర్చుండి భుజింపవలయు నని యు మాధవరా వెంతయో ముచ్చటపడు చుండును. కాని యేమి ప్రయోజనము?

గంగ వడివడి నిట్లు ప్రత్యుత్తర మిచ్చెను "ఇంకెవ్వరు వచ్చెదరు నాయనా వడ్డించుటకు! వచ్చినను రానేపోయినను నీకు నీభార్య యొక్కతెయే కదా! అది యడవిమృగము! నేను వడ్డించి పెట్టినచో భోజనపు వేళకు హాజరవును"

మాధవరావు వాక్కు లిట్టు లాలకించి ఖిన్నవదనుండై భోజన మొనర్చు చుండెను. భుజించుచు తన మనమున నిట్లని తలపోయ దొడగెను. "నేను దీని శరీరసౌందర్యమును భ్రమసి యెంత మోసపోతిని! నిష్కారణముగ నాగొంతుక కురి నేనే తెచ్చికొంటినే!"

భోజనానంతరము మాధవరావు శయనగృహమున కరిగెను. శయ్యపైం బరుండి మనోరమ యిదిగో వచ్చు నదిగో వచ్చు నను నాశచే భార్యాగమనమును నిరీక్షించుచు నొకప్రక్కనుండి మఱియొక

ప్రక్కకు మంచముపైఁ బొరలుచు పెద్దతడవు వేచి యుండెను. మనోరమ రాక కెంతవిలంబ మగుచుండెనో మాధవరావుమన నంత విరక్తి నొందుచుండెను. తుద కింటిలోనివారందఱు నిద్రించి యెల్లెడల నిశ్శబ్దముగా నున్నతరువాత మనోరమ దొంగవలె దాగికొనుచు, మెల్లమెల్లగ నడకటింటి కరుదెంచి, యెందేని యే దేని యలుకుడు వినవచ్చునేమో యని చెవియొగ్గి యాలకించుచు, దీర్ఘాలోచన మొనర్చుచు, నేమాత్రము సవ్వడియు గాకుండఁ దలుపువైచెను. అనంతరము వెలుగుచున్న దీపమునకు సెల వొసంగి, యాపాదమస్తకము దుప్పటి ముసుగిడి, అలుకు డింతయుఁ గాకుండ ప్రాణనాథుని పార్శ్వమున మెల్లగఁ జేర పరుండెను.

మాధవరా వింతదనుక మేలుకొనియే యుండెను. భార్య విపరీతచర్యయంతయుఁ గాంచి యాతఁ డాశ్చర్యనిమగ్నుఁ డయ్యెను. ఆధునికసుశిక్షితస్త్రీలవలె తనయర్ధాంగియు ప్రతివిషయమునందును దనకు కుడిభుజమై యుండవలె ననియు, సంసారయాత్రయందామెయే తనకు నిజమైన సహకారిణి కావలెననియు, ఒండొరులు గాఢానురాగమున మెలంగవలె ననియు మాధవరా వభీష్టము కాని దౌర్భాగ్యవశమున నాతని వాంఛ సఫలము కాదయ్యెను. మనోరమచర్యవలన నామెకు తనపై నిర్మలప్రేమ లేదని యాతనికి స్థిరముగాఁ దోఁచెను. అట్టియెడ నట్టిభార్యవలన తన కెప్పటికిని సౌఖ్యమలవడుట యసంభవ మని తలంచెను. ముగ్ధ యగునబ్బాలికోమలహృదయాంతర్గత మగుప్రేమానుభవమును బొంద గలపాత్రత యేమాత్రము నాతనిశరీరమునకు లేదయ్యెను. అంత గొంతవడి కాత డిట్లనియెను. "మనోరమా! నీవు నాపట్ల నిట్లుండు టెందులకు? నేను నిన్నెంతో ప్రేమించుచు సర్వదా నీసుఖమునకై ప్రయత్నించుచు నీవేనా—"

మనోరమ మృదుమందస్వరముతో "కొంచెము మెల్లగ మాట్లా

డుఁడు. లేనిచో నెవ్వరైన విందురు" అనెను.

భార్యాప్రత్యుత్తరము వలన మాధవరావు మిక్కిలి యసంతృప్తుఁడై విరక్తివలన కొంతదనుక స్తబ్ధుఁడై యుండెను. అట్లట నుండుట గూడ నాతనికి మిక్కిలి యసహ్యముగ నుండెను. అతఁడు కంపితగాత్రుఁడై తన కాగ్రహాభిమానము లొక్కుమ్మడిగ్రమ్మ నస్థిరుఁడై మంచమునుండి యొక్కవిసరున లేచెను. ధర తన్ను వదలి బయటికేగుచుండ నడ్డుపడి మనోరమ వినయయుక్తమగు తియ్యని ముద్దుపల్కుల నాతని శాంతపఱచి యున్నచో ముందు సంభవింప నున్న యనర్థములు వాటిల్లకుండును కాని బాలిక కంత ధైర్యము కలుగదయ్యెను. ఇట్టి సందర్భమున తానేమి చేయవలెనో యామెకిసుమంతయు దోఁచదయ్యెను ఎక్కడైనను నాధాకిని యాము బిడ్డ చెవికి తన యస్పష్టశబ్దము సైతము వినబడకూడదను విషయమే యామెకిప్పుడు నెంతయో బాధాకృతి గలిగింపు చుండెను. కాని యిప్పట్టున సంభవింప నున్న సర్వనాశన మామె బాలబుద్ధికి యించు కంతయు స్ఫురింప కుండెను.

మాధవరావు గదివెలుపలి కరుదెంచెను. ఆసమయమున నింటిలో నివారందరు గాఢసుషుప్తి మునింగియుండిరి. ఎల్లెడల శాంతిదేవి నిరంకుశాధికారము వ్యాప్తమై యుండెను. జగత్తంతయు గంభీరమగు నయ్యామిని యంకపాళియందు నిద్రితమై యచేతనమై యుండెను. ప్రకృతీదేవి యేదో యొకకారణమువలన నచింత్యమును, అదృశ్యమును, అగుశక్తి వలన నాసమయమున నచేతన యై యుండెను. కాని మాధవరావు మాత్ర మాసమయమున సచేతనుఁడై యుండెను ఆతనిహృదయమున నగ్ని రగులుచుండెను. దారుణతాపంబున నాతని ప్రతిగంధియు విచ్ఛిన్నమగు చుండెను. ఆతఁ డొక్కడ నిలుచుండుటలేదు. ఆతఁ డంధకారమయమగు నాభయంకరరాత్రి

యందు డాబాపై నిటునటు నొక్కటేవిధముగ దిరుగుచుండెను. చింతాభరంబున నాతనిమనస్సంతయు వికలమై యుండెను. ఆతఁడు మిగుల నస్థిరుఁడై పోయెను. ఇంక నట నిలువ జాలఁడయ్యెను. అంత మరల శయనగృహము జొచ్చి, ద్వారము బంధించి, దీపము వెలిగించెను. ఆదీపపుకాంతి నాతని కేమి గోచర మయ్యెనో గాని యాతఁ డట్లనె స్తంభితుఁడై పోయెను. మనోరమ మంచముపై బరుండి హాయిగ నిదురించుచున్నదే! ఇంతకుమున్దు మనోరమచే నొనర్పబడిన యవ్యక్తాచరణములను నాతఁడు వ్యథితుఁడై క్రోధపరవశంబున నటనుండి వెడలిపోయి యుండెను. తా నెంతయో యలజడి బొందెను. కాని యామె కిసుమంతయుఁ బరితాపము లేదయ్యెనే! ఇప్పుడీమె హాయిగ నిదురించుచున్నదే! ఇంతవరకు నాతనిమనసున నేవిషయిక మైనవిచారము గలిగెనో యావిషయ మిప్పుడాతని స్ఫుటముగ నొనర్చెను. ఆవిచారమే యాతనిహృదయమును కలంచివైచి, యాతని మనసుయొక్క యస్థిరత్వమును గూడ వేయిరెట్లధిక మొనర్చెను. తుదకు క్రోధావేశపరవశుండై యాతండు గాఢనిద్రయందు మునింగి యున్న యానిర్దోషబాలిక కేశబంధమును బట్టి గుబలున పైకి లేవనెత్తెను. పాప మబ్బాలిక యాసమయమున స్వప్నావస్థ నుండెను. తాను భర్తసన్నిధిని మాట్లాడినందున రాక్షసి యగు గంగ తనసిగబట్టి కొట్టుచున్నట్లును ఆచండాలురాలియెడ గల భీతిచే పాపమామె కేకవేయుటకుసైతము ధైర్యము లేకపోయినట్లును మనోరమ కలగాంచుచుండెను. ఇంతలో మెలఁకువ వచ్చెను. ఆమె కనులు దెఱచి చూచునప్పటికి తన సమక్షమున నాడుబిడ్డస్థానమున భర్త! కాంచినమాత్రమున బాలిక స్వప్నభయ మంతయు మాయమయ్యెను. బాలిక యధోవదన యయ్యెను.

మాధవరావు క్రుద్ధుఁడై యిట్లనియెను. "నీవు నాయెడ నిట్లు

పరివర్తించుటకు గలకారణ మేమో నా కిప్పుడు చెప్పి తీరవలయు. నీ ప్రేమకు నే పాత్రుండ నైన దెంతవరకో స్పష్టముగ వచింపుము.”

పాప మల్లపుయన్న యా గుణసుందరము కాప్రశ్నయందలి యర్థమే స్ఫురించినది కాదు. అట్లగుట నాపె యేమని ప్రత్యుత్తర మీయ గలదు. లజ్జచే నధోవదన యై నిశ్శబ్ద నిలిచి యుండెను. ఇచట మాధవరావు ప్రత్యుత్తరముకొఱకు నిరీక్షించు చుండెను. తనకెంత ప్రయత్నించినను తనకు ప్రత్యుత్తరము బొందజాలఁ డయ్యె. అప్పటియాతని నియోగగ్రాహంబున కంఠము గానరా కుండెను క్రోధతీవ్రతచే మనో రమ నడుముపై నొక్కుచున్న తప్పి యావలకు గ నెట్టివడి వచ్చెను. ఇదివఱకువలె నిప్పు డాతఁడు డాపైకొనక, క్రిందికి వచ్చి ద్వారము దెఱచికొని, పడకటింటిబయటకు వచ్చి వారయువతీ మందిరములతో నలరారువీధి బ్రవేశించెను.

ముందు వెనుక లరయక సాహసావేశభరమున నాతఁ డటకు వచ్చి చేరినది నిశ్చయమే కాని యిప్పు డాతనిమతి కొంచెము తిరిగినది. వెనుకటియావేశ మిప్పుడు లేదు. కొంతతడ వాలోచించి నిలువఁబడి విచారింపఁ దొడఁగెను. మరల మెల్లమెల్లగ ముందునకు నడువ దొడఁగెను. మరల స్థిరచిత్తమున నొక్కెడ నిలిచెను. ఇట్లు వ్యాకులమున ముందు వెనుక లాలోచించుచు తుట్టతుద కాతఁ డొక సుందరమందిరంబు కడకు వచ్చి చేరి మరల నిటునటు దిరుగ మొదలిడెను. కడ కాతఁడు తనలో నేమియో స్థిరపఱచికొని యామందిరద్వారమును గట్టిగ తట్టెను. కాని లోపలినుండి ప్రత్యుత్తర మేమియు రాదయ్యెను. ఇచ్చట తలుపుతట్టినశబ్దము ప్రకృతిదేవిశాంతమును భంగ మొనర్చి యాతనిహృదయమునుగూడ కంపింపఁ జేసెను. ఆసమయమున మాధవరావు మనసునకుఁగూడ తనపూర్వపుటేకాకపాటము నెవరో తట్టి నట్లుగఁ దోఁచెను. పూర్వసంకల్ప ముజ్జగించి మాధవరా విఁట కరుగ

నిశ్చయించెను—కాని పాపము మనోరమ దౌర్భాగ్యము! ఆమందిర ద్వారము తెరువబడియెను.

మాధవరావు జడియుచు నావంక జూడ, నెదుట నొక కాంతివంత మగుదీపము నొకచేత బట్టుకొని దీపప్రకాశమునుగూడ గప్పివుచ్చు జాలునొకయపూర్వలావణ్యవతి కన్నెదుట నిలుచుండెను. ఇప్పుడు మాత్రమాతనికి వెనుదిరిగిపోవ మనసొప్పదయ్యెను హతబుద్ధియై యామె దగ్గ నిలచియుండెను. ఇంతకుము న్నాతరుణి మాధవరావు నొకటిరెండుపర్యాయములు చూచి యుండెను. అంత నక్కాంత యాతనిచేయి బట్టుకొని, యాదరపూర్వకముగ లోనికి గొంపోవ దొడంగెను నదీమధ్యమున ప్రబలప్రవాహము గొట్టుకొని పోవు గడ్డి పోచ వలె నాతడామె వెనువెంటనే జనియెను

ఈదినము మొదలాతడు తఱచుగ నివైపునకు వచ్చుట ప్రారంభ మయ్యెను. ఈ దినము నుండియే యభాగ్యురా లగుమనోరమ జీవితము నందలి సౌఖ్యామృతము నొందుట కూడ ప్రారంభమయ్యెను ఈమె యాశాపాశము లొక్కటొక్కటిగ దెగి పోవుచుండెను.

ఏ యపరాధము వలన ప్రాణేశ్వరుడు తన్నిట్లు పరాభవించెనో యను చింతయు దెలియరాని మనోరమ రాత్రి యంతయు మిగుల విలపించుచు గన్నీరు మున్నీరుగా గార దుగడ సంకీయు దడిపివైచెను.

౧౧

ఇప్పుడు భాగ్యము గొంపోవ శ్వశురగృహమున కేతెంచిన సదాశివుని సంగతి యెట్లుండెనో కొంచెము విచారింతము. సదాశివరా విచటి కరుదెంచి రెండుమూడుదినము లైనది. ఇంతవఱ కాతడు తన కార్యసిద్ధికై యేమియు బ్రయత్న మొనర్చినట్లు కనబడదు. ఒకటి రెండురోజులలోనే జననియాజ్ఞ నతడు మఱచిపోయెను. తమ్ముని వేడి

"లక్ష్యమునకుఁ దెచ్చికొనుము, నేను సీతను!"

"మీరుకూడ లక్ష్యమునకుఁ దెచ్చికొనఁడు. నేను మీభార్యను."

"అందువల్లనే నేను నిన్ను బలవంతముగనైన దీసికొని పోవఁగలను."

"నన్ను బలవంతముగ దీసికొని పోయినచో ప్రాణత్యాగము చేసెదను."

సదాశివుని కీమాట రుచింపదయ్యె. అతఁడు తనభార్యస్వభావము బాగుగ నెఱుంగును. అట్లగుట నామెప్రత్యుత్తర మాలకించి మఱి మాఱుమాటాడక నుద్విగ్నుఁడై పెద్దతడవు స్తబ్ధుఁడై యుండి, కొంతవడికి మెల్లగా "అయితే మఱి నీవు నాతో నింటికి రావా?" యనెను.

సదాశివునిస్వర మెప్పుడు మంద మయ్యెనో యప్పుడు పార్వతిస్వరము గంభీర మయ్యెను. ఆమె రానని వక్కాణించెను.

అంతట సదాశివరావు దీర్ఘనిశ్వాసము విడిచి యిట్లనెను. 'సరే యుండుము నీ విట నిశ్చింతముగ నుండుము. నే బోయెదను'

'అట్లిప్పటికి సరిపడదు. మీరుకూడ నిచ్చటనే యుండవలెను'

"అ దెందులకు!"

"నాయిష్టము——నావాంఛ."

"నీయిష్టము నీదగ్గఱ, నీయాజ్ఞ పరిపాలించుటకు నే నేమియు కట్టుబడి యుండలేదు."

"అయితే మీరొక్కరే యింటికి వెళ్ళెదరా! సరే, సంతోషముగా పొండు. ఇక్కడనుండి మీరు కాలావల పెట్టినక్షణమున నేనురి కట్టుకొని చచ్చెదను. ఇదిమాత్రము త్రికరణశుద్ధిగా చెప్పుచుంటిని."

పాపము సదాశివుఁడు స్తబ్ధుఁ డయ్యెను. అప్పటి నుండి యాతఁ డామె యెదుట నావిషయ మెత్తఁడయ్యెను.

౧౨

సదాశివరావింటికి వచ్చుట కెంతవిలంబ మగుచుండెనో యట రాధ యంత యుద్విగ్న యగుచుండెను. ఈదినము వచ్చును, రేపు వచ్చును, మాపు వచ్చు ననుకొను చుండగనే పక్షముదినములు గడచి పోయెను అప్పటికి కూడ నామెకు పుత్రునిసమాచార మేమియు దెలియరాదయ్యెను. పాప మాయువుసలి చింతాసముద్రమున బడియెను. ఆమె కేమియు దోంచుటలేదు. మనసున నానావిధములగు నమంగళశంకలు గలుగుచుండెను చివర కామె యన్నపానములను గూడ వర్జించెను. కొమరుడు రాడాయె ననుమన్వహావేదనచే రాత్రులయందు జాగర మొనర్చుచుండెను. సంతతధారగ గారు నామెకన్నీటి కంతమే లేదు. సదాశివుని యత్తవారింటి కేగి వాని గతి యేమైనదో కనుగొని రమ్మని రాధ యైదారుదినములు నుండి వినాయకురావు నెన్నియో తెన్నుల చెవి నిల్లు కట్టుకొని పోరు చుండెను కాని యింతవఱకు లాభ మేమియు లేదయ్యెను నానాటికి వృద్ధి యగుచున్న తల్లి శోచనీయస్థితి గాంచి యింక మిన్నకున్నం గార్యము మించు నని తలంచి వినాయకరావు సదాశివునియత్తవారింటి కరిగెద నని తల్లితో ప్రతిజ్ఞ చేసెను. నిజముగ మఱునాటి తెల్లవారు జామున నే యాతఁడు సదాశివున త్తవారింటిత్రోవఁ బట్టెను.

వినాయకరా వింటనుండి యెటులో సాహసించి బయలుదేరెను. కాని యాతఁ డిప్పుడొక గొప్పవిచారమున బడియెను.

"ఏమిసేతును! నే నిప్పుడు గొప్పవారింటికి బోవలసి వచ్చెనే! అచ్చట పెద్దమనుష్యు లనేకు లుందురు. వారితో మాటలాడు టెట్లో, ఎట్లు నడచికొనవలెనో, తెలియని నాయట్టిబీదవానిం జూచి వారలందఱు దిరస్కరింతురు. ఎవ్వరైన బరిహాస మొనర్తురు!

యాతఁడు సుశోభిత మగు నాచావడికి వచ్చుటఁజూచి, రయమున నాగది ప్రవేశించి యచ్ఛాపాతబల్ల పై నాసీనుఁ డయ్యెను. ఊడిపోయిన యిటికె రాతిసందున నున్నచిలుము దీసికొని దానిలో గంజాయి నిండించు ప్రయత్న మొనర్చుచుండెను ఇంతలో నాగదిలో నుండువాఁడగు రామచంద్రపంతునౌకరు రాముఁడు తొందరతొందరగ నట కరుదెంచెను. అచ్చట తనయాసనముపై నధిష్ఠితుఁడై యున్నయయ్యా పరిచితమూర్తిం జూచి మిగుల విస్మితుఁడై, కొంచెము తిరస్కారముగ ని ట్లని ప్రశ్నించెను:—

"ఓ రామూకుంది?"

"ఏనాయకిరా పులికిపడి న-న-నే-ను-ఁ నాయికి"

"ఈ దే-చేత్తుండావు"

"చి-లు-ము-"

"అది నా కెరికే నువ్వెతో వచ్చావు?"

"నే నెవ్వరితో నూరాలేదు."

"మరీడ కెందుకొచ్చావు?"

"అమ్మ పంపినంమున"

"అరే! వెర్రిమొగమా! నీ కేం మతిలేదా యేమిటి? మీాయమ్మ పంపిందనరే, ఓరివగ్గరకో చెప్పక్కరలే?"

"అన్నదగ్గరకు"

"అన్నదగ్గరకా! అరే అన్న కూరు పేరూ లేదా యేంటి?"

"ఉంది ఉంగ, మాఅన్న పేరు సదాశివరావు."

"యేంటి! తమరుసదాశివబాబుగారి తమ్ముళ్లా? ఆ?"

"అవును."

"అయితే బాబూ ఇంతవరకు తమ రామాట చెలవిచ్చారు కాదేం? యీాలా య్యిందాన్లు, నే తయారుచేస్తు."

రాము డాయుత్తరపుది యిచ్చినదిలువ మందుకు వినాయకరావానందమున నసాళమంటునట్లు పీల్చెను గంజాయిద్రాగుచు దనలో దానిట్లనుకొనియెను. "వహవా! యేమిమజాగా వున్నది రాబాబు! ఎన్నెన్ని గొప్పవారిండ్లో గాంచితిని కాని, యొక్కయింటనైన నిట్టి దమ్ము లభించినదా? ఎందుక వారియైశ్వర్యము కాల్పనా?"

వినాయకరావు దమ్ము పీల్చి తన్మయుడయ్యెను. అట్టిసమయమున మరియొకనౌకరచ్చటకు వచ్చి రామునితో నిట్లనియెను. "రాందాస్! మనచదాచివబాబులెమ్ముండొచ్చాడంట. ఆయనగారేమన్నాఁడో. కూస్త చెపుదూ?"

వినాయకరావుదేన వ్రేలు జూపి రామదాసు కనుసైగ జేసెను. ఆనవీనపరిచారకునికి రామదాసునియభిప్రాయ మేమో తెలిసినది కాదు. వాఁడు మరల బిగ్గరగ "నీవు ఎన్నగలాలి సేస్తూండావా?" అనెను.

"ఒరే బాబుగారింటికాడనా పరాసికాలు! ఓర్రెరి మొగమా; యిడేం మనచదాచివబాబులెమ్ముఁడు యీడ గూకుండాఁడు."

ఆనవీనపరిచారకుఁడు వినాయకరావుమొగము జూచి నిశ్చేష్టితుడై నిలువబడియెను. వాఁడు మహావిస్మయమున మునిఁగెను. రామదాసుమాటలయందు వానికేమియు నమ్మకము గలుగదయ్యెను. ఇంతలో బాబాయివచ్చె! బాబాయివచ్చె! నని సంతసమునఁ గేకలిడుచు వినాయకుని సోదరపుత్రులు జగన్నాథుడు, రాముడు పరుగుపరుగునవచ్చిరి. పినతండ్రిఁ గాంచినంతనే వారత్యుత్సాహమున నెగిరి వినాయకుని తొడపై గూర్చుండిరి. ఇదియంతయు గాంచినంత నానూతన పరిచారకుని సందేహము తీరిపోయినది. వాఁడు విస్మయపడ్డి యిట్లనెను. "వినాయకబాబుగారూ! కాఫీతా

గటానికి పార్వతమ్మగారు పిలుస్తూండారు."

కాని వినాయకుని కిచ్చోటు విడిచి పోవుటమాత్ర మంతవరికిష్ట ముగ దోఁచ లేదు. అందు వలన కాఫీ యచ్చటికే తీసికొని రమ్మని యానవీనపరిచారకుని లోని కంపి, అన్నకొమరుని దగ్గఱచేరదీసి కౌఁగిలించి, ముద్దుగొని, కుశలవార్తల నరసి మహాసంతోషభరితుఁ డయ్యెను. అనంతరము రెండుగంటలకు భోజన మయ్యెను. భోజన మైనదితడవుగ వినాయకరావు మరల నాగదిని ప్రవేశించి యాపాత్రబల్లపై నాసీనుఁ డయ్యెను

సాయంకాలమున సదాశివుఁడు వినాయకుని చెంతకుఁ బిలిచి యిట్లనెను. "ఒరేవినూ! నీ విచట నిట్లూరకఁ గూరుచున్న నెట్లురా! నీవు వచ్చినపని కేమియుఁ బ్రయత్నము చేయునక్కఱ లేదా?"

సోదరుని పలుకు లాలించినంత వినాయకరా వాలోచనానిమగ్నుఁడయ్యెను. అన్నను వదినను దీసికొని పోవుటకై తా నిటకు వచ్చినసంగతి నాతఁడు మఱచి యుండ లేదు కాని, అందులకై తానేమి చేయ వలయునో యాతనికి దోఁచ దయ్యెను. సదాశివరావు తనంత బుద్ధిసామర్థ్యముఁ గల్గి నేరిగి యుండెను. వినాయకుని వలన నేమియు సాధ్యకాలము కాదని తలంచి, తానే యేదియో మార్గ మూహించుట యుచితమని నిశ్చయించెను. వినాయకుఁడు మిన్నకుండుట చూచి యాతఁ డిట్లనెను. "వినూ! నీ విప్పు డిట్లు చేయుము. మామామగారికడ కరిగి, యాయనతో మావదినను తీసికొని వచ్చుటకై మా యమ్మ నన్ను పంపినది. జగన్నాథుని రాముని వివాహమై యామె మిక్కిలి పరితపించు చున్నది, గనుక రేపటి దినము వీరిని పంపుటకుఁ దగినయేర్పాటు చేయుఁ"డని చెప్పుము.

వినాయకుఁ డేమియుఁ బలుకక కొంతవరకు స్తబ్ధుడై యుండి, అనంతరము తల గోఁకికొనుచు "అన్నా! మీమామగారియెదుట నే

గుట, యామునతో మాట్లాడుటమాత్రము నావల్ల కాదు బాబూ" అని నుడివెను.

తుదకు గత్యంతర మేమియుఁ గానక, తానే యావిషయమును మామగారి కెఱిఁగింప నిశ్చయించి, సదాశివుఁడు వినాయకుని వెంటఁదీసికొని రామచంద్రునిగది కరుదెంచెను. రామచంద్రపంతులు గాక తదితరు లెవరు నాగదియందు గూర్చుండరు. ఆసమయమున నాతఁడు శివసంహిత పారాయణానిమగ్నుఁడై యుండెను. అల్లుఁడు లోనికి వచ్చుటఁ గాంచి రామచంద్రపంతులు వానిని గూర్చుండ మనియెను. సదాశివుఁడొకవైపున గూర్చుండెను. వినాయకరావు లోనికరిగి, వినయభక్తుల రామచంద్రునకు సాష్టాంగదండప్రణామ మాచరించి, కిదలక మెదలక యొకవైపున నిలువఁబడెను. వానిఁ గాంచి ఈతఁ డెవ్వఁడని రామచంద్రుఁడు జామాత నడిగెను.

సదాశివుఁ డిట్లనెను. "ఇతఁడు నాతమ్ముఁడు. జగన్నాథము, రాముఁడు దగ్గఱ లేనందున మాతల్లి యెంతో పరితపించుచు వానిఁ దీసికొని వచ్చుటకై వీని నిటకుఁ బంపినది. మీయాజ్ఞ యయ్యెనేని రేపే ప్రయాణ మయ్యెదము."

'హు' అని ధ్వని చేసి రామచంద్రుఁడు కొంతవడి యూరకుండి గంభీరస్వరమున నిట్లనియె. "ఈవిషయము నాతోఁ జెప్పిన ప్రయోజన మేమి? మాధవరావును గనుగొనము. నే నిపుడు సంసారభారము వానిపై నుంచి యుంటిని. సర్వసంగపరిత్యాగికి నా కీగొడవ యంతయు నెందులకు?"

సదాశివుఁ డింక మఱుమాటాడక వినాయకుని వెంటఁ గైకొని మాధవరావుకొఱకై దివాన్‌ఖానాకుఁ జనియెను.

## ౧౩

సదాశివుఁడు ఖాన్ ఖానా కరుదెంచెను. మాధవరావు కోపనీ జూచుకొను చుండెను సదాశివునివెంబ వచ్చినవినాయకుని చూచి విస్మితుఁడై "ఏమి వినాయకరావా! వచ్చి యెంతసేపైనది?" అని ప్రశ్న చేసెను.

వినాయకుఁడు వినయముగ దూరమున నిల్లనెను. "ఈదినము రెండు జాములైనది."

"మంచిది! అట్లయితే మీయమ్మనుకూడ దీసికొని రాలే దేమి."

"రాలేదు. ఆమె యింటవద్దనే యున్నది"

"ఆమెకుమాత్రము మొంటరిగ నింటను సుశ్రమ యేల కలుగఁజేసి తిరి? వెంట తీసికొని వచ్చినచో బాగుగ నుండెడిదే!"

మాధవరావు తనవిషయమున, జూపిన యింతటియాత్మీయభావమునకు వినాయకుఁడు లోలోన మిగుల సంతుష్టుఁ డయ్యెను. కాని సదాశివుని స్థితి మాత్రము వారలకు వ్యతిరిక్తముగ నుండెను. మాధవరావు ప్రతివాక్యము నతనికి వజ్రాఘాతమువలె హృదయమునఁ దగిలెను. ఇప్పట్టు మాత్రమాతఁడూరకుండఁజాలక యిట్లు చురకొనెను: "మావినాయకుఁడు మీయింట నుండుటకు వచ్చినవాఁడు కాఁడు. మీచెల్లెలిని దీసికొని పోవుటకై వచ్చినాఁడు." అని నుడివెను.

ఈనమాటలవలన సదాశివునకుఁ గోపము వచ్చెనని మాధవరావు గ్రహించి "నేను నేమియు నట్టియభిప్రాయము లేని వాఁడనే" యని పలికెను.

సదాశివు డిట్లనెను. 'సరే పోనిమ్ము నాకట్లు తోఁచినది. సరియే కాని మీచెల్లెలి నంపువిషయమున నేమనెదవు?"

మాధవరావు గంభీరముగ నిట్లనెను. "నీభార్యను నీవు తీసికొని పోవుచుండ నే మడ్డుచెప్పగలను? కాని యొకవిషయము మాత్ర

ఘాలోచింపఁ దగినది. మీ కిప్పుడు సంపాదన మేమియు లేదు. సంసారమా పెద్దది. రాబడి తక్కువైనను ఖర్చు తగ్గుటకు వీలు లేదు గదా? అట్లగుట క్రమముగ ఋణముకూడఁ జేయవలసి వచ్చును. దానికితోడ నున్న కొంపగోడకూడ పోవును. ఏమి, నేచెప్పునది నిజమా నా కాదా?"

"అది యంతయు నిశ్చయమే కాని మాయమ్మ మిక్కిలి శ్రమపడుచున్నది. పిల్లలధ్యానమువలన నామె మిగులయలమట బొందుచున్నది. అన్నపానీయములుకూడ విసర్జించినది. మే మామెదుఃఖ మెట్లు చూడ గలము!"

"ఎంతైన నీభార్య గాదా? మీరు దానిని హింసింపకున్నచో నిట్లు తటస్థించి యుండదుగదా! మీరు కొంచెము నయమున దానికి తెలియచెప్పినచో నది సమాధానపడియే యుండును"

సదాశివుఁడు పెద్దతడవు నిరుత్తరుఁడై యుండెను. మనస్సులో నతఁడేమో యాలోచించు చుండెను. అట్లు విచారించుచుఁ దనలో నేదో ప్రతిజ్ఞకూడ చేసికొనియెను. అనంతర మొక పెద్దనిట్టూర్పు విడిచి మాధవరావుతో నిట్లనెను "ఔను మీరు చెప్పిన దంతయు నిజమే. రేపే నే నుద్యోగముకొఱకు బొంబాయి కరిగెదను. ఎప్పు డుద్యోగము లభించునో యప్పుడే మరల మీ కంటఁబడి మొగము చూపెదను.

మాధవరా వించుక నవ్వి యిట్లనెను. ఉద్యోగముకొఱకు మీ రేమియు బొంబాయికిఁ బోవ నావశ్యకము లేదు. దానియేర్పాటు నేను ముందే చేసి యుంచితిని. ఇప్పుడు మేము చేయుకంట్రాక్టుపని చాల వృద్ధిగ నున్నది. నే నొంటరిగ నది యంతయుఁ జూచుటఁ జాలకష్టముగ నున్నది. రేపటినుండి మీరుకూడ నాతో వచ్చి పని నేర్చుకొనుఁడు. కంట్రాక్టుపనియందు నాలుగుడబ్బులు దొరుకుట కేమియు

సభ్యంతరము లేదు. మీరు చక్కఁగ పని నెఱవేర్చుచున్నచో నేను మిమ్ము భాగస్థునిగ నేర్పఱచెదను. ఏమి ? బాగున్నదా?"

మోహజనక మైనవిషయము! సదాశివు డీమోహపాశమున బద్ధు డయ్యెను. వాని కటిచేతి స్వర్గము గానవచ్చు చుండెను. చంచల యగు లక్ష్మియొక్క మోహినిశక్తి కెవ్వఁడు వశ్యుఁడు గాకుండును? ఇంతవఱకు సదాశివునకు మాధవరావునెడ గల్గిన మమ్మ మంతయు క్షణములో మటుమాయ మైనది. మాధవరావువంటి హితైషి తన కీజగమున మఱియొకఁడు లేడని యాతడు దలఁచెను. "ఇంతకాలమున కిప్పుడు నాయనిష్టగ్రహములు తొలఁగి పోయినవి. నిజముగ నీదినమునుండియు మాదుర్దినములు గతించినవి" అను కొనుచు నాతఁడు తన ప్రతిజ్ఞ నుకూడ మరచెను. మాధవరావు వచించినచొప్పున నన్నియు స్థిరపఱచుకొని యుండెను.

వినాయకరావునకు తొలుదొల్తనిసంభాషణ మంతయు జక్కఁగ దెలియ లేదు. కాని యేదోనడుమనడుమ కొంతకొంత తెలియ వచ్చెను. సోదరున కుద్యోగము దొరకిన దని విని యెంతయునంత సించెను. అటులనే వదినెగారు తనతో నింటికి వచ్చుట లేదని విని మిగులవిషాద మొందెను. సదాశివుడు తమ్ముని నొక్కడకు దీసి కొనిపోయి యిట్లనెను "వింటివిగదా వినూ, ఇన్నిదినములనుండియు మనము పడుచున్నసమస్తకష్టములు నంతమందు సుయోగము లభించినది నీ వేయివుడు విని యుంటివిగదా రేపటినుండియు నేను మాధవరావువెంట పని చూచుటకు వెళ్ళవలె నని. అమ్మకు నీసకల వృత్తాంతమును నీవు చక్కఁగాఁ దెలియ జెప్పుము. మఱియు నిందు వలన ప్రస్తుతము మనకు గలిగెడిలాభముఁగూడ నామెకు దెలియ బరుపుము!"

సదాశివునిపలుకులు వినాయకుని కేమియు సంతోషదాయక ములు కావయ్యెను. అతఁ డిటనెను "అన్నా! నీకుద్యోగము దొర కినదిగాన నీవిట సంతోషముగ నుండవచ్చును. కాని వదినె కిట నేమియు నుద్యోగము లేదు గదా! మఱియామె యింటికి వచ్చుట కేమి యభ్యంతరము?"

"ఇదిగో చూడు వినూ! సంసారము గడపుట మనకు మిక్కిలి క ష్టముగ నున్నది. ఖర్చు జూడఁబోవ మితిలనధికముగ నున్నది. మీ వదినెకూడ నిచ్చట నుండినచో గొంతఖర్చు తగ్గును. ముఖ్యముగ నే నింకొకొకు చెప్పుచుంటిని. ఆమె యిచ్చట నుండుటయే మం చిది."

సోదరుని నుడువు లాలించి వినాయకుఁడు పరితృప్తుఁడై కొంత వడి కిట్లనెను. "అవునవును. ఇదియే బాగుగా నున్నది. తెల్లవారు జామున నేనింటి కేగి, అమ్మ కీసమాచార మెల్ల నెఱిఁగించి సమా ధానపరచెదను."

మఱునాఁ డరుణోదయమున లేచి వినాయకరావు తనయూరికిఁ బయనమై నడచెను. అచ్చట సదాశివరావు మాధవరావుతోఁగం ట్రాక్టుపనిలోఁ బ్రవేశించెను.

## ౧౪

సంసారమున సుఖదుఃఖయోగాలము లనయు రెంతయు దుర్లభము. సుఖోత్పత్తి దేనివలన నగునో, దుఃఖోత్పత్తి దేనివలన నగునో యూ హించుట సాధారణమానవబుద్ధి కొకొక్కసమయమున దసాధ్యము. మన మేవిషయము సుఖమునకు మూల మని తలంతుమో యా విషయమే మన మపారదుఃఖసముద్రమున మునుంగుటకుఁ గారణ భూత మగును. అవ్విధముననే యొక్కొది మనము దుఃఖపర్యంత మని

తలంచి శత్రువులచే దుఃఖజలధి మునిఁగియుండునో యదియే యొకానొక సమయమున మనల ననంతసుఖవారిధిని దేలించును.

సోదరుఁ డెఱిఁగించిన సంతోషవార్తఁ గొని వినాయకుఁడు తన గృహాంగణమునకు వచ్చుచుండెను. ఈవార్త విని తనతల్లి పరమానంద భరిత యగు నని సంతసించుచుండెను. కారణమేమన "ఇంత వఱకు తా ననుభవించుచున్న దరిద్రదశ తొలఁగి, సుయోగము సంప్రాప్తమగు" నని సోదరుఁడు వచించి యుండెనుగదా! సోదరుని యీవాక్యములు వినాయకుని హృదయాంతరంబున బ్రతిధ్వనించు చుండెను.

వినాయకుఁడు నిశ్చితుఁడై వడివడి నిల్లు చేరెను. వాకిట నరుగు మీఁదనే తల్లి సందర్శనమయ్యెను. కొడుకుని జూడగనే రాధ "పార్వతి యెంతదూరమున నున్నది?" అని మిగుల నాత్రముతోఁ బ్రశ్నించెను.

"ప్రస్తుతము వదిన వచ్చుటలేదు." అని యతఁడు చెప్పగా రాధ రయమున నిట్లనెను. "ఏమిరా నాయనా! దానిపుట్టినింట నందరు సుఖముగ నున్నారుగదా?"

"అందఱు సుఖముగ నున్నారు. అందుకు నీవేమియు సంశయింప నక్కఱలేదు. అన్నయ్యకు చట నుద్యోగము కుదిరినది. మాధవ రావు తనకంట్రాక్టుపనియందు దాతనికి భాగ మిచ్చెను. అందువలన నన్నయ్య ప్రస్తుతము వదినను బంపలేదు."

"ఇప్పుడు నీయన్న యత్తవారింట మనుగుడుచుచుఁ గూర్చుండెనా?"

"లేదమ్మా వానికి నిజముగనే యుద్యోగము దొరికినది."

"మనవానికి నౌకరీ దొరికినదా! దేవుఁడు నీనోట పంచదారఁ బోయుఁగాక. కాని, ఓరీ పార్వతి యిచట కెందుకు రాఁగూడదు?"

"అన్న యిట్లుచెప్పెను. ఇప్పటికే మనకు ఖర్చెక్కువగ నున్నది.

పైగా నామెనుకూడ నిక్కడకుబంపినట్టయిన మఱియు నెక్కువగును."

వినాయకుని నోటినుండి యీవలుకులు వెలువడ రాధ యత్యంత సంతప్తయయ్యెను. కొమరుని నోటనుండి కర్చెక్కువ యను మాట రా నామె కింతయో తప్పుగాఁ దోఁచెను. సంతాపభరమున నామె యిట్లనెను. "చచ్చినవాఁడా! నీ తెలివి మంట! నీ కెక్కువ తెలివి కేట లెక్కడనుండివచ్చెను? నీయన్నకు నౌకరీ దొరికినదిగదా! కర్చెక్కు వనేయేడు పెంపులకు? నే నేమి పాలు పెరుగు బోసికొని జుఱ్ఱుచుంటినా? ఏదైన మంచివస్తువు చేసినచో మీ మొగముననే పెట్టుచుంటిని గదా! పిడుగు వంటి యిట్టి సమాచారము దీసికొని వచ్చి నన్నుసమాధానపెట్ట దలఁచితివా? మంచిది, పోనీ. మీసొత్తులో నింతటినుండి నిజముగా నే నొకపూచికపుల్లనైన ముట్టను ఇప్పుడే నేను కాశికి లేచిపోయెదను ఇచ్చటనుండి యెముకలు విరుగునట్లు యీ పాడుచాకిరీ చేసి చచ్చుటెందులకు? పుణ్యమూ పురుషార్ధమా!"

ముసలి యిట్లనుచుండగనే యామె దుఃఖమున కంత్యస్వరూపిణి యగుకన్నీరు కాల్వలై పారసాగెను. చీరచెఱఁగుతో కనులు దుడిచికొనుచు నామె లోని కరిగెను. వినాయకుఁడు నిర్ఘాంతుఁడై పోయెను. "ఇప్పుడు మాయమ్మ నుడివిన యీయాలోచన నా కప్పుడేల తోఁచదయ్యెను. ఈపశ్చాత్తాపభావ మాతఁడు మరణకు నన్నను నాతనికి మఱపు రాదయ్యెను." ఇదిగాక, ఈయాకస్మిక సుఖదుఃఖ పరివర్తన మెట్లుకలిగెనో యాతని కిసుమంతయుఁ దెలియ రాదయ్యెను. పాప మాతఁడు దఖాతమునఁ బడియెను.

## ౧౫

ఆదినమునుండియు దీక్షితుని గృహమునఁ రాధరోదనముఁ దప్ప మఱే మియు వినరాకుండెను. సాయంసమయ మనక, ప్రాతఃకాల మనక, రాత్రి యనక, పవ లనక, రాధరోదనధ్వని మొదలెగక మిన్ను ముట్టుచుండెను. నిజ మాలోచించినచో నిదివఱకుఁ బెద్ద కొమరుని యొక్కయుఁ గోడలియొక్కయు నాచరణమువలన త్రాసము జనించి నప్పటికిని రాధమిగుల కౌశలమున గృహకృత్యముల నిర్వర్తించు చుండెడిది. ఇప్పుడుమాత్ర మామెకు సంసారమునందు మనసు గోరుటలేదు. ఆమె మిగులవిరక్తయై పిచ్చిదానివలె దినమంతయు నేడ్చు చుండును. గృహకృత్యములయెడ నౌత్సుక్యాభావము కలిగినందున నిల్లంతయు చీపిరిబాపిరిగ నుండెను. ఆమెకొన్నిదినము లొక్కపూట మాత్రము స్వయంపాక మొనర్చుచుండెను. అదియు నొక్కవినా యకునికొఱకే. తరువాత నప్పుడప్పుడు దిన మంతయుఁ గూడ వంటక మున్నకై తగవులు జరుగుచుండెను మనసు వచ్చినచో రాధ గరిటె నొక్కమారు సంభావన జేయుచుండెడిది లేనిచో నదియునులేదు. ఆవృద్ధురాలి మన సిప్పు డిచట లేదు.

ఈసంసారమునం దెట్టిబాధల నైన నోర్చుకొనవచ్చును, ఎట్టి యాతనల నైన భరింపవచ్చును, గాని కడుపుమంటమాత్రము సహింపరానిది. ఈయాతనముందు రోగము, శోకము, మఱి యెట్టి కష్టము లైననుతుచ్ఛములు. పుత్రశోకమున బరితపించు తల్లికూడ నుదరపోషణయం దశ్రద్ధవహించుట లేదు. నిశ్చయముగ దరిద్ర మన నంత యాతనామయ మైనది. దరిద్రుఁ డైనవాఁ డెంతటి ధైర్యవంతుఁ డైనను నొక్కొక్కప్పు డవమానమును, నదైన్యమును, బొందకతప్పదు. మహాజ్ఞాని యైనను, నెవ్వరు వానిజ్ఞానము నాదరించుటలేదు. విద్వాంసుఁ డైనను, నెవ్వరు వానివిద్వత్తును సన్మానించుట లేదు.

ఈయుగమున సన్మానము, జ్ఞానము, బుద్ధి యనునవి లక్ష్మీదేవికి భృత్యసముదాయమై యామెననువెంటనే వర్తించుచుండును. అట్టి కట లక్ష్మి యవకృపయు, నామెయక్కయగు పెద్దమ్మ దర్శనమును, నగుటతోడనే నివి యన్నియు నొక్కపరి సొరిగిపును. ఎచ్చట ధన ముండునో యచ్చటనే సన్మానము, అచ్చటనే విద్వత్తు, అచ్చటనే గౌరవము.

దీక్షితుని గృహముపై పెద్దమ్మ కృపాదృష్టి యత్యంతోత్తమముగా నధికమగుచుండగ అదినముననే వారి కాగ్రామమున గలస్నానములు కూడ క్రమక్రమముగ నష్టమగుచుండెను. ఇంటి యందు వేళకు దీపము వెలిగింపబడుట లేదు. వాకిట చిమ్ముడుట లేదు. గృహమున నలుకుగుడ్డ పట్టుట లేదు. కలాపియు జల్లబడుట లేదు. శుభకార్యములు, హోమహవనములు నాయింటికి దూరములయ్యెను. ఎక్కడ జూచిన నక్కడ నమంగళచిహ్నము లగపడుచుండెను. ఆగృహము దరిద్రదేవత కాటపట్టై మహాచు రగ మిణుగురుజాలి గొలుపుచుండెను. ఇప్పు డాదీక్షితుని గృహము శ్మశానమువలె భయదాయకమై గన్పట్టుచుండెను. గాధకోప మెంతవృద్ధి యగుచుండెనో యామెపుత్రస్నేహ మంత నష్టమగుచుండెను. ఇదిగాక రాధ కోప వివశయై యుద్రేకమున నొక్కొక్కప్పుడు పుత్రులను మిగులదిట్టుచుండినను వినాయకునకు మాతృస్నేహానుభవమువలన తత్కాల మత్యంతసుఖదాయకమై గన్పట్టుచుండెను. అయ్యది యిప్పు డదృశ్యమైపోయెను. తుదలేని కుసుమదరిద్రయాతనయు, తల్లికఠోరవాక్యములును వినాయకుని వంటిజడుని సైతము స్థిరుని చేసి వైచెను.

ఒక్కదినంబున తల్లి నానావిధము లగుతిరస్కారవాక్యములు పలుకుట వలన వినాయకుడు యేడ్చుచు గూర్చుండి యుండెను. ఇంతకు బూర్వము తల్లి యెన్ని తిరస్కారవాక్యము లాడి, యెంతకోపపడి

నను వినాయకుఁ డిట్లు రోదన మొనర్చుచు కూర్చుండ లేదు. వినాయకుని యీరోదనము వలన రాధమనసు నీరయ్యెను. ఆమెహృదయమున మగల బుత్రస్నేహము పొంగి పొరలి వచ్చెను. ఆమెయి వృట్టున స్వప్నముగ నూరకుండజాలకపోయెను. అమాయకుఁడును మంగళబుద్ధియు నగుతనకొమరునినడవడి స్మరణకు రా నామెయు వానితో పా టేడువ సాగెను. ఆదినమునఁ నామాతాపుత్రులు మిక్కిటముగ రోదన మొనర్చిరి ఆరోదనము వలన నాయుభయులకు నత్యంతసుఖము కలిగెను చాలసేపటికి వారిరోదనము సమాప్తినొందెను. ఒకర యశ్రుజలంబుల నొకరు తుడిచికొనిరి. ఆరోద నానంతర మిరువురిమనములు ప్రఫుల్లము లయ్యెను. కొమరునివలె తల్లియు మిగుల విస్మితయయ్యెను. కారణ మేమన ఆమె యీయు న్నంతయు రోదనముతోడనే గడచిపోయెను. అట్లయ్యును నేడ్పు వలన నింతటి సుఖ మామె కింతవఱ కెప్పుడును కలుగలేదు. వినాయకునిసంగతి చెప్ప నక్కఱయే లేదు. అతఁడు ప్రఫుల్లవదనుఁడై "అమ్మా!" యనెను.

ఆహాహా! "అమ్మా" అనుశబ్ద మెంతమధురము, స్వర్గవాణియే రాధచెవియందు శబ్దించిన ట్లయ్యెను. ప్రేమాతిరేకమున కొమరుని చుబుకము పుణికి యామె "నాయనా యే మనియెదవు!" అని యడిగెను.

"అమ్మా! ఏమిచేసిన నీకు సౌఖ్యము కల్గును చెప్పవా?"

రాధహృదయ మివ్వి దానందమున గంతులు వైచుచుండెను. వినాయకునినోటినుండి యిట్టిమాట వెలువడుననునాశ యామె కలవలేదు. ఆనందమున నామె యధీర యై పుత్రునిప్రశ్నకుఁ బ్రత్యుత్తరముగూడ నీయజాల దయ్యెను. ఆమె తనలో దాని ట్లనుకొనియెను. "నాసౌఖ్యమున కిప్పు డింకేమి కొదువరా తండ్రీ!"

వినాయకుడు తరల . నిల్చనిపోయెను "అమ్మా! ఎట్లాగర్చిన నీకు-సుఖమో నా కెటింగింపవా!"

తల్లినేత్రము లానందాశ్రువులతో నిండిపోయెను. 'ఆమె కన్నులు తుడిచికొని: "బాబా! నాలక్ష్మిని దీసికొనిరా! అది యిచ్చటికి వచ్చినచో నాకెంతో సౌఖ్యము కలుగును." అని చెప్పెను.

కొంతతడవు వినాయకగారు స్తబ్ధుడై యుండెను అనంతర మేమియో, యోచించుచు గదిలోని కరిగెను కొలది సేపటికి తలపాగా ధరించి, భుజముపై ప్రాతయుత్తరీయము వైచికొని గది వెడలివచ్చి తల్లిపాదములకు నమస్కరించెను. రాధ విస్మిత యై తనయుని మోము వంక దృష్టి నిగుడించి "వినూ! నాకిం(డ్రి యెక్కడికిరా ప్రయాణము!" అని ప్రశ్న చేసెను.

వినాయకుడు ప్రఫుల్లహృదయుడై "వెళ్ళి నీకోడలిని దీసికొని వచ్చెదను." అని బదులు చెప్పెను.

రాధ నివ్వెరపడి "ఏమి! వీడు నాముగపటివినాయకుడేనా! ఇదివ్వప్నము కాదుగదా? యనుకొనెను

౧౯

శ్రావణమాసము: మార్గమున కిరుప్రక్కల నున్న పచ్చనిపైగుల యపూర్వశోభ వర్ణనాతీత మై యుండెను. సృష్టిదేవత తనపృష్ఠభాగమున నాకుపచ్చనిరంగు శాలువ ధరించినదా యను నటు లెందుచూచినను పచ్చనిపైరులే దృగ్గోచర మగుచుండెను. అతిదూరము వ్యాపించి యున్న నానావిధ మహోన్నతవృక్షము లాకాలువ కంచువలె భాసిల్లుచుండెను. అహాహా! సువర్ణమయ మగు నీభరతభూమి యందుగాక యిట్టిహృదయానందోదకమును, చిత్తాపహారకమును, ప్రీతిప్రదమును నగునట్టి మనోహరసృష్టిసౌందర్యము . మరెచ్చటనైన గానవచ్చునా! ఈసౌందర్యము. మనకు గేవలనేత్రానంద మొదవర్చుటయే

కాదు, హృదయాంతరమున మహోన్నత భావములయొక్కయు, మహాకాంక్షితములయొక్కయు బీజారోప మొనర్చి, నూతనజీవనశక్తిని గూడ వృద్ధిపఱచు చున్నది.

ఇట్టిసుందరప్రదేశమున నడచుచు శ్వశురగృహమునకు బయన మొనర్చుచున్న వినాయక రావు సాయంత్రము నకూరు నాలుగుగంటల కాయూరు చేరెను. ప్రప్రథమమున నత్తవారింటి కేగక యాతఁడు బాజారున నొక్కగు కాణామునఁ జొచ్చి, నిశ్శబ్దముగ నొకవంక నిలువఁబడియెను. దుకాణాదారు సరుకు లమ్ముకొనుచుండఁడినిబడి యున్నందున చాలసేపటివఱకు నాతనిదృష్టి వినాయకునివంక కేరుగ దయ్యెను. వినాయకుఁడును వాని నేమియుఁ బలుకరింప లేదు. ఇంచుక సేపటికి కొనువారినందడి యుడఁగినందున దుకాణాదారునిదృష్టి వినాయకునివంకకు దిరిగెను. అంత నాతఁడు చకితుఁడై "ఓహో ఎవరు వినాయక రావుగారా! ఎప్పుడు వచ్చితిరి? అని కుశలప్రశ్నము చేసెను.

వినాయకుఁడు మెల్లగ "ఇప్పుడే వచ్చితి" ననెను.

"కూర్చుండుఁడు వచ్చినందుకు కొంచెము కూర్చుని చిలుముద మైన్మన(?) బీడి వలదా?" అని చెప్పిదుకాణాదారు తనదాపున నున్న కుఱ్ఱవానివంక జూచెను.

కుఱ్ఱవానిపేరు బాలకృష్ణుఁడు. బాలకృష్ణునివయస్సు షుమారుపది పండ్రెండువత్సరములుండును ఈతఁడు మిగులనుత్సాహశాలి చెప్పిన పని చేయుటయందు మిగులచురుకైనవాఁడు. ఎట్టిప్రశ్నమునకైన తడవుకొనక వెంటనే ప్రత్యుత్తర మీయ గలఁడు. తలిదండ్రులు మిగులబీదవా రగుటచే నితఁడు మనమామదుకాణముపై నుండెను. మనవారుపలుకు లాలించినంత [illegible], చిలుము తయారు చేసెను. దుకాణాదారు [illegible] దిరిగి

“అయితే సేఠుండీ! మీరింతవఱకు మీయత్తవారింటికి వెళ్ళి వచ్చుకొందుము” అని పలికెను.

“లేదు నే నిదే వచ్చుట.”

దుకాణదారు వినాయకుని యూరివాఁడే. అక్కడ జరుగుబాటు లేనందున నేఁటి కెనిమిదిసంవత్సరములక్రిందట నిటకు వచ్చి దుకాణము పెట్టియుండెను. చాలకాలముక్రిందట వినాయకుని జూచి యుండుటచే వాఁడు మిగులనుత్కంఠతోఁ దనగ్రామవార్తల విచారింపఁ దొడఁగెను. ఇంతలో వినాయకునియత్తవారింట నుండు నొకపరిచారకుఁడు మిఠాయికై యాదుకాణమునకు వచ్చెను. ఆపరిచారకుఁడు వినాయకుని జూచి గుర్తింపఁజాలఁ డయ్యెను. నిజమే, ఎట్లు గుర్తింపఁ గలఁడు! మిగులమాసి చినిఁగిపోయినయంగవస్త్రమును శిథిలమైన కాలిజోడు నచ్చటచ్చట చినిఁగిలోపలిచొక్కాయు, దుమ్ముతో నిండినకాలు సేతులును మొగమును విచారింపవలదా! ఇట్టిశోచనీయస్థితియం దున్నవినాయకుని జూచి తనయజమానుఁడైన శ్రీమంతు నానాసాహెబు దేశముఖుగారి యల్లుఁ డని యాపరిచారకుఁ డెట్లు గుర్తింపఁ గలఁడు? దుకాణదారు పరిచారకుని యాస్థితి గాంచి వెడలి పోవుచున్నవానిని కేకవైచి నవ్వుచు “ఏమిరా భీమా! వీరిని గుర్తించితివా? ఈతఁ డెవరు?” అని యడిగెను.

భీముఁడు చాలసేపు వినాయకునివంక దృష్టి సారించి జూచెను. అనంతర మించుకవిస్మితుఁడై “ఏమి! మాబాబుగారి అల్లుఁడయ్యా-కాదా?” అనెను.

“ఇప్పటికైన సరిగాఁ దెలిసికొనలేక పోతివా?” అని దుకాణదారు నవ్వుచు పలికెను

భీముఁడు క్రిందికి వంగి మిగులవినయమున వినాయకునకు “రాంరాం” చేసి “ఇదాయిత బాబూ! ఎప్పుడు వచ్చారు? ఈడ కూకుంట వెందుకు?” అని యడిగెను.

వినాయకుఁడు మాటలాడక యుండెనే యంగడివాఁ డిట్లనెను. "అరేరే ఈతఁ డిప్పుడు నీముందే కదా యింటకు వచ్చినది. నీవునడు. ఇప్పుడే మాయింటికి వచ్చెను."

ఈపలుకు లేమియు చెవి బెట్టక యాపరిచారకుఁడు మరల వినాయకునితో నిట్లనెను "వినాయకబాబూ! నడవండి. మాలక్ష్మమ్మగారికి మీరంటే మాపానం మీరొచ్చినసమాచారం యింటే సత్తెంగా చెప్తాను బలేసంతోషిత్తు ది. మీరింకా జాగుచెయ్యటం ఎందుకు? యేగిరం నడండి——"

ఇంతలో బాలకృష్ణుఁడు చిలిమిలో రొట్టెగఁ గాలిన కొబ్బరిత్రాడు వైచి యూదుచు మిగులగడబిడగా నటకు వచ్చెను. అతఁడు భీముని తొందరపాటు నంతయు గ్రహించెను. తా నంతశ్రమపడి సిద్ధపఱచి తెచ్చిన చిలుము పీల్చకుండగనే వినాయకుఁడు పోవ నుంకించుట గాంచి వాని మనసెంతో యారాటము బొందెను. వాఁడెంత మాత్రము సహింపక భీమునిమీఁదికి జని యిట్లనెను. "ఏమిరా! ఊరక యేమిటా గంద్రగోళము సేయుచుంటివు! ఈతఁడు మా యజమానునియల్లుఁడని మే మందరము నెఱుఁగుదుము లే. మీయాళ్లు ఇక్కడ గూరుచున్న మొదల నెవరైన కొట్టికొని తినిపోద రనియా యొక్కటే విధముగ నడుమనడు అనితొందర పెట్టెదవు! నీవుపోయి నీపనిచూచుకో, ఈతఁడు సావకాశముగా వచ్చును. వచ్చినందు కిచ్చట కొంచెము సేపు కూర్చుని గంజాయిదమ్ము పీల్చి కొంచెము విశ్రాంతిదీసికొని తరువాత నిష్టమైనచో వచ్చును, లేనిచో లేదు. తెలిసినదా? నీ వెందు కిట్లీతని రాత్రమ్మని యూరక వేధించెదవు?"

"నీవు. బలే అసాధ్యుశివి! కూస్తితాళు, నేనల్లి కాబుగారితో యీ చసమాచార మంతా ఉండదుండట్టు మనివిచేస్తా" అని భీముఁడు రయమున వెడలిపోయెను.

ఇచట వినాయకరావు తృప్తిగా దమ్ము పీల్చి పిదప కాలుసేతులు కడిగికొని కొంచెముసేద దీర్చుకొనియెను. మరల సంగడివానికిని వినాయకునకును లోకాభిరామాయణము ప్రారంభ మయ్యెను. ఇంతలో వినాయకునిమామ నానాసాహెబుగారు రాయంగడి కరుదెంచిరి. అతనివెంట వెనుకటి నౌకరును మఱిపదిపండ్రెండుగురు మనుష్యులు నుండిరి. నానాగారిని గాంచినంత నాదుకాణమున కలవా రందరు వినయముతో లేచి నిలువబడిరి. వినాయకుఁడు మామగారికి సాష్టాంగ నమస్కార మొనర్చెను. మామగా రపారప్రేమతో నల్లుని లేవనెత్తి యాశీర్వాద మొనర్చి నానావిధకుశలవార్త లరయుచు వినాయకుని వెంటగొని నిజమందిరమునకు జనుచుండెను. అట్లు చనుచుండ నాగ్రామస్థులు మఱికొందఱు త్రోవలో నానాగారిని కలిసికొనిరి. ఆసమయమున వారిముఖకమలము లానందమున వికసించియుండెను. దేశాంతరమున కేగినయొకానొక సమీపబంధువును చాలకాలమునకు గాంచినచో మనసున నెట్టి యానందము కలుగునో యంతకు మించిన యానందము వినాయకుని యాగమనమువలన కేవలమొక్క దేశముఖుగారికే గాక యాతనివెంట నున్న వా రందరికిని గూడ కలిగెను. వినాయకుని మోముదమ్మి మాత్ర మేకారణముననో మ్లానమై యుండెను. పోలీసుభటులచే కట్టుబడి దీసుకొనిపోవు ఖైదీ యేవిధమున భయవిహ్వలచిత్తుఁడై కారాగృహప్రవేశ మొనర్చునో యంతకుమించినభయముతో వినాయకుఁడు శ్వశురగృహమునఁ బ్రవేశించెను.

౧౮

వినాయకుని యాగమనమువలన గ్రామ మంతయు మిక్కిలి గడబిడగ నుండెను. అందు విశేషముగ యువతీయువకుల విషయమున నడుగ నక్కఱయే లేదు. దేశముఖుఁ డగు నానాసాహెబు గ్రామమున

ప్రముఖగృహస్థుఁడై యుండియు సహోదరులతోడను కలసి మెలసి యుండి
గౌరవ మందుచుండెను. అతఁడు మిగుల నుదారస్వభావుఁడు, ద
యాంతఃకరణుఁడు. బీదసాదలకు జేతనైనసాయము నొనర్చుచుండును.
పరమేశ్వరునిదయవలన నాతఁడు సంపన్నుఁడై యుండెను. ఇట్టిసు
స్వభావుఁడును సంపన్నుఁడును నైనగృహస్థున కారికొడు సన్మాన
ముం జేయుటయం దాశ్చర్యమేమి? నానాటను నాబాలవృద్ధముగా
సంతసించినిష్టము అందఱు కాతని యందెంతయో యభిమానము. అటు
లనే యాతనిపుత్త్రి లక్ష్మికూడ తనశరీరలావణ్యముచేతను గుణసం
పదవలనను, అలౌకికవినయసంపత్తిచేతను, చాతుర్యముచేతను నెల్ల
రకు సంప్రీతిపాత్రమై యుండెను. వినాయకుని యాగమనమువలన
నెల్లరు సంతుష్టాంతరంగులైరి. లక్ష్మిచెలికత్తెల సంతోషమున కం
తమే లేదు. ఇం దాశ్చర్యమేమి! తరుణస్త్రీలేవ నానాగారి లోపలి
గృహ మంతయు మిగులనందడిగ నుండెను. అటులనే వెలుపలి కచేరి
చావడి యంతయు తరుణపురుషులతో నిండి యుండెను. ఈసమయ
మున నానాగారియిల్లంతయు సంతోషసాగరమున మునిఁగి యుండెను.
సర్వత్ర సంతోషాధిదేవత నాట్యము సేయుచుండెను. గృహమంతయు
పరిహాసప్రసంగములతోఁ బ్రతిధ్వనించుచుండెను.

ఈపరిహాసప్రసంగములవలన వినాయకునిప్రాణము క్రిందుమీఁ
దగుచుండెను. ఈయువకు లందఱు దనచుట్టు నెందులకు మూఁగిరో
యెంతయోచించిన నాతనికి దోఁచదయ్యెను. వారందఱట్టు తన్ను
పరిహసించుచుండ బ్రతిహాస్య మొనర్చుటకు గాని కుశల
ప్రశ్నములను విచారించుటకు గాని వినాయకునికి ధైర్యము చాల ద
య్యెను. అతఁడు మహామునివలె స్తంభితుఁడై యుండెను. "ఓహో!
గొప్పగొప్పవారితో ప్రసంగము అంతకును వీ రందఱు పట్టణవాసు
లు. వీరలతో బాగుగ మాటలాడనేర్చిన సరి గాని లేనిపక్షమున

వరువు దక్కడు. నే నిప్పుడు మాటలవలనఁ జెందిన చెరు వేమి?" అని యాలోచించి వినాయకరావు మౌనవ్రతస్వీకార మొనర్చెను. అట్లయ్యు నాతఁ డొకటిరెండుమాటలు మాటలాడఁ బ్రయత్నించెను. కాని నోటనుండి శబ్దము వెలువడకూడ దని శపథముగదా! ఆశపథము వానికంఠముపైని కత్తివలె నున్నదే! వినాయకునిమౌనము వలన వారందఱు నిరుత్సాహులై మెల్లమెల్లన వారివారిగృహముల కరిగిరి. పోవునప్పుడు కొందఱు "ఆతఁడు గర్విష్ఠి" యనియు, మఱికొందఱు మూర్ఖుఁ డనియు, నెవరికిఁదోఁచినట్లు వా రనుకొన సాగిరి.

జనులకోలాహల మంతయు తగ్గగనే క్రిందుమీఁదగుచున్న వినాయకునిప్రాణములకు కొంచెముముస్వస్థత గలిగి తా నిప్పుడు స్వతంత్రుఁడైనట్లు తలఁచెను. కాని యాతని కీయవాంతరము గడిచినదో లేదో యింతలో లోపలినుండి రమ్మని పిలుపు వచ్చినది యిప్పుడు చేయవలసిన దేమి? అతడు దీర్ఘాలోచనమున మునింగెను. వాని కేమియుఁ దోఁచట లేదు. లోపలకుఁ బోవుట తప్ప గత్యంతరముగాన్పించుట లేదు. కొంతతడవు తనలోఁ దా నేమియో యాలోచించి, వినాయకుఁడు చప్పుడులేని వెనుకటి దుకాణదారుని కడకువచ్చెను. వినాయకుఁ డంగడి వానికి గహస్యముగ నత్తవారింటఁ జరిగినసంగతి నాద్యోపాంతముగ వివరించెను. మఱియు తానేయుద్దేశ్యమునవచ్చియుండెనో యోచింగించి యాప్రజానమూహామునుండి తప్పించుకొన నిప్పు డేదేని యుక్తిఁ దెల్పుమని వానిని బ్రార్థించెను.

వినాయకుని సమస్తవృత్తాంతమును గోలకృష్ణుఁడు మిగులకౌతకముతో వినుచుండెను. నడుమనే యాతఁ డిట్లనియెను. "అన్నా! నన్ను నీతోఁ దీసికొని పోయెదవా? అల్లుని వంక్తిలాభము నేను కూడ రెండుదినములనాయాసముగా ననుభవించెదను. నేను నీవెంట నున్నచో మఱి నీ వొక్కయక్షరముకూడ బలుక నవసరము లేదు.

అన్నిటికి నే నెట్లు వడివడి ప్రత్యుత్తర మిత్తునో? నేనేగా చెప్పుగాక చెప్పుము, నన్ను వెంట, దోడుకొని పోయెదవా? చూడు! ఇది నీమంచికొఱకే సుమా చెప్పు చుంటిని."

వినాయకునకు స్వర్గము వచ్చి యఱచేతఁ బడిన ట్లుండెను. అతఁడు బాలకృష్ణుని తనతోఁ దెచ్చిన నగల దుకాణదారుని మిగుల వేఁడుకొని, తుద కాతని సమ్మతి పొందెను. బాలకృష్ణుఁడును పర మానంద భరితుఁడై మాసినయంగవస్త్రమును విడిచి, పండుగదినముల యందు గట్టుకొనుట కై ప్రాణప్రదముగ దాచి యుంచినజరీధోవతి యు అంగరఖా, టోపి, మొదలగునవియు ధరించినీటుగా వినాయ కునితోఁ బయలుదేఱెను. ఇరువురును వచ్చి కచేరిచావడి యందు గూర్చుండుట తడవుగా "ఫలహారమునకు లెండు ఇంకను నాలస్య మెందులకు?" అని పరిచారకులు పిలిచిరి. వెంటనే వినాయకరావు లోపలికి పోవుచుండెను. బాలకృష్ణుఁడు గూడ వాని వెనుకనే జను చుం డెను. లోపలఁ బ్రవేశింపఁ బోవుచుండ లక్ష్మిచెలికత్తె లొనర్చు చున్న మందహాసధ్వనులు వానిచెవులఁ బడియెను. తోడనే వినాయ కునకు నోటఁ దడియాఱి పోయెను. ఇప్పు డేమి చేయవలయును! ఆధ్వని వినవచ్చిన యంతర్గృహము వైపునకు బోక చప్పున తిరిగి పోవుటయే యుత్తమమార్గ మనిదలంచి వినాయకరావు మఱియొక ప్రక్కకుఁ బోవుచుండెను కాని వానిప్రయత్నము నిష్ఫల మయ్యెను. ఒకపరిచారిక ముందునకు వచ్చి, అతఁడు తప్పించుకొనిపో వుటను చూచి, "అటుకాదు ఇటు యిటు దయచేయుఁడు" అని వినా యకుని సవినయముగ విన్నవించి యాధ్వని వినవచ్చినగదిలోనికే యాతనిదోడ్కొని పోయెను. బలియిచ్చుటకై గొనిపోవుగొఱ్ఱెపోతు వలె కంపితగాత్రుఁడై వినాయకరావు వేఱు తెలివుఁ గానక యాగదిలోఁ బ్రవేశించెను. ఆగది యందున్నయువతీమణుల కటాక్ష

కూలికి లాతని నొక్కుమ్మడి జుట్టుకొనెను. అ య్యపూర్వావ
దర్శనమున అంగనలు నొక్కక్షణము నేత్రసంకేతముల పరస్పర మనో
భావముల వెల్లడించుకొనిరి. వినాయకుడు తలయెత్తి చూచు నప్పటికి
విశాలమగు నాయంతర్గృహమున ననేక యువతీమణు లొక్కటిగ
జేరియుండిరి. వారిముందు నొక వెండిపళ్ళెరమున నానావిధఫలహారము
లునిచియుండెను. తలవంచికొని వినాయకరావు పీట పై గూ
ర్చుండెను. సహాయజామాత యగు బాలకృష్ణుడు కూడ నాతని
ప్రక్కనున్న మఱియొక పీఠముపై విరాజమానుడయ్యెను. వినాయకుని
యాలజ్జావ్యవహార మంతయుఁ జూచి యాయువతులెల్ల రొక్క
పరి మధురమందహాస మొనర్చిరి. కొంచెమునే నాయంతర్గృహము
నిశ్శబ్దముగ నుండెను. ఆనారీమణుల వికసితముఖకమలములు నిస్తే
జము లయ్యెను. ఇంతలు యువతీమణు లొక్కటిగఁజేరి యింతతడవు
స్తబ్దముగనుండి రెందులకో! తుదకొక్కతె యాశాంతికి భంగమొ
నర్చెను. ఆమె మందహాస మొనర్చుచు నిట్లనెను. "మాబావగా రీది
నము ద్రోవతప్పి వచ్చినారని తోచుచున్నది."

బావగారు నోరు తెఱచు టెట్లు! తల పై కెత్తనని శపథము
గదా! వాస్తవముగ నాతడిప్పుడు నోరు తెఱువవలసిన యావశ్యకత
లేదు. తనకు బదులుగ బాలకృష్ణునకు సర్వాధికారములును ముఖప
త్రముద్వారా దొసంగి యుండెను. బాలకృష్ణు డిట్లని వెంటనే ప్ర
త్యుత్తర మిచ్చెను. "ఓహో మేము త్రోవతప్పినచో నిచటి కెట్లు
వచ్చియుందుము? మార్గమునరిగా నెఱిగియుండుటచేతనే యిచటికి
రా గలిగితిమి."

ఈప్రత్యుత్తరము వినినంత నాయువతు . లెల్లరు నాబాలమూర్తి
వంక జూచి నాగిరి. వినాయకునితో గూడ వచ్చినయీబాలకు డెవ్వ
డో యెంత మోహించినను వారికిఁ దెలియరా దయ్యెను. తుదకు లోల

దొల్త ప్రశ్నించినతనతగుణి యితరనారీమణులను తృప్తిపఱచుటకై యించుక ధైర్యము చిక్కబట్టి "మాబావగారికి నీ వెక్కడ దాపరిం చితివి నాయనా!" అనెను.

బాలకృష్ణుఁడు సామాన్యుఁడా! అతఁడు సరళముగా, కొంచెము ప్రత్యుత్తర మీయఁ దలఁచి, వినాయకునివైపు వ్రేలుజూపి "ఈతఁడు మాయన్న" అని వచించి పళ్ళెమున మిగిలనలడ్డువముక్క నెత్తి మిక్కిలియాతురతతో నోట వైచుకొనియెను. వానిపలుకులచే నా స్త్రీలకు మిగుల కౌతుకము జనియించెను. నిస్తేజమై యున్న వారి మొగములు మరల మధురమందహాసచంద్రికలతో వికసించెను

బాలకృష్ణుఁ డొసఁగినప్రత్యుత్తరము వినినంత వినాయకునియా నందమునకు పారమే లేదు- అతఁడు తనమనమున నబ్బాలకు నొక్కటే విధముగా మెచ్చుకొనుచుండెను. అతఁడు తనవెంట నుండుటచేతనే యీదినమున తనపరువు దక్కినదని తలంచెను ఇందరువరభామి నులు తనచుట్టు నుండుట చూచి యాతఁడు ఫలహార మొనర్చుటకు సిగ్గుపడియెను. ఆస్త్రీలెల్ల వానిని మిక్కిలి పరిహాస మొనర్పసాగిరి. వినాయకునిహస్తముపైకి లేచుటలేదు. వానికి ఫలహారము గిలహా రము నేమియు దోఁచుటలేదు. ఎప్పుఁడీబాధనుండి విముక్తి గల్గునా యని యాతఁడు యోజించుచుండెను. ఇదియంతయు గనిపెట్టి బా లకృష్ణుఁ డాస్త్రీల నుద్దేశించి యిట్లనెను. "ఇంతదూరము నడచివచ్చి నందున మాయన్న మిగుల నలసి యుండెను. కావున ముందు యథేచ్ఛముగ మమ్ము ఫలహార మొనర్ప నిచ్చి కొంచెము సేదఁ దీర్చుకొనినపిమ్మట మీ యిష్టము వచ్చినట్లు హాస్యము చేయుఁడు." ఏమండీ" వదినే! ఇంకను కొంచెము ఉప్మావు తీసుకొనివచ్చినారు కా కేమి! మాయన్నకు ఉప్మావన మిగుల నిష్టము"—

ఆపడుచులనోళ్ళు కట్టబడియెను. బాలకృష్ణునివర్తనము వలనను

వేళాకోలు వలనను ఆస్త్రీలెల్లరకు సహనము గల్గెను. ఈయవధిలో వినాయకుఁ డతిత్వరితముగ ఫలాహార మొనర్చెను. బాలకృష్ణుపళ్లెమున మాత్ర మేమియు మిగులలేదు. ఇంకే మైనను సమలుటకున్నచోఁ బాగుగనుండు నని వాఁడు యోజించుచుండెను. కాని యింతలో వినాయకుఁడు లేచినందున విధిలేక పళ్ళెము ముందునుండి యాతఁడు గూడ లేవవలసి వచ్చెను. చేతులు గడిగికొనినపిదప తాంబూల చర్వణము కొఱకువినాయకుఁడు ప్రక్కనున్న గదిలోఁ బ్రవేశించెను. బాలకృష్ణుఁడును వాని వెనువెంటనే జనియెను.

అదిగాంచి యా యువతులెల్లరు లోలో నవ్వికొనదొడఁగిరి. వారల కబ్బాలకుని ప్రతివాక్కును ప్రతిచర్యయు మిగుల సంతోషకరముగ నుండెను.

తాంబూల చర్వణానంతరము మృదుశయ్యపై దిండునానుకొని వినాయక రావు కూర్చుండెను. ఇంతలో హాస్యవినోదోత్సుకలైన యువతులుకూడ మరల నచ్చటికి వచ్చి ప్రత్యక్షమయిరి. ఆయువతులపరిహాసోక్తులనుండి తప్పించుకొంటినిగదా యని సంతసించుచున్న వినాయకునకు వారిని గాంచి నంతనే మరల ప్రాణములు క్రిందుమీఁదు కా సాగెను. గుండె దడదడ గొట్టుకొన సాగెను. మోము వెలవెల బారెను. ఇంతలో ననుపమరూపవతి యగునొక బాలిక మంజులస్వరమున వినయపూర్వకముగ వినాయకునితోఁ "బావ గారికి మేము జ్ఞాపక ముంటిమా?" యనెను.

బావగారికినోటికి తాళమే! బాలకృష్ణుఁడు కన్ను లెప్పలల్లార్చుచు వెంటనే ప్రత్యుత్తర మొసఁగెను "వా! జ్ఞాపకమ లేనిచో మే మిం చటికెట్లువచ్చితిమి? మాయాగమనమే యూజ్ఞాపకమును స్థిరపఱచు చున్నది కాదా? అయినను మీవంటివారి నొక్కసారి జూచినతరు

వాత మిమ్ము మఱచుట శక్యమగునా? నేనే మఱవజాలనైతిని. ఇఁక మాయన్న నూటఁ జెప్ప వలయునా!"

పాపమా బాలిక యీప్రత్యుత్తరము వలన మిగుల సిగ్గుపడి, తక్కిన యువతీజనము వెనుక కరిగి దాఁగికొనియెను. అంత మఱియొక యువతి యించుక ధైర్య మవలంబించి "నీ కీ కంత కోపమేల మందులకు నీవూరక కూర్చుండలేవా? నీతో నెవరును మాటలాడలేదు. తెలిసినదా?" యనెను.

బాలకృష్ణుఁడా యీపలుకులకు మిన్నకుండువాఁడుకాడు! ఆతఁడు గంభీరముగా "వదినే! మీ కేమనియెదరు? నేను మాయన్న పంక్తి భోజనమునకు వచ్చితి ననుకొంటిరా? నన్నూరక కూర్చుండు మనుటకు?"

"మీయన్నగారు మూఁగవా రనుకొనెదను. ఆయన నేమి యడిగినను ప్రతిప్రశ్నకు నీవే ప్రత్యుత్తర మొసఁగెద వేమి?"

"ఎందుకు మూఁగవాఁడైనాఁడు? నేను వెంటలేనా! నే నేప్రశ్న మునకుత్తర మొసఁగఁ జాలనో యాప్రశ్నమున కాతఁ డుత్తర మొసఁగును. తెలిసినదా? ఈకుంటిప్రశ్నములకు ప్రత్యుత్తర మొసఁగుట కాతఁడు గూడ కావలయునా?"

బాలకృష్ణుని యీమాటల కంతయు పకపక నవ్వసాగిరి. కొంత తడవున కాస్త్రీ మరల నిట్లనెను. "వారేవా! నీవు మిగుల హుషారైన పిల్లవాఁడవు. ఏమండీ బావగారూ! ఈహుషార్ సోబత్ మీ కెక్కడ దొరికినది?"

దీనిపైన బాలకృష్ణుఁడు హేళనగా "వదినే! రాజులకు గజాశ్వము లెచ్చటదొరుకుచున్నవి?" అనెను.

ఆస్త్రీ లెల్లరు పకపకనగి మోము లావైపునకుఁ ద్రిప్పుకొనిరి. బాలకృష్ణుని యీ యపూర్వ చాతుర్యమును గాంచి వినాయకరావు

గూడ నిప్పుడు మాట లాడుటకు ధైర్యమువహించెను. కానియెవరితో నేమని మాటలాడవలయునో వానికి దోఁచలేదు. తుద కాతఁడు బాలకృష్ణుని వైపునకుఁ దిరిగి "బాలకృష్ణా! చిలుము తయారుచేసి తీసుకొని రమ్ము." అనిపలికెను.

వినాయకుని నోటనుండి శబ్దము వెలువడుటయే తడవుగ బాలకృష్ణుఁ డొక్క యురు కురికి పరుగెత్తెను, ఇంతలో మెల్లమెల్లగ వైధవ్యదుఃఖాగ్నిచే మ్లానవదన యగునొకమూర్తి ద్వారముదగ్గఱకు వచ్చి నిలువఁ బడియెను ఆసమయమున నటనున్న వారందఱి దృష్టులు నాదెస కరిగెను. సదాశివునిమామ యగు రామచంద్రునిపెద్ద కోడలే యీమె. మఱియు నిమె మాధవరావుని సోదరుఁడును స్వర్గవాసియు నగునారాయణరావుభార్య నానాసాహెబునకు మేనకోడలు. ఆమె క్షణమాత్రము లోనికి తొంగిచూచి మనసున నేమితోఁచెనో కాని దౌర్భాగ్యురా లగులక్ష్మి వెంటనే యదృశ్యురాలయ్యెను వినాయకుఁ డాశ్చర్య చకితుఁడై యాయువతీ సమూహమువంక జూడఁ దొడగెను. ఇదిగాంచి వారలలో నొక్క తరుణి నిట్టూర్పు విడిచి కరుణా జనకస్వరమున నిట్లనెను. "పాపము దానిపై నాకసమునుండి గొడ్డలి జారిపడినది. ఎంతో యుత్సాహమున మిమ్ము జూడరా నామెకు దుఃఖము పొరలివచ్చినది మీతో మేము హాస్యము లాడుచుండుట గాంచి లోని కేగినది. ఏమిచేయుదుము, దానిప్రారబ్ధము!"

కొంతవఱ కెల్లెడ నిశ్శబ్దముగా నుండెను. ఒక్కరినోటగూడ శబ్దము వెలువడుట లేదు. కొంతసేపటికి వెనుక దాగిన బాలిక మరల ధైర్యముఁ దెచ్చుకొని ముందునకు వచ్చి మృదుస్వరమున "బావా! ఇంకకుముందెన్నిమారులో మిమ్ము రమ్మని యుత్తరములు వ్రాసితిమి. ఒకటి రెండు పర్యాయములు ప్రత్యేక మిందుకొఱకై మనుష్యులను గూడ బంపి యుంటిమి. కాని మీరురారైతిరి. ఇపుడుమీ యంత

మీరాగే వచ్చితిమి. మాపై నింతటి యనుగ్రహ మెట్లు కలిగినది? మీకు మాపైని గోపము వచ్చిన దేమో యని తలంచితిమి."

తనచిన్న నాఁడబిడ్డ పలుకులు లాలించి వినాయకరావు ప్రత్యుత్తర మొసఁగుటకు సాహసించెను. బాలకృష్ణుఁ డింకను తిరిగి రాఁడయ్యెను. కావున విధిలేక యాతఁ డిట్లనెను. "అమ్మ పంపినందున వచ్చితి—"

"ఆలాగా!"

ఆబాలిక కింకను మాటలాడ వలయునని యున్నది. ఇంతలో చిలుము చేతఁ బట్టుకొని బాలకృష్ణుఁ డచటి కరుదెంచెను. అతఁడు తమపక్షమున బూర్ణాపజయము వాటిల్లినట్లు తలంచెను. చిలుము వినాయకున కొసఁగి తత్క్షణ మాతఁ డిట్లనెను. మావదినను దీసుకొని వచ్చుటకై మాయమ్మ పంపినది. తెలిసినదా? అమ్మ పంపనిచో మే మెందుకు కావలెను దీసుకొని పోవుటకు వత్తుము? ఆహా! మీ కీ మాత్రము తోఁచ లేదా!"

ఆబాలికకు మిక్కిలి యవమానము జనించెను. "నాయనా, నీ వెక్కడనే యుంటివా?" యని తనలో ననుకొనుచు నచటనుండి యామె వెడలి పోయెను. తరువాత నామె యచటకు రాలేదు.

యువతీవర్గమునకు బాలకృష్ణుఁ డొసఁగిన ప్రత్యుత్తరము లెంతయు సమయోచితముగ నున్నందున నాని మాటయన్న వారికందఱకును మిగుల కౌతూహలజనకముగ నుండెను. తుద కొకసుందరి వానినామము చేతనే వానిని పరాభవింపఁ దలంచి మిగుల గాంభీర్యముతో "ఏమిరా! నీపేరు బాలకృష్ణుఁడుగదా? ఆఁ! కృష్ణుఁడు బాల్యప్రాయమున పశువుల గాచెను. నీవును నట్లుచేయుదువని తలఁచెద" ననెను.

కాని బాలకృష్ణుఁ డెట్టిగట్టివాఁడు. అతఁడు మందహాస మొనర్చి వెంటనే యిట్లనియెను. "అవునవును. నేనుపశువుల గాచితిని. ఇంతి

యేకాదు. వనమున కేగినప్పుడు కదంబవృక్షచ్ఛాయను కూరుచుండి మురళిగూడా వాయించితిని. తెలిసినదా?”

అంతనా స్త్రీలెల్ల పకపక నగిరి. అం దొకబాలిక యిట్లనియెను. “అహాహా. ఇది మురళి వాయించు పాటలేగదా! నీవు సంగీతపాఠకుఁడవుకూడనా! అందును నీవు మురళిగానముకూడ నొనర్చితివా? అట్లయిన నప్పు డేమేమి పాడితివో యిప్పుడు పాడి చూపించెదవా?”

బాలకృష్ణుఁడు మధురస్వనమునఁ బాడుటకుఁ బ్రారంభించెను.

ఆయువతీవర్గ మెల్ల తటస్థముగ నుండి వినుచుండిరి. వినాయకుఁడు గానమున లీనుఁడై పోయెను. బాలకృష్ణుఁ డద్వితీయమూర్తి యని వానికి సైతము దోఁచెను. అల్ప వయస్కుఁ డగు నా బాలకుని మధురకంఠము నుండి వెలువడిన యాగానామృతము నాలకించి యా యువతులెల్లరు నచేతనలైరి. వారు పరస్పరము మిగుల ప్రశంసించిరి.

౧౮

రాత్రి పదిగంట లగునప్పటికి భోజనాదికముల నిర్వర్తించి వినాయకరావు శయన గృహమును బ్రవేశించెను. కాని లక్ష్మిమాత్ర మింకను రాలేదు. పగలంతయు వినాయకరావు రమణీబృందము నడుమనే యుండెను కాని యాసమయమున బాలకృష్ణుఁడు దండనుండుటచే నాతఁడు ధీరుఁడై యుండెను. బాలకృష్ణుని వాక్చాతుర్యము వలన నాతని సంకోచవృత్తి యంతయుఁ దొలఁగి పోయినది. ఇప్పుడన్ననో బాలకృష్ణుఁడు తనతో నుండుటకు వలనుపడదు కదా! ఇప్పుడాతఁ డొంటరి యయ్యెను. ఈవిచారమున మరల భయదేవత ప్రత్యక్ష మయ్యెను. అతని మోము కళావిహీన మయ్యెను. సుశిక్షితయు, విదుషీమణియునగు భార్యతో రాత్రియంతయు గడుపవలెనే! ఆమె తన్నే మైన బ్రశ్నించినచో నేమని ప్రత్యుత్తర మొసగవలెను? సరి యైన ప్రత్యుత్తరమొసఁగనిచో నామెకడ పరాభవము సంభవించునే

ఈయోజనలవలన నాతఁడు చింతాసముద్రమునఁ బడియెను. ఇంతలో మందగమనయున లక్ష్మీబాయి శయనగృహమున కరుదెంచెను. వినాయకుని హృదయము తటతట కొట్టుకొనసాగెను. అతఁడు గాఢసుషుప్తి నటించుచు, దుప్పటిగలవఱకు ముసుగిడి మంచముపై నొకవైపునఁ బరుండెను లక్ష్మి మెల్లమెల్లగ పతిసన్నిధి కరిగి యాతనిపజ్జ పవ్వళించెను. చాలసేపటివఱకు నిరువురు స్తబ్ధులై యుండిరి. ఎవరినోటివెంటను మాట లేదు. ఇట్లుండుట వినాయకున కిష్టముగ నుండెను కానిలక్ష్మి కీమౌనము మిక్కిలి యసహ్యముగ నుండెను. ఆమె యింక నూరకుండ లేక వినయముతో దొలుత మగనితో "మనయింట నందఱు సుఖముగ నున్నారా?" యనెను.

వినాయకున కీప్రశ్నమున కేవిధముగను ప్రత్యుత్తర మొసంగ శక్యముగా కుండెను అంతమాత్రముగ నాతనిమనమున కొక్కయూహ తోఁచెను. "ఈప్రశ్నకు 'ఆ, యనిన చాలు' నింతకంటె నతిశయ మేమియునక్కఱలే" దని యాతఁడనుకొనెను. కాని దీనికుత్తర మొసగినచో తోడనే యామె మఱియొకమాటు ప్రశ్నించును. దానికి సమాధాన మొసఁగిదో మఱియొకటి యడుగును. దానికొసఁగినచో మఱియొకటి. ఇట్లొకదానిపై నొకటివచ్చి పడినచో నేనెట్లుత్తర మొసఁగుదును, మొదలే యొసగనిచో మఱి ప్రశ్నయే యుండదు. "మౌనం సర్వార్థసాధకం" మ్మని యామంత్రము జపించుచు నాతఁడు నోటికి తాళమువైచికొని స్తబ్ధుఁడై యుండెను. ఇట్లు చాలసేపు గడచెను. తనప్రశ్న కేమియుఁ బ్రత్యుత్తరము రానందున లక్ష్మి మఱి ప్రశ్నింపక, మెల్లగలేచి, పతిపాదసేవ యొనర్చుట కారంభించెను. ఆమె కాలిపైచేయివేయుట తడవుగ వినాయకుడు ఊఁ ఊఁ అని యొడలు విఱిచికొనుచు నేమో బాధ నభినయించి కాలు లాగికొనెను.

భర్తవేదనఁ గాంచి లక్ష్మి కళవళ మొందసాగెను. ఆమె తనచేయి

దీసికొని కరుణాస్వరమున "మీశరీరమునఁ గలబాధ యేమి?" యని వినాయకు నడిగెను.

వినాయకరావు శపథమును మఱచి యీప్రశ్నకుత్తర మొసంగుట తప్ప గత్యంతర మేమియు లేదని తలఁచి, మిగుల ధీరుఁడై మెల్లగా "ఇంతదూరము త్రోవపొడగున గులకరాలమీఁద నడచుటచే పాదములు మిగుల నొప్పులెత్తుచున్నవి.' అని చెప్పెను.

లక్ష్మీబాయి యిఁకేమియు మాటలాడ లేదు. తత్క్షణము మంచముమునుండి లేచి, లోనికరిగి గిన్నెలో గొంచెము దీపము పై వెచ్చజేసి, కోమలహస్తములతో నాతనిపాదద్వయమును మర్దించుచు కూర్చుండెను. వినాయకుని పాదము లు నిజముగ బొబ్బలెక్కియుండెను. వెచ్చనిచమురు రాయుటచే నాతని కెంతయు, సుఖముగ నుండెను. తైలము రాయుచు నామె "మనయింట నొకరు సుఖముగనుండిరా?" యని యడిగెను.

వినాయకుఁడు "ఆ" అనెను

"మాయక్క పార్వతి కోపమున బుట్టినింట నిల్చినదట నిజమేనా?"

"ఆ"

"మనవారామెను దీసికొనివచ్చుట కెవ్వరైన వెళ్ళినారా?"

"ఆ"

"మఱి వారామె నెందులకు బంపలేదు?"

ఇప్పుడేమి చేయవలయును? చిక్కు వచ్చినది. ఇంతవఱకొక్క 'ఆ' అను నక్షరముతో నిర్వహించుకొని వచ్చుచుండెను. కాని యీ ప్రశ్నకు 'ఆ' అని గాని, ఈ, అని గాని 'ఊ' అని గాని యుత్తర మొసఁగుట శక్యముకాదే! పాపము, వినాయకునికి పిచ్చికిగుండె దడ దడ కొట్టుకొన సాగెను గత్యంతర మేమియు లేదు. ఉత్తర మొసగి

తీరవలెను. తుదకు చాలసేపు యోజించి యాతఁడు "అన్నయ్య కక్కడ నుద్యోగము దొరకినందువల్ల" ననెను.

"నిజముగ నన్ను దీసికొని వచ్చుటకే మీ యమ్మత్తయ్య యిచటకు బంపినారా?"

మరల వినాయకుడు పూర్వపదమునే స్మరణకు దెచ్చికొని 'ఆ' యనెను.

"ఎన్నిదినములకు మా యత్తగారికి నేను జ్ఞప్తికి వచ్చితిని! నా ర్థకమందా మీకు శుశ్రూష లొనర్చి యెప్పుడు ధన్యనగుదునాయని యువ్విళ్ళూరు చుంటిని ఇంతవఱకు నా మనోభీష్టము సిద్ధింపదయ్యెను. తెలియక నే నేదేని యా మెప్పట్టన మహాపరాధ మొనర్చియుందును అందువలన నాకీ దుర్భరశిక్ష సంభవించినది. కాని నేఁ జేసిన యపరాధ మేమో యెంత యోజించినను నాకు స్మరణకు రాదయ్యెను. అది యెట్టిదియో నుడువుడు. ఈదినమున నాచింత యెల్ల దూరమయ్యెను. సరి సరే కాని యింతవఱకు నత్తయ్య నన్నుందులకు బిలిపించినారు కారో, నాకు తెలుపరా?

వినాయకున కిప్పు డెక్కడలేని ధైర్యము వచ్చినది. అతఁ డిట్లనెను. "నీనగలు మరల చేయించుటకు తగినవీలు కానరానందున నిన్నక్కడకు బిలిపించుటకు మాయమ్మకు మొగము చెల్లినది కాదు."

నా కేమి యుపకార మొనర్చిరని మా యత్తయ్యకు మొగము చెల్లక పోవుటకు? ఆనగలు నాకిప్పు డవసరము లేదే! మా నాయనగా రప్పుడే నాకు వేఱు నగలు చేయించి యిచ్చిరి. నగలు నాకంత ప్రాణపదము లని భావించితిరా?"

"అయితే నీవు బయలుదేఱునపుడు ఆనగలు కూడ వెంటదీసికొని వచ్చెదవా యేమి?"

"ఇది యేమి! మీ ప్రశ్న బహుచమత్కారముగ నున్నదే! తీసికొనిపోవుట కెవరియాటంక మున్నది? ఈయాభరణములును మనవియే కదా! అవసరము వచ్చిన వీనిని కూడ నుపయోగించుకొనుట కెవరియాటంకమును లేదే!"

పత్నిభాషణము నాలకించి వినాయకుడు విస్మితుఁ డయ్యెను. చాల సేపటివఱకు నాతఁ డేమేమో చింతించుచుండెను. అనంతర మీ విచారముల నుండి విముక్తి గలుగఁజేసి సంపూర్ణవిశ్రాంతి నొసఁగుశక్తి యే దేవతకు గలదో యా దేవతను- చిలుమును- నొక్కసారి యనన్యభావమున శరణుజొచ్చు నుద్దేశ్యమున వినాయకరావు-శయ్యపై నుండి లేచెను. అంతవఱకును లక్ష్మి యాతనిపాదము లొత్తుచు గూర్చుండి యుండెను. పతిలేచునుద్దేశ మామె లక్ష్యమునకు రాగనే వినాయకునకు ముందు శ్రమ యేమియు గలుగనీయలేదు. భర్తయభిప్రాయ మామె యెఱిఁగిన దగుటచే, ముందే సర్వము సిద్ధపఱచి యుంచెను ఆమె తత్క్షణము లేచి, స్వహస్తమున చిలుము సిద్ధపఱచి నాధునిచేతి కందిచ్చెను. వినాయకున కెంతటివిస్మయానందములు కలిగినవి! ఆతని జన్మమున నింతవఱకు కిట్టిశుశ్రూష యెవ్వరైన జేసియుండిరా?"

౧౮

రాత్రికప్పుకొన్న కృష్ణవర్ణపుశాలువను దూరముగఁ బాఱవైచి పూర్వదిశాలలన శుభ్రపత్రపరిధాన మొనర్చెను. నిబిడవృక్షసంతతుల నడుమ నొకటిరెండు పక్షుల మంజులరవము చెవిఁబడు చుండెను. ఇంతవఱకును పికసంతతులు కులాయములనుండి వెలువడలేదు. మంద శీతవాయువు లల్లనల్లన వీతెంచుచుండెను. వీనిస్పర్శమున సర్వాంగములును సమ్మృతాభిషిక్త మగుచున్నవి. అంతఃకరణము ప్రసన్నోల్లసిత మగుచున్నది.

రమ్యమగు సుమకాలమున నానాదేశముఖు శయ్యపైనుండి లేచి శుచియై నిత్యనియమానుసారముగఁ బ్రాతఃస్మరణ మొనర్చుచు, హస్తమునఁ బూలబుట్ట బట్టికొని బయటి కరుదెంచెను.

అందమై గనుపట్టె వెన్నెల మందపవనుఁడు రాల్చె సుమములు
వందిమాగధు లట్లు వనద్విజ బృందములుకూడి
సుందరాంగా! రఘుకుమారా! శుభవిధాయక యనుచు, బిలచెడి
ఇందిరేశా, ఇనకులేంద్రా! ఇంక మేల్కొనవే
తరుణభానుని యుదయమున నా రజనితిమిరము గుహాలడాగెను
భృంగములు ఝుమ్మనుచు బాడెను వరద మేల్కొనవే
కమలములు వికసింపసాగెను కలువపూవులు ముడుఁగఁదొడఁగెను
కమలనయనాకనకచేలా! కరుణ మేల్కొనవే
వనజభవసురమునివరాదులు భవ్యతరమగు నీదు నామము
వినుతిసేయుచు నున్నవారలు వేగ మేల్కొనవే
అరుణుఁ డంతట నుదిత మగుటను కిరణహీనుం డయ్యె చంద్రుఁడు
మరలె దారల కాంతిపుంజము వరద మేల్కొనవే.

పై విధమున భూపాలరాగమునఁ బాడుచుఁ బూవులు గోయుచు నానా యరుణోదయమునఁ దోఁటలో నిత్యము దిరుగుచుండును. పరమేశ్వరునికృపవలన నాతనికడ ననేకపరిచారకు లుండినను నీపని నాతఁడే యొనర్చుచుండును. గృహమున కానుకొనియే రమణీయమగు పుష్పోద్యాన మొకటి గలదు. ఈకాలమునాటి కొందఱు శ్రీమంతుల విహారోద్యానములవలె నానాగారియుద్యానవనమధ్యమున విదేశీయ గంధవిహీన పుష్పవృక్షములును కేవలరమ్యవర్ణవంతములగు వృక్షవల్లరులు నేమాత్రము లేవు. కేవలదేవసేవోపయుక్తము లగు నానావిధసుగంధకుసుమవృక్షసంతతు లీయుద్యానమున నెల్లప్పుడు పరిపూర్ణముగ నుండును. నానా విహులు గోయుచు నలువంకల మంద గమనమున సంచరించుచుండఁ బ్రత్యూషశీతలపవనుఁడు తనసుఖస్పర్శచే నాతనికి సేవ యొనర్చుచుండెను. నత్సాంగత్యమహిమ

యిల్లే యుండును గదా! ప్రాతఃకాలవాతపోతములు శీతలములై కాక, నానావిధసుగంధపుష్పపరాగసంసర్గంబున నీ వేళ మనోహరపరిమళము వహించి, హృదయమునకు అవ్యాధమునసే దేహమునకును తుష్టియు బుష్టియు నొసంగుచుండును. అట్లగుట నానా యరుణోదయమునఁ బూలకై తానే వాడుకచొప్పున తోఁటలోని కరుదెంచును. దేవసేవయం దాతని కపారభక్తి కావున నిట్టిపవిత్రకార్యభారమును నాతఁడు భృత్యులపై బెట్టునా!

జాజి, విరజాజి, మల్లె, మొల్ల, గులాబి, కాంచన, పారిజాత, ప్రభృతి మనోహరపుష్పములను, కోమలబిల్వపత్రములను, తులసీదళములను కోసి బుట్ట నిండం గొని నానా యింటిలోని కరుదెంచును. తదనంతరము సాంసారిక కార్యముల జక్కబెట్టుకొని నాకిట నరుగుపైని బఱచినచాపమీఁద గూర్చుండెను. ఇంకను గ్రామమునఁ గలకొందఱుకులీనులును, మాన్యగృహస్థులును మెల్ల మెల్లగ వచ్చోట జేరిరి. ప్రతిదినమును సాధారణముగ నీవేళకే వీరందఱును గలసికొనుచుందురు. వీరందఱచ్చోట వార్తాసమాచారముల తోను ధూమపానతాంబూలచర్వణములతోను కాలము వ్యర్థపుచ్చక నానాగారు గ్రామవాసుల చిల్లరతగాయిదాలు విచారణము సల్పి న్యాయము చెప్పుచుందురు. గ్రామమునందలి సంఘశాసనభారము గూడ నాతనిశిరముపైఁ బడి యుండెను. గ్రామస్థులకు నానాగారనిన భయభక్తులు మెండు. వీనికిఁ గారణ మాతని పాండిత్యము, ఆదరము, దైవభక్తి, నిస్వార్థన్యాయపరాయణత్వము, దేవదుర్లభచరిత్రము. కేవలైశ్వర్యసామర్థ్యము వలన మానవున కింతటియౌన్నత్యము సంభవింప నేరదుగదా!

నానాగారియీపంచాయతీసభావిచారణము నెవ్వరును నిరసించుట లేదు. కారణమేమన నందఱికి నభపై సంపూర్ణభక్తివిశ్వాసములు

కలవు. అనర్థదాయకము లగుకోర్టుగడప తొక్కి సర్వనాశన మొనర్చు
కొనునదృష్ట మాపురవాసులకు నేవ్యక్తి కొసటను వ్రాసియుం
డలేదు. ఈ పంచాయితీసభతీర్పు వలన వాదిప్రతివాదుల కిరువురకును
సంతుష్టి కలుగుచుండెను. రాజశాసనముక్రిందికి వచ్చియుండని,
కొన్ని సాంఘికాపరాధములు కూడ నిచట చక్కగ విచారింపబడు
చుండును. కొందఱకొందఱు సామాజిక, ధర్మసంబంధనియమో
ల్లంఘన మొనర్చినచో వారివారియపరాధమునకు దగినట్లు వారి
యిండ్లకు చాకలి మంగలి రాకుండునట్లును, మంగళి త్యాగమునకుం
బోకుండునట్లును, ధూమపానము మొదలగునవి వర్జింపజేసియు
యథాయోగ్య మనుశాసనము చేయుచుండెను. తిట్లు, దెబ్బలాట
మొదలగు కేసులవలన వచ్చుదండనాద్రవ్య మాయూర గల గ్రుడ్డి
కుంటి మూగ అనాథ దరిద్రుల సహాయమున కై వినియోగింపబడు
చుండెను. ఆగ్రామమున నారాయణరావంటి యోగ్యుండు మఱియొకడు
లేడు. అట్లు గానిచో గ్రామమునం గల వారెల్లరు తనపైనింతగ
భక్తిశ్రద్ధలు గలిగి యుండరని తోఁచెడియు గ్రామములోని మఱి
కొందఱుశిష్టజనులసహాయమును లేకుండగ తా నొంటరిగనే కార్యముల
నిర్వహింపఁ గలిగి యుండియు, అతనివలన నెప్పుడు నట్టిపొరపాటు
జరిగి జనాపవాదమునకు లోనుగా లేదు. అతఁడేవిషయము
నైనను నలుగురైదుగురుబుద్ధిమంతుల సలహాను దీసికొనకుండ విచా
రించువాఁడు కాఁడు. ఈపంచాయితీసభకు వచ్చిన వ్యాజ్యములు పరి
ష్కరించుట కుదయము సుమారు పదిగంటలవఱకు నానా కూర్చుండి
యుండును. తదనంతరము స్నానసంధ్యాది దేవపూజాద్యాహ్నిక
కర్మలయందాతఁడభియుక్తుఁడగును దేవపూజ సాంత మగునప్ప
టికి రెండుజాములు గడిగిపోవును. పూజ యగుటతోడనే యతఁడు
మరల బయట కరుదెంచును. అచ్చోట నిద్దఱుముగ్గు రతిథులు

కూర్చుండి యుందురు. మహానందమున ముందు వారిని భుజింపఁజేసి యనంతరమున నానాఅన్నగ్రహణ మొనర్చును. భోజన మగునరికి పదిగ మూఁడుజాములగును. అతనిభోజనమునకు సాధారణముగా ప్రతిదిన మివ్వీక్షణమునసే యాలస్యమగు చుండును. కారణ మేమన అతిథ్యభ్యాగతులకై నిరీక్షించి గాని యాతఁడన్నస్పర్శ మొనర్పఁడు.

భోజనానంతము రెండు గడియలు నిద్రించి నాలుగు గంటలుసుమారున కాతఁడు బయటయరుగుమీఁదకు వచ్చి శ్రీమద్భాగవతపఠన మొనర్చుచుండును. నానా వెలువలకు వచ్చుటకు బూర్వమే చాలమంది శ్రోత లరుగుపై కూడి యుందురు. కారణ మే మన ప్రతి దినము నానసమయమున నట పురాణకాలక్షేపము జరుగు చుండును. ప్రతిశ్లోకార్థమును మిగులస్పష్ట మొనర్చి యాతడు వారలకు తెలియ బలుకు చుండును. శ్రోతలధారణశక్తిని బట్టి శ్లోకములవ్యాఖ్యానమును నానాప్రకారము లగు చుండును. ఆయన స్పష్టీకరణమువలన శ్రోతలు మాయామయమును క్షణభంగురమును నగుసంసారము నుండి విముక్తులై చిత్తవృత్తులు పరమేశ్వరుని యందు మగ్నము చేయుచుందురు. వార లాక్షణమున బ్రహ్మానందమున నోలలాడు చుందురు.

తరువాత కొంతమంది పండితులతో నానావిధశాస్త్రచర్చలు జరుగు చుండును. అట్టియెడ శాస్త్రరహస్యములు శ్రోత లెల్లరకు తేట తెల్లముగఁ దెలియవచ్చు చుండును. నానా అప్పడప్పుడు తనద్రవ్యము వెచ్చించి దూర దేశములనుండి విద్వాంసులను బిలిపించి, వారివలన శాస్త్రీయసందేహముల నివృత్తించికొని వారిని సత్కరించు చుండును. నేటిదినమున నట్టిపండితు లెవ్వరును వచ్చి యుండనందున స్వయముగ శ్రీమద్భాగవతపఠన మొనర్చెను. ఇట్లు జరుగుచుండగనే సంధ్యాకాల మయ్యెను.

మరల కరపాదప్రక్షాళన మొనర్చుకొని నానా దేవతార్చనగృహమున కరిగి, సంధ్యాదిజపానుష్ఠానములయందు మగ్నుఁడయ్యెను. నిత్యకర్మ లెల్ల యథావిధిగ నొనర్చి, భగవత్ప్రసాదమును స్వీకరించి యాతఁడు తద్గృహమునకు జనియెను. అచట వృద్ధురా లగునన్నపూర్ణ ఫలహారము సిద్ధపరచి భర్త రాకకై యెదురుచూచుచుండెను. ఆయన లోని కరుదెంచి ఫలహార మొనర్చుచు గూర్చుండి యుండెను. కొంతవడి కన్నపూర్ణ యిట్లనియెను. "వింటిరా? మనయల్లుఁడు లక్ష్మిని దీసికొనిబోవుటకై వచ్చినాఁడట."

"సంతోషము! మంచిముహూర్తముఁ జూచి సర్వము సిద్ధపఱచెదను."

కాని యన్నపూర్ణ నేత్రము లశ్రుపూరితము లయ్యెను. ఆమె కన్నులు దుడిచికొనుచు నిట్లనియెను. "మనముద్దుబిడ్డ యత్తవారింటి కరుగుట సంతోషవిషయ మగుట నిశ్చయమే కాని, అల్లునిసంగతి మన మెఱిగినదే. సంసార మంతకంటె నధోగతి! ఇట్టిస్థితిలో పిల్లనట కంపుటకు నామన సెట్లొప్పును!"

"అమ్మాయి యత్తవారింటికి వెళ్ళుటకు మన సొప్పనియెడల నీవుకూడ నామెవెంట నల్లునింటికి వెళ్ళుము. తృప్తికరముగ లేదని పిల్లదానిసుఖమునకు వ్యత్యయము గలిగించుట యోగ్యము కాదు. పతిసేవవినా స్త్రీలకు మఱియొకధర్మ మేమిగలదు."

పాప మామె మఱి మాటలాడ లేదు. ఆమె చాలసేపటివఱకుఁ గన్నులఁదుడుచుకొను చుండెను. కాని యుపయోగ మేమియు లేదయ్యెను. ఫలహార మగుటతోడనే యతఁడు పంచాంగము చేబూని కొమారితె నత్తవారింటి కనుపుటకు శుభదిన మరయుచుఁ గూర్చుండి యుండెను. అన్నపూర్ణ దుఃఖాతిశయమున బిగ్గరగ నేడువఁ దొడఁగెను. భార్యను సమాధానవాక్యములతో నూఱార్చి యాతఁడన

యీవలకు వచ్చెను. అన్నపూర్ణ విషణ్ణవదనయై యచ్చటనే నేల పైఁబడి నిద్రించెను.

బయటకు రాగానే సుశీలయు లక్ష్మియు నానాగారిదృష్టిపథమున బడిరి. వెంటనే లక్ష్మి నుద్దేశించి యాతఁ డిట్లనెను. "అమ్మా! నిన్ను దీసికొనిబోవుట కై నీ భర్త వచ్చినాఁడు. రాఁబోవుబుధవారము నాటిదెల్లవారుజామున గర్గాచార్యుని శుభముహూర్తమున నిన్నత్త వారింటి కనుప నమకట్టియుంటిని. ఆదినమున నీవు నీయింటి కరుగ వలసి యుండును. తల్లీ! నేఁజెప్పఁబోవువిషయమును నీవు మనసున నుంచుకొనుము. భర్త మూర్ఖుఁడైనను, కురూపి యైనను, దరిద్రుఁడైనను, మఱి యెట్టివాఁడైనను, సరియె సతికి పతిసేవగాక వేఱొండుగతి లేదు. సతులకు పతియే ప్రత్యక్షదైవము. బిడ్డా! నేను నీకు మిగులవినయపూర్వకముగఁ జెప్పుచుంటిని. అచటి కేగినపిదప నీవు మనఃపూర్వకముగ భర్తయొక్కయు, మఱియు నవ్విధముననే నత్త మొదలగుపెద్దలయొక్కయు సేవలొనర్చి వారొసఁగుమంగళాశీర్వాదము లందినచో నద్దాన నీకు సకలశుభము లొనఁగూడును."

ఇంతలో నాక్షణదీపప్రకాశమున హతభాగినియగు సుశీలయొక్క యశ్రుపూర్ణముఖముపై యాతని యంతఃకరణము చింతాక్రాంత మయ్యెను. అనాథయెదుట బతిసేవామహాత్మ్యమును గీర్తించుట యుచితము కాదని యిప్పుడాతనికిఁ దోఁచెను. వైధవ్యపంకమున మునిఁగియున్న బాలను సంబోధించి యాతండిట్లనెను.

"బిడ్డా! ఏల నీ విట్లు ఖిన్న వదన వయ్యెదవు! అమ్మా! యిటు చూడుము. వనమున ననేకపుష్పములు పుష్పించుచుండును. కాని వాని కన్నిటికిని దేవసేవాభాగ్య మెట్లుగల్గును? మందిరసుగంధిలము లగుననేకకుసుమములు విలాసినీమణుల యుపయోగవస్తువులై యుండును. కాని వానిలో నేదోయొకపుష్పమూమాత్రము తన యతి

కయు సౌభాగ్యమువలనను, అనుపమపుణ్యఫలమువలనను, దేవునిశిర మున పైఁ బ్రకాశించు చుండును. కావున తల్లీ! నీ వేల దుఃఖించె దవు? నిజముగ నీవే భాగ్యవతివి. దేవసేవయొనర్చి దేహసార్థక్య మొనర్చుకొనుటకే పరమేశ్వరుఁడు నిన్ను నిర్మాణ మొనర్చెను. క్షణభంగురము లగుసుఖములకై నీవు మనసునెందులకు చలింపఁ జేసెదవు?"

సుశీలయు, లక్ష్మియు నవనతవదనలై యున్నకుండిరి. నానా చవ్వున నటనుండి బయటికి లేచి కన్నులు తుడిచికొని యెను.

## ౨౦

ఈదినము మంగళవారము. తెల్లవారుజామున లక్ష్మి నత్తవారింటి కనుపవెంచుటచే నానా గృహమూదిమము మిగులనందడిగ నుండెను. బియ్యము, పప్పు, ఉప్పు, నేయి, నూనె, పసుపు, కుంకుమ, చింత పండు, మిరపగాయలు మొదలగునంసారోపయోగము లగునసేకవస్తు వులును, కప్పుకొనుశాలువలు, చీరలు, రవికలు, ధోవతులు, నత్తరీ యములు మొదలుగాగల యితరవస్తువులును దీసికొని తెచ్చి యింటఁ బెట్టిరి. తప్పేలా గుండిగ, గిన్నె మొదలగు పాత్రసామానులు కూడ దీసికొని వచ్చుచుండిరి. లక్ష్మి యత్తవారిస్థితిగతులు నెఱింగిన వాఁడగుటచే నామె నత్తింటి కనువునమయమున నానావిధమైన ద్రవ్యము వెచ్చించెను? దానాహుబహుమానములవలనకు నే సామగ్రియు కొనవలసినదయు లేకుండ ప్రతిపదార్థమును సమృద్ధిగ స్థిరపఱచెను. ఇరుగుపొరుగువారీవస్తుసముదాయ మవలోకించి మిగులనచ్చెరు వంది కూతుంద్ర నత్తింటి కనువునమయమున నామెతో నేదోకొంత వంపుచెల్లరకు నహజమే కాని, యిటులింతవఱ కెవ్వరును నింతటి విశేషముగ నొనఁగుట కామెచ్చటను జూచి యుండ లే దనుకొనిరి. పావ మన్నపూర్ణ యొక్కటేవిధమున శోకించు చుండెను. తన

పుత్రికతోఁ బంపుటకు సిద్ధపఱచి యుంచినయావస్త్రసముదాయము జూచినంత నామెకుఁగూడ కొంచెముమనశ్శాంతి కలిగెను. ఆగ్రామమున స్త్రీలెల్లరు నీదినము లక్ష్మిని జూచిపోవుటకై యొక్కరొక్కరుగా వచ్చు చుండిరి. తల్లిదండ్రులు తన కొనంగువస్తువులనామె మిగులప్రేమతోను, ఆదరముతోను నెల్లరకును జూపించు చుండెను. ఆసామగ్రులను గాంచి యాస్త్రీ లెల్లరాశ్చర్యచకిత లగు చుండిరి. గ్రామ మాబాలవృద్ధముగా లక్ష్మిని మిగులఁ బ్రేమించు చుండిరి. "దయయుంచుడు. నన్ను మరువకుఁ" డని మృదుమధురవాక్కులతో లక్ష్మి యెల్లరికడను సెలవుగైకొను చుండెను. నేఁడామె హృదయమున హర్ష విషాదములు రెండును ముప్పిరి గొనుచుండెను. ప్రాణనాథునివెంట సేవయొనర్పుటకై యరుగుచుండెను. అట్లగుట నామెకింతకంటె సంతోషదిన మొండెద్ది? కాని తలిదండ్రులను, ఆత్మీయులను, ఇష్టసఖులను, ఇరుగుపొరుగువారలను విడిచి నేను పతిగృహమున కరుగుటకై వారిసెలవు గైకొనునపు డామె యత్యంత వ్యథిత యగుచుండెను. పిన్ననాఁటనుండియుఁ దన్నుఁ బ్రేమించువారితో గలసిమెలసి పెరిగి యిప్పుడు వీడి పోవలసివచ్చినందున లక్ష్మి కోమలాంతఃకరణమెట్లు దుఃఖభాజనము గాకుండును?

నేఁడు లక్ష్మి ప్రయాణసంరంభ మేమని చెప్పవచ్చును! సమస్త సామగ్రు లీవలఁ బెట్టు చుండిరి. కొందరావస్తువు లెట్లుబంపిన సురక్షితముగ చేరునో యనివిచారించి బండివాండ్రచే నాపదార్థములు చక్కగ బందోబస్తు చేయించుచుండిరి. బాలకృష్ణుని మహదానందమునకు పారమే లేదు. వానిజన్మలో నిట్టివస్తుచయమును పావము వాఁ డెక్కడ నెన్నడును జూచినదే లేదు. అందు విశేషముగ నన్న పానోచితవస్తుసామగ్రు లధికముగ నుండుటఁ జూచి వినాయకుని వెంట నాతనియింటి కరుగుటకు తానుగూడ ప్రయాణ మయ్యెను.

సంధ్యాకాలమునకు నాలు గెద్దులబండ్ల దెప్పించి యా సామానుల వాని పై నెక్కింప మొదలిడిరి. ప్రభాత్ను పూర్వకముగ సమస్త సామాగ్రి లును శకటములపై చక్కగ సమర్పువిషయమున బాలకృష్ణుఁడు బండివారలపై నధికారము జూపుచు మిగులగడబిడ చేయుచుండెను. సామానులెల్ల వానిగృహమునకే గొంపోవుచున్న ట్లున్నది! జాము రాత్రి యగునప్పటికి సామానుబండ్లు ముందుబయలు దేఱెను. ఆశక టముల వెంట నరుగుటకు బాలకృష్ణవంతులు తయా రయ్యెను. కాని నానా విశ్వాసపాత్రుఁ డగుతననౌకరునొక్కని నాబండ్లవెంబడి బం పుటచే బాలకృష్ణుఁడు బోవలసినయగత్య మేమియు లే దయ్యెను. ఆరాత్రి బాలకృష్ణుఁడు నిద్రయన నెట్టిదో యెఱుఁగఁడు. ఎప్పుడు తెల్లవాఱును, ఎప్పుడు బయలుదేఱుదునని వాఁడు సెజ్జపై నిటునటు దొరలు చుండెను. తెల్లవారుజా మగునప్పటి కొక్కగుఱ్ఱపుబండి వచ్చి వాకిట నిలిచెను. బండిచక్రములు కట, కట శబ్దము చెవి బడిన క్షణమున శయ్యనుండి గుభాలున లేచి బాలకృష్ణుఁడు బయటి కరు దెంచెను.

అన్నపూర్ణ వెక్కివెక్కి యేడ్చుచుండ నానా యనేకవిధముల హితోపదేశములు లొనర్చి యూరడింపుచు నితరాత్మీయుల వారిం పుచుఁ జామాతను, తన బండియందు గూర్చుండబెట్టెను. లక్ష్మి సజలనయనయై జననీజనకులయొక్కయు నితరవృద్ధులయొక్కయుఁ బాదములపై శిరము మోపి, అనుజ్ఞ వడసి, ఆశీర్వాదము లందికొని యెను, వినాయకరావుగూడ వారలకు నమస్కార మొనర్చుట మఱచిపో లేదు. సంతోషభరమున బాలకృష్ణుఁడుమాత్ర మిది మొత లంట మఱచిపోయెను. ఎవరును జెప్పకుండగనే వాఁడు చెంగున నె గిరి బండిముందటిభాగమున బండివానిప్రక్క విరాజమానుఁడై మిగులసంతసమున నెడమచేత నశ్వరజ్జువుల గ్రహించి కుడిచేత మిగుల

తీవిగ కొరడా బట్టుకొని స్వయముగ బండి తోలవలయు నని వాఁడెంతయో ముచ్చటపడుచుండెను. ఇంతలో బండివాఁడు స్వస్థానమున కరుదెంచి బాలకృష్ణుని చేతనుండిన తాళ్ళు లాగికొని కొరడా కర్రతో గుఱ్ఱము నదలించెను. వెంటనే శకటమునడచి పోవుచుండెను. లక్ష్మీవద్ద సెలవు దీసికొనుట కట జేరినవారు బండి వైపునకు చూడ్కులు నిగిడించి విషణ్ణవదనులై యచట నిలుచుండి యుండిరి. కొంతవడికి శకట మంతర్ధాన మయ్యెను.

## ౨౧

త్రోవలో విశేష మేమియు సంభవింప లేదు. శకటసారథ్యము సంపాదించుటకొఱకు బాలకృష్ణుఁడుమాత్రము త్రోవపొడుగునను ఉమేదవారీ చేయుచునే యుండెను. తుదకు శకటము వినాయకునిగ్రామ సమీపమునకు వచ్చినంత బండివాఁడు బాలకృష్ణుని వేడికోలున కంగీకరించి, అశ్వరజ్జువుల వానిచేతి కిచ్చెను. మహోల్లాసపూర్వకంబుగ రజ్జువుల గైకొని, మిగులరీవితో కొరడా త్రిప్పుచు బాలకృష్ణుఁడు శకటము నడుప సాగెను. చాలనేపటినుండి వాఁడు శకటసారథ్యకౌశలమును లక్ష్యపూర్వకముగ నవలోకించుట నావని వాని కేమియు దుస్సాధ్యముగ లే దయ్యెను. వాఁడు బండివానికన్న నత్యధికగతిని నశ్వముల నడిపించు చుండెను.

శకటము రాజమార్గమును విడచి వినాయకునిగ్రామమున కేగు బాటవెంబడి పోనిచ్చెను. ఈయిరుకయినకొండలనడిమిత్రోవను నవీన సారథి యగు బాలకృష్ణుని బండి తోలనిచ్చు టుచితము కాదని బండివాఁడు కళ్లెము తనచేత గైకొనియెను. అప్పుడుకూడ కొరడా బాలకృష్ణునిచేతియందే యుండెను. నడుమ, నడుమ సకారణముగను, నకారణముగను కొరడాఝుళిపించుచు బాలకృష్ణుఁ డశ్వములపై తన ప్రభుత్వము నెఱపు చుండెను. ఇదచ్చట వా రెద్దుబండ్ల నాల్గింటిని

కలిసికొనిరి. అన్నిటికిని ముందు గుఱ్ఱపుబండియు, వెనుక నెద్దుబండ్లును మెల్ల మెల్లగ వినాయకునియూరు ప్రవేశించెను. ఊరిలోని బాలుర తమయాటలు మాని యాశకటములను వెంబడించిరి. కేవలము బాలురసంగతియేమందులకు? ఒకగుఱ్ఱపుబండియు, వెనుక నాలుగెద్దుబండ్లును వానిపై సామగ్రులును, ఆచిన్నయూర ప్రవేశింపగనే యాగ్రామమున మిగులగడబిడ బయలుదేఱెను వినాయకుఁడు భార్యను పుట్టినింటనుండి దీసికొని వచ్చుచుండె ననువార్త యూరెల్ల వ్యాపించెను. గుఱ్ఱపుబండి గ్రామమున ప్రవేశించుటకు సరియైనకారణ మిప్పుడందరికిని దెలియవచ్చెను. అప్పుడుకూడ సామానుబండ్లను గాంచి యివి యెందులకా యని వారు విస్మయము నొందక పోలేదు. ఆవిషయ మాగ్రామమునలుగడల శబ్దమాత్రమునో మఱియు లేదు. ఆశకటపంచకమును గాంచినవా రందఱు విస్ఫారితనేత్రములతో నొకరినొక రవలోకించుచు వానివెంట వినాయకునిగృహము సమీపించిరి. నేఁడు రాధ యానందమున కవధియే లేదు. వెఱ్ఱిదానివలె నాముదుసలి బయటికి పరుగెత్తికొని వచ్చి, కోడలిని బండినుండి దింపి, మహాదరమున ప్రేమ దొలుకాడ నామె నింటిలోనికి దోడ్కొని పోయెను ఇంటి కెదురుగ నానాల్గుసామానుబండ్లు వచ్చి నిలువబడెను. ఇంతదనుక నామెదృష్టి యావంక కరుగనే లేదు వాకిట గూడిన యిరుగుపొరుగుస్త్రీ లెల్లరు రాధవెనువెంటనే గుంపులుగుంపులుగ గృహప్రవేశ మొనర్చిరి. వినాయకుఁడు మామగా రొసగిన విలువవలువలపెట్టుచు పరిచారకునిచే మోయించుకొని గృహమునఁ బ్రవేశించెను. అందఱు నిలు జొచ్చినంత బండ్లలోనిసామగ్రిని బదిలముగ వడివడి దింపి, చెదరకుండ నొక్క చో బెట్టు డని బాలకృష్ణపంతులు బండివాండ్రపై తనయధికారము జూపుచు కేకలిడుచుండెను. బండ్లలో గలవస్తుసముదాయమును గాంచి మిగులవింతపడి

తదేకదృష్టిని బరికించుచు నచట నిలుచుండి యున్నవా రందఱు బాలకృష్ణు నొంటరిగ జూచి మిగులనుత్సాహమున వాని నెన్నియో తెన్నుల బ్రశ్నింపసాగిరి. బాలకృష్ణుడు గంభీరస్వనముతో "ఏమయ్యా యట్లడిగెదరు? ఇదియంతయు మాదే!" యనెను.

బాలకృష్ణుని యీవిచిత్రప్రత్యుత్తర మాలకించి యట నిలిచియున్నవారిలో నొకగృహస్థు యిట్లనియెను. "ఇదియంతయు నీదే! నీదియైనచో నిక్కడ కెందులకు? నీయింటి కెందులకు తీసికొనిపోలేదు?"

"ఓహో! ఇది నాయిల్లు కాదా?

"ఏమి! ఇది నీయిల్లా! అదెట్లు?"

"ఏమయ్యా! అట్లు మాట్లాడెదవు? నేనిప్పుడా వినాయకరావు గారిభృత్యుడను. అట్లగుట నీయిల్లు నాది కాదా?"

"ఇక్కడేదైన దుకాణముగి కాణముపెట్టుట కాలోచించితి రని తలంచెదను."

బాలకృష్ణునకు మిగులరోషము వచ్చెను. వాడు కోపావేశమున నిట్లనెను. "తిరుగ నే నంగడిపై చాకిరీ చేయుదు ననుకుంటిరా? ఏమి మీబుద్ధిజాడ్యము? వాగవాగ! ఈసామగ్రి నంతయు మాయన్న మామగారు మావదెనకు సారెగా నిచ్చి పంపిరి. ఇప్పుడైన దెలసినదా లేదా?"

"ఏమీ!"

ప్రశ్నించినగృహస్థు ఏమి, మాత్రమని మిన్నకుండెను. మఱియొకమాట వానినోట రాదయ్యెను. అతడు నోట వ్రేలుబోనిపికొని తెల్లబోయి చూచుచు గూర్చుండెను అట గలతక్కినవారందఱుకూడ నదేయవస్థయందుండిరి. బాలకృష్ణుఁ డానల్వురుబండివాండ్రచేతను సామగ్రిని లోనికి బంపి, అటనున్న వారిలో నేనైన నేదేని దొంగిలింతు రేమో యనికాబోలు తానుబయట వహాకాయుచు

చుండెను. మెల్లమెల్లగ సర్వసామగ్రియు లోనికి జేరినపిదప బాల కృష్ణుడుకూడ లోనికేగెను. అంతటివస్తుసముదాయమును జూచి రాధకూడ చకిత యయ్యెను. కోడలితో రాసులురాసులుగ నంత సామగ్రి వచ్చి పడుట యవలోకించినంత నావృద్ధురాలి యానందము మిన్ను ముట్టెను. ఆనందాశ్రువులతో నేత్రద్వయము నిండిపోయెను. అచటగూడినస్త్రీలకు ముందై యామె యుచ్చైస్స్వరమున నిట్లనెను. "అమ్మలారా! ఈదినమువచ్చినది నాకోడలు కాదు— సాక్షాత్తుగా లక్ష్మియే!"

గృహమున గలరెండుమూడుగదులు సామానులతో నిండిపోయెను. ఆగంతులకు నిలుచుటకైన స్థలము లేదు. బాలకృష్ణుడు లోని కరుదెంచి చూచునప్పటికి సామానంతయు చావడిలో నస్తవ్యస్త ముగ బడియుండెను. వానినెత్తి వాడు చక్కగ సమర్చుచుండెను. కోడలు సారెగా వచ్చినచలిమిడి, కొబ్బరి, పసుపు కుంకుమము నిరుగుపొరుగువారలకు పంచిపెట్టుటకై రాధ మిగులతొందరపడుచు స్వయముగ నాపని నెఱవేర్చుచుండెను. తనకు సహాయార్థము బాల కృష్ణునిగూడ బిలిచెను. కాని యట్టిరుచ్యము లగుమధురపదార్థములు చేతిమీదుగ నందరకుం బంచిపెట్టుటకు వానికి మనసెట్లొప్పును! వాం డందుల కిచ్చగింపడయ్యెను. కాని రాధయుత్సాహ మీదినమున నపూర్వముగ నున్నదే! ఆమె తలయెత్తి బాలకృష్ణునివంక చూచినమాత్రముననే వాం డామెకు తోడ్పడెను.

ఆగంతుకస్త్రీపురుషులెల్లరు ఆహాహా యను మెఱమెచ్చులతో దీక్షితుని గృహము ధ్వనింపజేసిరి. ఏగడియయం దెట్టిస్థిత్యంతరము కలుగునో యది చెప్పుటకు సాధ్యము కాదు. గడచిన మూడేండ్లలో బంధుగులు బ్రాహ్మణభిక్షుకాదులు నితరులునాయింటివంక కన్నెత్తియైనను జూడలేదు. వారే యీదినము, 'రాధమ్మపిన్ని' రాధమ్మ

పిన్నియని కలువుగోలుతనమున నిచ్చకము లాడసాగిరి. క్షణము లోపల నాచిన్నయార పెద్దసందడి బయలుదేరెను. తరుణవృద్ధ బాలికాబాలకులకోలాహలధ్వనులతో వినాయకుని యిల్లెగిరిపోవు చుండెను. లక్ష్మియొక్కయు, నాతల్లిదండ్రులయొక్కయు ప్రశంసలతో భూమ్యంతరాళము నిండిపోవు చుండెను. ఎవరినోటనుండియు మఱియొకవిషయము వినవచ్చుట లేదు కాని యిరుగుపొరుగువార లెవరేనితమయానందమును గనపఱచు చున్ననుఁ దానిలో శతాంశ మైనను వారియంతర్యామి యదార్థ మని యొప్పుకొనజాలదు. అనే కులహృదయ మీర్ష్యానలముచే దగ్ధ మగు చుండెను. కలహకలా విశారద యగుమాళసాబాయి సక్కుబాయి మొదలగుకలహప్రియ లనేకసతులశరీర మారాత్రి మంటలెత్తిపోవు చుండెను. పాపము వారికి నిద్రకూడ పట్ట లేదు.

౨౨

ఆరాత్రి అనేకు లెటు లీర్ష్యానలముచే దగ్ధులై జాగర మొనర్చిరో యటులే యానందాతిశయమున సదాశివునితల్లియుఁ గనులుమూయ లేదు; రేయియంతయు మంచముపై నటునిటు దొర్లుచునే యుండెను. తెల్లవారుచుండగాఁ గొంచెము కూర్కు వచ్చినమాట నిజమే కాని యదియు సుఖస్వప్నపరిపూర్ణము. అరుణోదయముననే లేచి రాధ గృహకృత్యములు నిర్వర్తింపఁ బ్రారంభించెను. కాని ఆముసలి కసవూడ్చి, కలాపుచల్లుచుండగనే లక్ష్మి లేచివచ్చి యావృద్ధురాలి హస్తమున గలబిందెను దీసికొనియెను. అంత రాధ "తల్లీ! నేను నిన్నేమియుఁ బనిచేయనీయ" ననెను.

"మఱి నన్నెందులకిటకుఁ బిలిపించితిరి?"

"నేను మాయమ్మ నిటకుఁ దీసికొనివచ్చినది గృహకృత్యములు నిర్వర్తించుటకుఁ గాదు. నీవు నాగృహలక్ష్మి వని పిలిపించితిని. అమ్మా, ఈమాత్రపుపని నావలన నెఱవేఱక పోవునా!"

"అత్తయ్యా! మీరిట్లనెల్లురా? మీపాదసేవ సేయు భాగ్యము నాకు దొరుకు ననునాశచేగదా నేనిటకు వచ్చితిని. నేను కూర్చుండి యీయింటిపనియంతయు మీచేఁ జేయింపనా!"

ఇప్పటికి నావృద్ధురాలి యభ్యాసము పోలేదు. కోడలి వినయభాషణముచేతగూడ రాధ నేత్రద్వయము నిండిపోయెను. కాని యవి యానందాశ్రువులు. కన్నులుదుడిచికొని రాధ యిట్లనెను. "నాకష్ట మునకు వగచి మెవ్వరేని రెండుకనికరపుమాటలు పలికిన నంతియే చాలును. నే నిట్టినంసారములు పదిహేను నొక్కచేతిమీద నిర్వర్తింపఁ గలను. నేనేమి పనికివెఱచుదాననా! ఆడువుట్టుకఁబుట్టి పనికి జంకిన నెట్లు?"

"నే నిటనుండ మీరే యీపనినంతయుఁ జేయుట భావ్యమని మీకుఁ దోఁచెనా? మీరిఁక గూర్చుండి యేవి యెట్లొనర్పవలెనో నాకానతిండు. ఈదినమునుండియు మీకు గల గృహకృత్యనిర్వహణోత్సాహము సంక్షేపించి విశ్రాంతి గొనుడు.

చిన్నకోడ లెంతయో ప్రార్థించి యత్తగారిచేతిలోని బిందెను, చీపురును దీసికొన నాలుగైదుమారులు బ్రయత్నించెను. గాని యెంత బతిమాలికొన్న నావృద్ధురాలు వినదయ్యెను. తుద కుపాయమే మియు లేక చిన్నకోడ లామెకు సహాయముచేయఁ జొచ్చెను. ఆవశ్యక మగునిత్యకృత్యములు సాంతమయినంత నే లక్ష్మి గృహమున నచ్చటచ్చట శిథిలములయిన భాగములు బాగు చేయఁ బొచ్చెను. పుట్టినింటినుండి వచ్చిన బాలకృష్ణుని సహాయముగఁ గొని యామె యింటిలోని కసవు మొదలగువానిని దీసివైచి నేల మిట్టపల్లములు లేకుండ సమముచేసెను. గోడలలోని రావి మొక్కలు, జువ్వి మొక్కలు, గరిక మొదలగువానిని దీసిపై చెను. ఇదియంతయు సాంతమగు నప్పటికి రెండుజాములు తిరిగిపోయెను. కోడలియొక్క శ్రమగాంచి

సంత నావృద్ధురాలి హృదయాంతఃకరణము క్షోభమందెను. కాని యింతటియల్పావకాశమున జరిగిన గృహపరివర్తనముఁజూచినమీఁద నామె కపారానందము కలిగెను. ఆకుగ్రామమున వివాహాదిశుభ కార్యముల కేప్రకారము గృహముల నలంకరింతురో నంతకన్న నినుమడిగ దీక్షితుని గృహమున నేఁడు నిత్యకళ్యాణము పచ్చతోరణముగ గనుపించు చుండెను.

భోజనానంతరము గూడ లక్ష్మి యొక్క నిమునమైనను విశ్రాంతి గొనలేదు. తయునగృహము సుసజ్జితము చేయ మొదలిడెను. ఏవస్తువు లెచ్చట నుండవలయునో యెచ్చటనుంచిన శోభించునో యాయావస్తువుల వానివాని యోగ్యస్థలములం దుంచెను. శయ్య మొదలగునవి నూతనశోభ దాల్చెను. ఇవ్విధముననే యొకదాని తరువాత నొకటిగ నాయింట గలపడకగదులు మూఁడును పరిశుభ్రపఱచి వానిలో వస్తువుల తగువోట్ల నునిచెను. దీక్షితుని గృహస్థితి పూర్వమత్యంతశోచనీయమైయుండెను. లక్ష్మిదినమింటకాలు పెట్టిననాడె మరల క్రమమైనస్థితికి వచ్చెను. తనజనకుఁడొసఁగిన ద్రవ్యమున గొంతభాగమీపనులు జక్కబెట్టుటకై యామెవినియోగించెను. ముందరిచావడికూడ వచ్చిపోవువారు కూర్చుండుట కనువగు రూపమును దాల్చెను. లక్ష్మి యట కరుదెంచిన వారముదినములతరువాత నొకనాఁ డాదీక్షితుని గృహబాహ్యాభ్యంతరరూపములను జూచి యాయిల్లెవరిదో వెంటనే గుర్తించుట కొకానొక గృహస్థునకు దుస్సాధ్యమయ్యెను.

ఇచ్చట వినాయకుని స్థితి యెట్లుండెనో కొంచెము పరికింపవలెను. భార్య వచ్చినప్పటినుండియు నిల్లంతయుఁ బరిశుభ్రమయ్యెను. వంటయిల్లుకూడ మిక్కిలి నారోగ్యనిలయమై యుండెన. అవసర మగునవుడు పావలో అర్ధో భార్యవలనఁ జేతపడుచుండెను. ఇది యిట్లుండ

పరిచారికవలె నాతె పతి సేవాతత్పరయై యుండెను. ఇదివర కితఁడు భార్య చెంత కరుగుటకు భయపడుచుండువాఁడు. క్రమక్రమముగ నిప్పు డాభయము పూర్తు మగుచుండెను. ఇంతియే కాదు. తనయర్థాంగి తో సేవిష కుమునై నగూర్చి ముచ్చటించుటయు, యుక్తి యుక్తమగు నాతె మాలోచన దీసికొని సంకోచన పూర్తిచేసికొనుటయు గూడ సంభవించుచుండెను ఇవ్విధమున వినాయకుని మనసున గలపత్నీ సంబంధ మగుభయము కొట్లస్తంగత మగుచుండెనో యటులే ప్రీతియు ప్రణయమును తత్ప్రదేశమున నుదయ మొందుచుండెను. మనఃపూర్వకముగఁ బ్రయత్న మొనర్చి ప్రేమించినచో వశముకాని ప్రాణి యీధరాతలమున నెందును గానరాదు వినాయకుఁడు మూఢుఁడయ్యెను వాని కుంతెగ కరణమున పరోప కారప్రవృత్తియు, ఇంకఁ గొన్ని సద్గుణములును వాసము సేయు చుండెను. ఇట్టి మనుజునివ్హా దయము సంతతప్రయత్నము వలనను, నిష్కాపట్యమువలనను, మనఃపూర్వకముగను ప్రేమించినచో స్వాధీనము కాక పోవునా?

వినాయకుడు యధేచ్ఛముగ రెండుపూటలు భోజన మొనర్చి తృప్తిగ గంజాయిద్రావి గ్రామమంతయు నిరర్థకముగఁ దిరిగివచ్చు చుండును. సంసారసంబంధము లగుపనులు లేశముకూడ నాతఁ డొనర్చుటలేదు పతివ్రత యగులక్ష్మి యొక్క నాఁడైన నిదేమని భర్తను దిరస్కారముగాని, సామాన్యదూషణగాని, యొనర్చుటలేదు. మీఁదు ముక్కిలి నాథున కాయాసపరిహారార్థమై క్రమనివారక పదార్థములు స్వహస్తమున సిద్ధపటచి యుంచును, ప్రతి విషయమున నాతె ప్రాణపదముగ మనఃపూర్వక శుశ్రూష లొనర్చు చుండెను ఈకారణమువలననే వినాయకునకు, పత్నివిషయక మగుభయ మంతర్థాన మయ్యెను. మెల్లమెల్లగ వినాయకునకు భార్యయందు లక్ష్యమేర్పడెను. ఆమెవిషయమై వానిమనమున పూర్ణప్రణయమును, అత్యంతా

దరమును జనించెను. క్రమక్రమముగ సంసారకృత్యములును వాని మన మాకర్షించు చుండెను. వినాయకుఁడు పూర్వము వలె నూరంతయు నిరర్థకముగ ద్రిమ్మరుట మెల్ల మెల్లగ మానుచుండెను. పరమ దక్షయు, గృహిణీమణియు నగులక్ష్మియు సంసారకృత్యముల భారము నొక్కటొక్కటిగ భర్తపై వైచు చుండెను, వినాయకుఁడును మెల్లమెల్లగఁ బనిపాటులు చేయుట కలవాటుపడు చుండెను. పూర్వము వినాయకరావు కృశదేహుఁడు, మలినవస్త్ర పరిధారియునై యుండెను. కాని యోగ్యురాలగు భార్యయతిజాగ్రత్తగఁ జూచుకొనుటవలన వానిశరీరము చిక్కఁబట్టెను. వాని మలిన వేషము మాయ మయ్యెను. వినాయకుఁ డిప్పుడు దేహపుష్టిగలిగి స్వచ్ఛవస్త్రధారణ మొనర్చి, సంసార కార్యములందు శ్రద్ధ జూపుచుండెను. కుమారుని పరివర్తనము గాంచి రాధ యత్యంతసంతోషితస్వాంత యయ్యెను. అవృద్ధురా లెల్లరితో నిట్లనుచుండెను. "మాలక్ష్మి ముట్టినదెల్ల ముత్యము, పట్టినదెల్ల బంగారము సుమా! మాతల్లి చేనిపైఁ జేయి వైచినను బంగారము గావలసినదే."

గ్రామమునగలవారు దీక్షితుని కుటుంబమున నీయాకస్మికస్థిత్యంతరమునకు శ్రేయోదాయిని యగులక్ష్మి కారణభూతురాలని యేక వాక్యముగ నామెను బ్రశంసింపసాగిరి. ఊరిలో ముగ్గురు నలుగు రొక్కచో జేరిన చాలును దీక్షితుని చిన్నకోడలి ప్రశంసావృత్తాంత మటరాకుండు టెన్నటికిని సంభవింపదు.

ఇవ్విధమున లక్ష్మి మూడునాలుగుమాసములు సంసారశకటమును సునియంత్రితముగ నడపెను. ఆమెతల్లిదండ్రులు తమకుమార్తెను బంపుమని చాలమారులు రాధను వేడుకొనిరి. కానిరాధయందుల కొప్పుకొనలేదు. కాన వేరు తెఱవుగానక వా రా యాస వీడిరి. అట్లయ్యును నడుమ నడుమ మనుష్యులనుబంపి పుత్రికయోగక్షేమములఁ దెలిసికొనుచుండిరి.

ఇచట సదాశివరావు, మాధవరావు, కంట్రాక్టుపని చేయుచుండెను. కాని ఇంటికర్చుకై యింతవఱకొక్క రాగిడబ్బైన పంపవలయునని పాప మాతని కెవ్వఁడును స్మరణకైన రాలేదు.

౨౩

చిన్నకోడలు సంసారభారమంతయు వహించి శిథిలావస్థలో నున్న సంసారశకటమును ఇప్పటికి దాదాపు నాలుగుమాసములనుండి సుయంత్రితముగ నడుపుచుండెను. జనకుఁడమితముగ వస్త్రసముదాయ మొసఁగినందున, నింతవరకు సంసారమునం దెట్టిలోటుపాటును కలుగ లేదు కాని అదియేమి కల్పతరువా! సంవత్సరము పొడుగున నెట్లు గడచును? ఇంతవఱకు సదాశివునికడనుండి యేమయిన కర్చుకు వచ్చియుండినచో నీలుగనుండెడిది. అయిదారుమాసములయినను నొకదమ్మరకా నయినను వచ్చియుండలేదు ఎట్లయిన కర్చుతప్పదు గదా! ఎంత యోచించినను సంసారము గడచుమార్గమేమియు గానరాకయ్యెను. అట్లగుటఁ దనజనకుఁడొసఁగిన తొడవుల విక్రయింప నామె కృతసంకల్పయయ్యెను. అత్తవారికి గూడ నీవిషయమెఱిఁగించెను. రాధయీపలుకులాలించి విస్మితయై "అది యెందుకే తల్లీ! నాబొందెలో ప్రాణమున్నంతవరకు నిన్ను నగలమ్మనీయ" ననెను. అత్తగారికి కష్టనిష్ఠురములన్నియుఁ దెలియఁజెప్పుచు "నామాటాలకింపుడు. మీరిట్లు గట్టిపట్టుబట్టి కూర్చుండకుఁడు. నావద్ద నిప్పుడు కొలఁదిపైకముమాత్రమే మిగిలియున్నది. దానితో రెండుమూడునెలలయిన జరుగునని తోఁచదు. మఱిముందుగతియేమి." యని లక్ష్మి పలికెను.

ఆముదుసలికి డగ్గుత్తిక బడియెను. ఆమె సజలనయన యై "అమ్మా! జరిగినంతవరకు జరుగనిమ్ము. ముందుగతిముందు. తరువాత నేదోయొకనగ తాకట్టుపెట్టినచో గొన్నిరోజులు గడచు" ననెను,

"కాకట్టుగీకట్టు పేరెత్తవలదు. కాకట్టుపెట్టుటే మనవంతు దానివలన మిగిలిననగలన్నియుఁ గూడ నాశన మగుట తప్ప వేఱు లాభము లేదు సంసారము నడుపుటకు దీనివలన చిన్నమె త్తుపయోగ మయినను లేదు. కావుననిప్పుడే యీనమస్తాభరణముల నొక్కపరి విక్రయించితి మేని దాదాపు రెండువేలరూపాయలవఱకు రాగలదు. ఇపుడుధాన్యపుధర తగ్గుగానున్నది. కావున మన మీద్రవ్యములో ధాన్యము ఖరీదు చేసిపెట్టి, ముం దెప్పుడు ధాన్యపుధర హెచ్చునో యపుడు జాగరూకతతో విచారించి విక్రయించినట్లయిన లాభము రాగలదు. దానివలన సంసారయాత్ర గడుపవచ్చును. ధాన్యము మనయింటనే నిలువ జేసికొందము . నగలీ ట దాఁచుటకన్న ధాన్యము దీసికొని దాఁచి యుంచుట సరికా దనియా మీయభిప్రాయము?"

కోడలి దూరదర్శిత్వమువలన వృద్ధురాలు చకిత యై శాంతస్వర మున ని ట్లనియెను.

"అమ్మా! నీవుచెప్పినదంతయు నిశ్చయమే. కాని మన మూడు వాండ్రము. ఇంక నీమగనిసంగతి యున్ననో గృహకార్యముల చక్క బెట్టగలవాఁడే కాని యిట్టివ్యాపారాదుల కక్కరకు వచ్చువాఁడు కాఁడు. వర్తకమునకు కల్లబొల్లిమాటలు ప్రధానము. సరే ధాన్య మిప్పుడు ఖరీదు చేయువా రెవ్వరు? ధాన్యము మంచిచెడుగులు చూడ గలవా రెవ్వరు? సరిగా బేర మాడువా రెవ్వరు: దీనికంతకు చురు కైనవాఁ డెవ్వఁడైన కావలయును. లేనిచో నిష్కారణముగ నష్ట పడవలసివచ్చును."

నష్ట మెందులకు వచ్చును? మనమూడువాండ్రమయినంతమా త్రమున నీమాత్రపువ్యాపారము సేయ జాలమా? మఱియు మనబాల కృష్ణుఁడు మిగులచాకచక్యము కలవాఁడగుటచే మంచిచెడుగులు పరిశీలించుట, బేరమాడుట, మొద లగుకార్యము లన్నియు వానివ లన నెఱవేఱునని నాకు గట్టినమ్మకము."

ఇంతలో "ఏమి వదినే, ఏమి బేరము?" అని కేకలిడుచు బాలకృష్ణుం డటకు వచ్చెను. బాలకృష్ణున కిప్పుడు రాధను, అమ్మా యనియు, వినాయకుని అన్నా యనియు, లక్ష్మిని వదినె యనియుఁ బిలుచుట పరిపాటియయ్యెను. ఆమె మందహాసముతో "ఏమిరా బాలకృష్ణా! మేమిప్పుడు ధాన్యవ్యాపారము చేయఁదలఁచితిమి. నీకు దాని సంగతి సందర్భము లేమయినఁ దెలియునా?" యని యడిగెను.

బాలకృష్ణుఁడు సంతోషితస్వాంతుఁడై "ఇది యేమి ప్రశ్నము వదినే! నాది కృషికవృత్తియై యుండ, నిది నాకే తెలియకచో నీప్రపంచమున మఱియెవ్వరికి దెలియును?" అనెను.

అంత రాధ "మనవానికి తెలివితేటలకు లోపము లేదు. అందె వేసిన చేయియె" యనెను.

అందుపై లక్ష్మి యాశ్చర్యచకితయై "ఏమంటివి? నీకు వ్యవసాయవృత్తి కూడ తెలియునా!" యని వానిని బ్రశ్నించెను.

బాలకృష్ణుని వయస్సు రమారమి పదునెనిమిది సంవత్సరములు. కాని వాఁడు కొంచెము మాటితేటినవానివలె గన్పట్టును. ఉత్సాహపూర్ణస్వరమున వాఁ డిట్లనెను. 'కర్షకునింట బుట్టి పెరిగి వ్యవసాయపుబను లెఱుఁగకపోవుటసిన తల్లిదండ్రుల పేరుప్రతిష్ఠకు కళంకము దెచ్చిపెట్టుటయే!"

అంతట లక్ష్మి యత్తగారివంక దిరిగి యిట్లనెను. "వింటిరా మన బాలకృష్ణుఁ డేమనుచున్నాఁడో! నే నీతని చేతిక్రింద వైచికొని వ్యవసాయమును, ధాన్యవ్యాపారమును జేయ సమకట్టితిని-నాయాభరణవిక్రయమునకు మాత్రము మీ రనుమతించిన చాలును.'

కడకు వేఱుపాయము గానక రాధ యందుల కనుమతించి యిట్లనెను. "నీ పుట్టినసద్గుణసంపన్న యగుబిడ్డ కిట్టిది యసాధ్యము? కాని బిడ్డా! నీయాభరణములు మరల నేర్పడనిచో నామనసు

స్వస్థత నొందఁజాలదు. పోనీయేవిధమైన రెండుగుల్లలు నేనైనను చేయించిపెట్టుదమనినను—ఉన్నది తుడిచి పెట్టుటతప్ప—మంచిపోయిన యీనాచేతిలోశక్తి లేదు. అమ్మా! యేమి చేయుదు! దైవము నానుదుట నిట్లువ్రాసినాఁడు హో అమ్మా! నీయిష్ట మెట్లో యట్లే నంతోషముగ నొనర్పుము." వృద్ధురాలికంఠము రుద్ధ మయ్యెను. కన్నులనుండి యశ్రుకణములు బొటబొట జారెను. ఆమె ప్రేమాతిరేకమున తనచిన్నకోడలిని కౌఁగిలించుకొని చుంచు దువ్వి, చుబుకము పుణికి, ముద్దాడెను.

రెండుమూఁడు దినములలోపుగనే పరిచితుఁ డగునొకకమసాలిని పిలిపించి వానిద్వారా లక్ష్మి తన సొమ్ములను విక్రయించెను. అత్తగారు వెనుక గూర్చిండి పోరుచు వారిలోఁ గొన్నినగల నమ్మనిచ్చినదికాదు. మిగులనవసర మగునాలుగైదింటి నట్టే యుంచెను. మిగిలినవానికి దాదాపు ౧౬౦౦ రూపాయలు వచ్చెను. ఇపుడు పుష్యమాసము. అందునను నీసంవత్సరము పంటలు చక్కఁగ ఫలించెను. అట్లగుట ధాన్యము విపులముగ నుండెను. లక్ష్మి పదునయిదువందల రూపాయలు పెట్టి సుమారు నలుబదియైదుపుట్లధాన్యము ఖరీదుచేసి కొట్లలో బోసి నిలువ చేసెను. దీక్షితునిస్వార్జితములో గొంతభూమి గలదు. ఈభూమి స్వల్ప మగుమక్త్రాకు రైతున కమర పఱచి యుండిరి. ఆరైతునొద్దనుండి యాభూమిని దీసికొని స్వంతముగ వ్యవసాయము చేయింపనారంభించెను. ఆభూమియందు కొంతవరకు తోఁట కూడ గలదు. అందుచెరకు, మొక్కజొన్న, వంగ, కంద, చామ మొదలగువానిని పైరుపెట్టిరి. బాలకృష్ణునివయసు స్వల్పమైనను బుద్ధి యతితీక్ష్ణము మిగులచురుకైనవాఁడును. ఒడలు వంచి పాటు పడువాఁడు నగునొకనౌకరును బాలకృష్ణుఁడు సాయముగఁ దీసికొని యాభూవ్యవసాయవుబనులయందు నియుక్తుఁ డయ్యెను. వినా

యతిరాత్రుగూడ మెల్లమెల్లగ నా పనిలోనిమర్మములఁ దెలిసికొను చుండెను.

సదాశివునియొద్దనుండి యిప్పటికయిన నొక్కయుత్తరమైన వచ్చి యుండలేదు. అట్లయ్యు లక్ష్మి దక్షతవలన గాధసంసారమున లోటేమియు గలుగదయ్యెను

౨౮

"హృదయేశ్వరా! నాతనువు, ప్రాణము, ధనము సర్వమునుగూడ మీ యధీనమై యున్నది. నాదేహముపైనను, నాప్రాణముపైనను, ఇప్పుడు నాకావంతయు నధికారము లేదు. మీరే నిశ్చయముగ వానికి పాలకులును, యజమానులు. మీసుఖమే నాసుఖము. మీదుఃఖమే నాదుఃఖము! ఈప్రపంచమునందిప్పుడు మీరుగాక మఱియేపదార్థ మును నాకుఁ బ్రియము కాదు. మీరెట్లు చెప్పిన నే నట్లొనర్తును. మీ రేది కోరిన నేనది యిత్తును. మీకేమి కావలయును? మీ యాశ్రితము నెఱవేర్చుట కీదాసి——"

"మనోహారిణీ! నాయాఱవప్రాణమా! నేను ప్రేమాభిలాషిని. ప్రేమక్షుధ నన్ను దహించివేయుచున్నది. ఈయాచకునకు ప్రేమ భిక్షము కావలయును. మఱేమియు వలదు ప్రేయసీ!"

ఒక్కయువతి కటాక్షయుక్తమగు మధురహాసమొనర్చుచు నొకయువకుని మెడపైఁ జేయివైచి ముద్దులొల్కుతియ్యనిపల్కులఁ బల్కుచుండ యువకుఁడానందవిహ్వలుఁడై పై విధమున బ్రత్యుత్తర మొసఁగెను.

ఆతరుణులు రమణీయమగుదివాన్‌ఖానాలో సుందరమగు సోఫాపైఁ గూర్చుండి యుండిరి. ఆదర్శనగృహము ప్రశస్తమై యుత్తమ ప్రకారమున శృంగారింపఁబడి యుండెను. గొప్పచిత్రకారుఁడు తనకుఁ గలచాతుర్య మంతయు వినియోగించి మహాకౌశలమునఁ

చిత్రించిన వృక్షలతాపత్రములతో నీగదిగోడ లెంతయు రమణీయముగ నుండెను. గది మధ్యభాగమున సుందర మగు గంతపుమంచముపై పతిమృదులమును, శుభ్రము నగుశయ్య సజ్జితమై యుండెను. ఆ శయ్యపై నచ్చటచ్చట విరులు పఱచి యుండెను. ఆమ చపుపందిరి నందందు సుగంధపుష్పమాలికలు వ్రేలాడుచుండెను. పదును, పదును, శీతలసమీరకుమారుఁ డల్లనల్లననామాలికల నూపుచుండెను ఆమంచమునకుఁ గట్టినజాలరును, తెల్ల దోమతెరయు, మంచువలె మిగులమనోహరముగ గనవచ్చుచుండెను ఆమంచము ప్రాపుననే తెరచినకిటికీచెంత నొకబల్లను వైచి యుండెను దానిమీఁద నాను కొనుటకు ముఖమల్ దిండ్లును, మెత్తయు నమర్చి యుండెను. ద్వార మున కెదురుగ స్పష్టముగఁ గనఁబడులాగున పెద్దగడియారమును, మెత్తలమర్చిన విలువగలనాలుగైదుకుర్చీలును, ఎంచివార్నీసుచేసి విశాల మగురెండువిశ్రాంతికుర్చీలును, ఒకయూపుడుకుర్చీయును, రెండుపెద్దబఫేరియద్దములును, టేబిల్‌పై పెట్టినపింగాణీగిన్నెలును, పళ్లెములు మొదలగున వన్నియు ప్రశస్తముగనాగదియంతయు వ్యాపించి యుండెను. అచ్చటచ్చట గలచెలువరాతి గుండ్రని మేజాలపైనఁ గొన్ని మనోహర కాచపాత్రములును, లోహపుబల్లెరములు మొదలగు వస్తువు లాకయింగృహశోభ ననుమడిగఁ జేయుచుండెను ఏవస్తు వెట నుండ వలయునో యట్లన్నియుఁ జక్కగ నమర్చి యుండెను. పీరమునకు ప్రక్కనే వెండితాంబూలపు బళ్లెంమును దాని సమీపముననే యిత్తడిపీకుదానును 'మెబ్లాసమ్'—అమెరికన్‌పొగాకు డబ్బామొకటియు, నార్వేదేశపుటగ్గిపుల్లలు పెట్టెయు, దృగ్గోచరమగు చుండెను ఎదురుగ నన్నబిర్యాఅద్దములోనుండి గానవచ్చుచున్న చిన్నపెద్దగ్లాసులును, రకరకవర్ణౌషధబుడ్లును ఆరమణీయపీఠమున నధివసించు లగువారిచిత్తాకర్షణ మొనర్చుచుండెను. గోడలపై

గాలికి కొట్టుకొను చున్న ఆర్య, ఆంగ్లేయ యువయువతీపటములు మనోహర మగుట నిజమె, కాని యెంతసిగ్గు! ఎట్టిదృఢమనస్కులకైన నాచిత్తరువులు మనశ్చాంచల్యము గలిగింపక మానవు. ఇది గణికా గృహ మని వేఱుగఁ జెప్పవలయునా?

ఈతరుణుఁడు మాధవరావు. యువతి మాధవుని గ్రామవాసిని యగుతార యనుప్రఖ్యాతవారవనిత.

ఆదినమురాత్రి మాధవరావు కోపావేశమున తన బాలసహధర్మిణి యగుమనోరమను పదాఘాత మొనర్చి యీతారమందిరమునకు వచ్చి దాఖలయ్యెను. ఇంతకుముందొకప్రాణమిత్రుని పెండ్లికొలువులలో తార పాటవినుట కొకసారి యితఁడు వచ్చి యుండెను. ఆ సందర్భమున నిరువురకుఁ గొంతపరిచయము గలిగెను. మాధవరావు తనగృహమునకు వచ్చినతోడనే తార వానినెంతో సన్మానించెను. తారలోకోత్తరలావణ్యమును గాంచియు, కోకిలస్వరమును వినియు మాధవరావు మిక్కిలిసంతసించి మోహపాశబద్ధుఁ డయ్యెను. దౌర్భాగ్యవశమున లజ్జాశీలయు, బాలికయు నగుమనోరమ పతిప్రేమాప్రవాహమును తనదెసకు మరలించుకొనుట కసమర్థ యయ్యెను. పాపమేమి చేయఁ గలదు! మాధవరావుమనను తారచే నాకృష్ట మయ్యెను.

ఏదో యొకదుష్కృత్యమున ప్రవృత్తుఁ డగుటకుముందు దానివలన గలుగఁబోవు సాంఘికబాధకముల నప్రమాణముగ మనసున వితర్కించియు మనసు నెట్లో సమ్మతింపఁ జేసి, దానికి యుత్తేజ మొసంగుటకు బ్రతివాదును లనేకుల గండ్రగోళపడుచుండును. కారణ మేమన మానవునకు చిత్తచాంచల్య మంకురింపఁగనే సదసద్వివేకబుద్ధి లోపలనుండి యొక్కొకవిధముగ బోధించు చుండును. అదిసహించుట బహుకష్టము. బాలిక యగుమనోరమ భర్త కనుజ్ఞ యొనర్చి

గంభీరాపరాధము జేసి యుండుటచే మాధవరావున కాగ్రహము జనించెను ఆకోపభరమున పాపమా బాలికయెడ బగ దీర్చుకొనుటకై మాధవరావు పాపపంకిలమున నురికెను ఇందు తన దేమియు దోషము లేదనియు, సర్వదోషములకు మూలము తనపత్ని మనోరమయే యనియు, అట్లగుట నీసందర్భమున నట్టిపాతకము సంభవించినను నాపాతకములకు బాధ్యురాలు మనోరమయే యనియు నామూర్ఖుడు స్థిరపఱచుకొనియెను. పాపకార్యమున కుద్యుక్తుండగువాడు తనకు తగినట్టుగ నేదోయొకసిద్ధాంతము చేసికొని పాపకర్మమునకు భీతిల్లుమనమున కుత్తేజ మొసగును

మాధవరావు సుశిక్షితుడయినను చిన్నతనమునుండి యెల్లరకు ముద్దులాడగుటచే నాతడు పూర్ణస్వాతంత్ర్య మనుభవించు చుండెను. పైన పెద్దవా రుండుటచేతను, పూర్ణశ్రీమంతుడై యుండుట చేతను నాతం డెవ్విధ మైనశారీరక, మానసికకష్టముల నెఱుంగడు. యౌవనకాలమున ప్రణయతృష్ణప్రాబల్యము నొందుసమయమున లజ్జాన్వితయు, బాలికయు నగుమనోరమవలన వానిపిపాస తీరినదికాదు. భార్యవలన ప్రణయలాభము నందుట యశక్య మని మనమున సిద్ధాంతము చేసికొని యాతడు జ్ఞానశూన్యుండై పోయెను వానివిద్యయు, బుద్ధియు, జ్ఞానము నొక్కమారు నశించి పోయెను. వీనితో నపరాధిని యగునాకోమలబాలిక సౌఖ్యము గూడ నాశన మై పోయినది!

ఈరోజవఱకు మాధవరావు తారకు వేతనము నిర్ణయింపలేదు. ఆమె యొకనాడు తద్విషయము నిశ్చయపఱచుకొన నెంచి, సమ్మోహనకమధురస్మిత మొనర్చుచు, మారుతూపుల బోలు తనదు చంచలకటాక్షములు మిక్కిలి దీక్ష్ణముగ నాతపై బఱపు చుండెను. మోహాంధుడై యున్నమాధవరావుపై నీదినము తార తనకడ

గల మోహినీశక్తి నంతయు ప్రయోగించెను. ఇప్పటున మాధవరావు హస్తమున స్వర్గ మగపఱచుటకు కూడ తార సిద్ధముగ నుండెను. ఇందుకొరకే యింతచాతుర్యము జూపినది. మాధవరావును గాఢాలింగనముఁ జేసి "మనోహరా! మీకోర్కెదీర్చుట కీదాసి సిద్ధముగ నున్న" దని యామె పలికెను.

మాధవరావున కింతకంటె నెట్టియపేక్షయు లేదు. పత్నీ ప్రేమ విషయమై సంపూర్ణముగా నిరాశుఁ డగుటచే నాప్రేమ మన్యత్ర సంపాదించుట కాతఁడు ధీరుఁ డై యింతటిపాతకమునకు లోనయ్యెను. అట్లగుట నాతఁడు ప్రేమవిహ్వలుఁ డై "ప్రేయసీ! నేను ప్రేమతృష్ణచే తహతహపడు చుంటిని. నాకు ప్రేమభిక్ష కావలయు" నని వచించెను.

యోగ్యస్థలమున యోగ్య మగుయాచన జరిగినది. అందుచేత స్వర్గము జూప సామర్థ్యము గలదాని కీక్షుద్రప్రేమా దానము చేయుట కేమిలెక్క! తారసిట్టూర్పు విడిచి యి ట్లనియెను. అహా యేమి విచిత్రముగ మాట్లాడెదరు! ఇంతవరకు నాప్రేమ మీ రందనే లేదా! నే నెల్లు మిమ్ము ప్రాణసమానముగ ప్రేమించు చుంటినో యది యింతదనుక మీమనసునకు గోచరింపనే లేదా! ఒక్కక్షణము మీమకరన మోహనమూర్తి కంటబడకుండినచో నీదాసికి సర్వము నంధకారమయమై, యాహారనిద్రలుకూడ స్ఫురింపక, యొక్కటేవిధముగ మీపాదధ్యాన మొనర్చు చుండుట మీరుకొంచె మయిన దెలిసికొనలేక పోతిరిగదా! ఏది మీరడుగకపూర్వమే నేను మీకిచ్చి మరచితినో దానిని మరల నెటులీయగలను."

మాయావిని యగుతార తనమాయాజాలమును వ్యాపింపఁజేసి యపూర్వచాతుర్యమువలన మాధవరావును సమ్మోహనాస్త్రమునఁ బడవైచెను. తార కేవలము నేను ప్రాణపదముగఁ బ్రేమించు

చుంటి నను మాటలతో స్వస్థతఁ జెంది యాఱకుండక తనకృత్రిమ ప్రేమతోఁ బాటు మాయాజాలమును మూఢుఁ బ్రయోగింపఁ బ్రారంభించెను. హాహా యనుచుండగనే, తారనేత్రము లశ్రుపూరితములయ్యెను. కంఠము రుద్ధమయ్యెను. ఈ మోహజాలమువలన మాధవరావు తలక్రిందుగాఁ బడిపోయెను. ఆచారుగారి యశ్రుపూర్ణనేత్రములను స్వచక్షువులతో నవలోకించినమీఁదను, దాని బొమ్మరుద్ధకంఠరవము స్వకర్ణములతో విన్నమీఁదను, తారనిస్సీమప్రేమముంచు మాధవరావునకు సంశయమెట్లు కలుగును. ప్రేమభరమున గులాబికంబను సుకుమారమౌ నవనవోన్మేషమున నిగనిగలాడు తార చెక్కిలి నొక్కి తియ్యనిముద్దు గొని, చేతిమాలుతో నాకన్నుల నొత్తుచు మాధవరావిట్లనెను. "ముద్దులగుమ్మా! నీవు నన్ను మనఃపూర్వకముగఁ బ్రేమించుచుంటి వని నే బాగుగా నెఱుగుదును. అట్లగుట నేనే నీపై మమతఁ జెంది యుంటిని నీకు నాపైఁ బ్రేమ లేనిచో నీప్రేమమునకు నే నెట్లు బద్ధుఁడ నగుదును? ఈ నీప్రేమ మటులే యనిశము నఖండముగా నుంచ నాపరమేశ్వరుని వేడికొనుచుంటిని."

"నేను రేయింబవళ్ళు దైవము నిదే భిక్ష మడుగుచుంటిని. మీరు దీని కేదో తగినయుపాయము త్వరలో నాలోచింపవలయును మీకు గాక యన్యు లెవ్వరికి నీశరీరముపై నధికారము లేదు. సర్వకాల మీదాసి యీపాదములనే నమ్ముకొని యుండును. మదనమోహనా! నాయింటికి మఱియొకరు వచ్చుట లేదు. నిరర్థకముగఁ బదియుంది మనుష్యుల రాబట్టుకొని వారితో కలసిమెలసి ప్రసంగించుట నాకసహ్యము. మీరీకట్టుదిట్టము లొనర్పనిచో నేను యథార్థముగఁ జెప్పుచుంటిని. నిజము దిని మీ ముందరనే ప్రాణముల విడిచెదను" అనునప్పటికి తారకంఠము రుద్ధమయ్యెను. నేత్రములనుండి యవిరళాశ్రుప్రవాహములు జాలువాఱి వక్షస్థలమును తడిపివైచెను.

మాధవరావునకుఁగూడ దుఃఖము రాకపోలేదు అగును. ఇట్టి యకృత్రిమ నిస్స్వార్థప్రేమము గాంచినంత నెవ్వని కట్లు కలుగకుండును! అతఁడు తారకు గాఢాలింగన మొసఁగి దానికన్నీటిం దుడుచుచు నిట్లనెను. "ప్రేయసీ! నాకు నదే యిష్టము. నీవు నీతల్లిని కొంచెము మందలించి చూడుము. నేను దానికడ నీసంబంధ మగుకట్టు దిట్టము లన్నియుఁ జేసివైచెదను. మీకు నెలకర్చున కేమి యిచ్చిన సరిపోవునో సరిగా నిర్ధారణ మయినచో బాగుగ నుండును."

"ఈవిషయమును మాత్రము నేను వెళ్ళి మాయమ్మతో చెప్పను. నా యవస్థ యెట్లుండెనో యది నాకే తెలియును. ఇదియంతయు దానిపోరుఫలమే. మీవలన నాలుగైదుదినంబులు పుచ్చుకొనునప్పటికి నొక్కొక్కసమయమున మీ రిటకు వచ్చినప్పుడు మిమ్మది చులుకన జేయక మానదు. మీరొక్క దినము నాకంట బడకున్న నా ప్రాణము నిలువదు. మాయమ్మతో నీసంగతి చెప్పుటకు నన్ను మాత్రము పంపకుఁడు. ఈజీతమువిషయము మాత్రము మీ రనకూడదు, నే విన కూడదు. ఎవరిపాదములకడ నా ప్రాణము, సమస్తము నాధారపడి యుండునో వారికడ నశ్వరమగుధనము పేరయిన నెత్తుదునా! స్నేహము కావలయును కాని డబ్బు ప్రధానమా! కాన మీ కేది సరి యని తోఁచునో యది యొసర్చుఁడు. మాయింటికర్చు తప్ప మఱియేదియు నా కక్కఱ లేదు."

"మీయింటికర్చుకు నెలకెన్ని రూపాయ లగుచున్నవి?" సిగ్గళి నయుంచి అఱమోడ్పుకన్నులల్లార్చుచు తార యిట్లనెను. కర్చున కేమి, చేసినచో చాల గలదు. కాని యిప్పుడే సంసారభార మంతయు మీనెత్తిపైబడుటచేత నమితవ్యయ మొనర్చుటకు నామన సెట్లు సాహసించును! నెలకు నూఱురూపాయ లయిన చాలును. ఏలాగో దూఁచి వాడుకొని దానితో కాలము గడుపుకొందుము."

' ఇయ్యెడ తార యందవిక్షేపమున, కటాక్షములున్, మధురస్మితమును, లాలింపుమాటలను మాధవరావుమనసును సమ్మోహపూరితముగఁ జేసివైచెను. తార యడిగిననూఱురూప్యముల జీతము వానికి స్వల్పముగ గానవించెను తార తన్ను మనఃపూర్వకముగ ప్రేమించుచున్న దనియుఁ గేవలము ప్రేమవలననే యింత కొద్ది జీతముతో సంతుష్టి బడిన దనియుఁ దలంచి సంతోషపూర్వకముగ దానికి నూఱు రూపాయిలు జీత మిచ్చుట కాతఁ డొప్పుకొనెను

ఇట్లు తన కార్యము నెఱవేఱినందున తార గర్వమున మరల మోహినీస్వరూపధారణ మొనర్చి, వేశ్యాసులభ మగునానాభినయములు చేయుచు నిట్లనుకొనెను. నే నిదివఱ కెంతకల్లబొల్లిమాటలాడి యెంతలాలించి, యెన్ని మెరమెచ్చులు జూపినను నింత యెక్కువగ నూఱు రూపాయలు జీతమిచ్చెద నన్నముండాకొడుకొక్కఁడైన నున్నాఁడా? ఇంతకన్న నెక్కువయడుగుట కివ్వతెక్కైన సాహస ముందునా! నూరురూపాయల కీతఁడు చప్పున నొప్పుకొనియెను. ఇంకను కొంచెము హెచ్చించినచో కొంగులోఁ బడియెడినే. భయము లేదు. పిట్టవలలోఁ జిక్కినది. మెల్లమెల్లగ రెండువందలరూపాయలకు పైగా నీతనియొద్ద గుంజనిచో నాపేరు తారకాదు."

తార యీవిధమున మనోరాజ్యము నిర్మించుచుండ సనామయ యమునకే మాధవరా వాతస్వాంగ సౌందర్యమును తనయత్ప్ప నయనములతో ప్రశంస మొనర్చుచు నిట్లు తలపోయుచుండెను. "ఆహాహా! ఏమి యీవిత! చందురునందము డిందుపఱచునీము ఖకమల మెన్ని మాఱులు జూచిన నన్ని మాఱులు నూతనసౌందర్యము దృగ్గోచర మగుచున్నదే! ఈనవీనలావణ్య మెచ్చట నుండి వచ్చుచున్నది!

౨౫

మాధవరావు తారయెడ బద్ధానురాగుఁడై మిగులభ్రమిస్తుఁడై పోవుచుండెను రోజంతయు దానియింటనే గడచి పోవుచుండెను. కంట్రాక్టువ్యవహారములు వాతనిబుద్ధి జొరుట లేదు వ్యాపారభారమంతయు బావమరఁది సదాశివునిపై బడియెను. సదాశివరావు చెమటూడ్చి పనిచేయుచున్నమాట నిజమే. కాని వానికి వ్యవహారమునఁ గలలోతుపాతులు సరిగా ననుభవము లేకతన నేకోపారపాటు సంభవించుచునే యుండెను. కంట్రాక్టుపనియన్న మాటలతో నడచునది కాదు. జాగరూకతతో ప్రతిస్వల్పవిషయమును గూడ వేయికన్నులతో గనిపెట్టుచుండవలయును దానిలో తిరుగుబెరుగులు బాగుగా నెఱిఁగియున్నవానిగా బని చేయవలయును. ఇట్టి వ్యాపారమునకు మిక్కిలి నుసుక్తైన వాఁడు కావలయును. పాప మమాయకుఁడగు సదాశివునివలన నేమగును కొన్ని దినములవఱకును వ్యాపారము బాగుగనే నడచినది. ఇచ్చట మాధవరావు తారమాయాజాలమున మునిఁగి పోయెను. దానియింటను వానికి స్వర్గము కూడ తుచ్ఛముగాఁ దోఁచుచుండెను. ఇఁక వ్యాపారము నడుచునెట్లు? మెల్లమెల్లగ వ్యాపారము బుట్టలోనికి వచ్చుచుండెను. మాధవరావు ఖర్చు మాత్రము మితి మీఱియుండెను. వ్యాపారము రాఁబడి తగ్గినది ఖర్చుమాత్రము హెచ్చెను. అట్లగుట దీనిపరిణామ మేమో స్పష్టముగనే దెలియఁ గలదు.

పాప మెల్లకాలము దాఁగి యుండదు. ఎప్పుడో యొకప్పుడు బద్ధలై తీరును. మాధవరావు విచిత్రవర్తనము రామచంద్రుని చెవిని బడియెను. తన కొడుకు వేశ్యాసక్తుఁడైనందు కాతఁ డంతఁగ చింతించ లేదు. కాని వాని నిర్లక్ష్యమువలన వ్యాపారము చెడుచున్నందు నకుమాత్ర మావృద్ధున కమితదుఃఖము జనించెను. పుత్రుని

కాసింత మన్ననను నందుం గాతనివశమును మిగిలియున్నది. కుమారుని చింతచేఁ గొలది దినములలో రామచంద్రునకు హృద్రోగముగఁ బరిణమించెను. ఇంతలో కర్మధర్మసంయోగమువలన భయంకర మగు నంటువ్యాధి దగులొ్కని వైద్యసాధ్యము గాక యొకదినమున నావృద్ధుఁడై హికదుఃఖములనుండి విముక్తుఁ డయ్యెను. ఈయాకస్మిక ఘటనవలన దిరుగుబోతగుమాధవరావు మార్గ మకంటక మయ్యెను.

శాస్త్రవిధిచొప్పున రామచంద్రునియౌర్ధ్వదేహికకర్మ లన్నియు యథావిధిగ నడచెను. ఈకర్మల కేమియు స్వల్పవ్యయము గాలేదు. రామచంద్రునిమనస్సంతోషముకొఱకై చిరంజీవి మాధవుఁ డీరీతి సపరికర్మలు నిర్వర్తించెను. మామగారి శ్రాద్ధదినములకు పాతభాగిని లక్ష్మికూడ పుట్టినింట నుండి వచ్చెను. ఆపెంచాల దినము లత్తింట నుండుటకు శక్యము గాకపోయెను. ఆమె వైధవ్య ధర్మపాలనము కిచ్చుట ననివార్యము లగు నానావిఘ్నములు సంభవించెను. ఆమెయిరువురాడుబిడ్డలు—కాదు పూర్వజన్మము శత్రువులు—అణుమాత్ర మయిన జాపభీతి లేక మాటిమాటి కామెను హింసింప సాగిరి. ముందే వైధవ్యదుఃఖాగ్నిని క్రుగ్గుచున్న దీనురాలగు నయ్యబల మానసికయాతనాభరమేగాక యీయాడుబిడ్డల సాధింపుకూడ నెంతని సంహింప గలదు! మామగారికర్మ నాంత మయినయొక్కవారము లోపలనే యామెపుట్టినింటికరిగెను.

వినాయకరావు కూడ తనవదినెగారితండ్రిశ్రాద్ధమునకు వచ్చి యుండెను. వినాయకరా విప్పుడు పూర్వవినాయకునివలె యుండ లేదు. అంతయు మారిపోయినది. అట వినాయక రావుమూడు నాలుగుదినములుండి యింటికరుగుటకు బయలుదేరెను. వచ్చునప్పుడాతఁడు వదినగారిని పుత్రులను గూడ వెంటదీసికొని తనతో నింటికి రమ్మని యన్నగారి నెంతయొ ప్రార్థించెను. కాని పార్వతి

కిష్టము లేనందున నెవ్వరికిని వచ్చుటకు పిలుపబడినది కాదు. జగన్నాథుఁడు, రాముఁడు మాత్రము పినతండ్రితో నరిగెద మని బిక్కుబిక్కు లాడెనుగాని, పార్వతి వారిని బోనీయదయ్యెను.

రామచంద్రుని పండ్రెండవదినమున నాప్తమిత్రులు వచ్చి యుండిరి. రెండుమూడుదినముల కెక్కువగ నెవ్వరి నచ్చట నుండనీయ లేదు. పార్వతియు నామె జ్యేష్ఠ భగిని యగుగంగయు గలిసి వారివెంటనే సాగనంపిరి. రామచంద్రుని యాకస్మికమరణమువలన నందరికన్నను గంగ కెక్కుడుకష్టములు సంభవించినవి. శైశవమునుండియు రామచంద్రునకు గంగపై ప్రేమ మెండు. గంగకు గల దర్పమునకును, అహంకారమునకును మూలకారణము తండ్రి కిమెయెడ గలమహాదరమే. అట్లగుట పితృవియోగజనితదుఃఖ మందరికంటెను గంగకు దుస్సహముగానుండెను. ఇం దాశ్చర్యమేమియును లేదు. గంగస్వభావానుసరణముగ పితృమరణమునకు పాపము అనపరాధిని యగు మనోరమయె కారణముగ నైనగాని ఈచల్లనితల్లి యింట్లో నడుగు పెట్టినందువలనను, ఈదౌర్భాగ్యురాలి యదృష్టమువలనను నాజనకున కకాలమృత్యువు సంభవించెనని యామెను నిందింప సాగెను. గంగ మాటిమాటికిని మనోరమను శ్రమపెట్టుచు, ఆమె కోమలతను ద్రుంచివైచుచుండెను. పాపమా కోమల బాలికయొక్క యనిర్వచనీయమగు సంతాపము వర్ణింప శక్యము కాదు.

తండ్రి చనిపోయి రెండువారములయ్యెనో లేదో యప్పుడే మాధవరావు వేశ్యయింటికిఁబోవనారంభించెను. ఇప్పుడు దాతఁడు రాత్రులయందు యింటికి వచ్చుటకూడ బొత్తిగ మానివైచెను. దినములో చాలభాగము తారయొద్దనే గడచిపోవుచుండెను. తార మదిరాదేవతకు మహాభక్తురాలయి యుండుటచే మాధవరావుకూడ మెల్ల మెల్లగ సంపూర్ణసురాభక్తుఁ డయ్యెను. కొలఁదిదినములలోనే

ఇంతటి త్రాగుబో తాగ్రామమున లేడనిపించెను. ఇంతవరకు కంట్రాక్టుదారు మాధవరావుదుర్వర్తన నెల్లరకును దెలియ లేదు. కాని యిప్పు డది నీటిపై వైచిన తైలబిందువువలె గ్రామమంతటను వ్యాపించెను. అతని హితులును ఆప్తులును, ఈచెడునడత మాన్ప విషయమై యనేకవిధముల సద్బోధ లొనర్చి మరలింపఁ జూచిరి. కాని మాధవరా వీవిషయమున నణుమాత్రమైన దనదోషము లేదనియు, దోషసర్వస్వమునకు బాధ్యురాలు మనోరమయే యనియు వారితో వాద మొనర్ప సాగెను.

సోదరునిదుర్వర్తనమునకు గంగయుఁ, బార్వతియు నిరువు రాడుబిడ్డలును మనోరమను రేయింబవళ్ళు దూషించుచు కఠోరవాక్యములతో నొప్పించు చుండిరి. సోదరుని ప్రవర్తనము వీరిలో గంగమనస్సునకు సమాధానముగనే యుండెను. కాని పార్వతికి మాత్రమత్యంత దుఃఖదాయక మయ్యెను. గంగ సంతోషించుటకు కారణమిది. ఇప్పుడు మనోరమకు సుఖలాభము లేదు. ఆమెసౌభాగ్య మంతరించినది. గంగవంటిమాడుబిడ్డకు నింకేమి కావలయును! సోదరుని వేశ్యాసేవనము గంగ కిష్టమైనది గాని యాతఁడు భార్యను ప్రేమించి యామెను సుఖపెట్టుట మాత్ర మామె కణుమాత్రమును సరిపడ లేదు. బాలికయగుమనోరమ గంగ కేమియపకార మొనర్చెను! అట్టిదేమియు లేదే! కానియామె గంగకు మఱదలై యుండుటయే యపరాధమా యేమి! ఈభయంకరాపరాధమువలననే గంగ మనోరమకు శాశ్వతశత్రు వయినది.

మాధవరా విట్లు పరాధీనుఁడై జ్ఞానశూన్యుఁ డగుచుండెనో యట్లే మనోరమయవస్థకూడ నధికాధికముగ శోచనీయ మగుచుండెను. ఇంటిలో నెందరుపరిచారకు లున్నను ఇంటి పనులన్నియు రేయింబగళ్ళాదౌర్భాగ్యురాలే యొనర్పవలసి యుండెను. అందుచేతను

పాపము తినుటకు కడుపునిండ భోజనమైన దొరకుట లేదు. అదు బిడ్డల సాధింపువలనను, దస్సహబాధలవలనను అలజడినొందుచు నామె యశ్రువులతో కడుపు నింపుకొనుచుండెను. ఇతరాహారమువలన నామెకు ప్రయోజనమేమి? ఆయాక్రందన మెవ్వరికిని విన వచ్చుట లేదు సరిగదా, తెలియవచ్చుట కూడ లేదు. మఱియు నది వినవచ్చుటకును, దెలియవచ్చుటకును మార్గముకూడ లేదు. కారణ మేమన ఆమెరోదనము శబ్దాశ్రుహీనమై యుండెను. నిశ్శబ్దరోదన మనేకుల కడ జూచి యుందరు. కాని అశ్రుహీన మగురోదనము కేవలము మనోరమయభ్యాసఫలితము.

వీటి కన్నిటికంటె కష్టతరమైన యాతన పతియనాదరము. ఆమె యౌవనావస్థయందు ప్రవేశించుటచే తనస్థితి యిప్పుడామెకు దెలిసినది. ఆమె దేహమున యౌవనచిహ్నము లెట్లు రమణీయముగా శోభిల్లుచున్నవో యటులే యంతరంగమున హితాహితజ్ఞానముకూడ వికసించుచుండెను. ఆగంభీర నిశాసమయమున దన్నుకారణముగ పదాఘాత మొనర్చి భర్త యెందుకు బయటికి వెడలిపోయెనో, తనవలన నేమి యపరాధము కలిగెనో, మనోరమ యీదినమువరకును స్థిరపఱచుకొనలేక పోయెను దీనికారణము ప్రాణేశ్వరు నడుగవలయు ననియు, అందు క్షమాపణ వేడవలయు ననియు, మనోరమ యిప్పుడెంతయో వేగిరపడుచుండెను. కాని యామెదౌర్భాగ్యము వలన నెంతప్రయత్నించిన నట్టియోగము తటస్థము కాదయ్యెను. ఆదౌర్భాగ్యపురాత్రినుండియు నామెను దగ్గరకు రానిచ్చుటలేదు. ఎప్పుడైన నామె దైవికముగ తారసిల్లినచో వెంటనే యాతం డటనుండి తొలగిపోవును. పాపమామె కింక నుపాయమేమి? దగ్గఱ నెవరును లేనిసమయమున నామె యింట గలదేవతార్చనా గృహముకడ కరిగి, దేవికడ శిరము వాల్చి ముకుళితకరకమలయై జాలి గద్గ

నిట్లనను "తల్లీ జగదంబా! భక్తాభీష్టప్రదాయినీ నీవు నాయెడ ప్రసన్నవై నాకు మరణము ప్రసాదించిన నే నీయాతనల నుండి విముక్త నగుదును."

ఆడుబిడ్డలవలన గలుగుచున్న యీసహ్యాబాధలు కోర్వజాలక మనోరమ యాత్మహత్య చేసికొనుటకుఁగూడ నుద్యుక్తయయ్యెను. కాని యాత్మహత్య యెట్లు చేసికొనవలెయునో యామెకేమియు స్ఫురింప లేదు. అందువలన నామె యప్పుడప్పుడు దేవుని మృత్యువరము వేడుచుండెను.

౨౬

రామచంద్రునియొద్ద ద్రవ్యము మాధవరావుచేతి కందెను. ఈసమయమున నింతటివిశేషధనము మాధవరావుచేతి కందియుండనిచో నది నిజముగ నాశనమై యుండదు. ఈయర్థమే సకలానిష్టములకును మూలమయ్యెను. మాధవరావు జీవితచారిత్రమే దీనికి ప్రబలదృష్టాంతము. మాధవరా విప్పుడు క్రమక్రమముగ దుర్వర్తనము బాహాటముగా చేయుచుండెను. లోకనిందకు తానిప్పుడేమాత్రమును వెఱచుట లేదు. పరవంచకులును, స్వార్థపరులును, వ్యసనాసక్తులును, ముఖస్తుతి లొనర్చువారును నగరీచు లనేకు లాతనిచుట్టును మూఁగుచుండిరి. ఈనరాధములు మాధవుని నాశనమార్గమును సులభము చేయుచుండిరి.

ఈదినమున తోఁటవిందు. మాధవరావు నుద్యానగృహము నేడు మిగుల కోలాహలముగ నుండెను. ఈదిన మాతనిమిత్రు లచట సమావేశమైరి, కొన్నిదినములనుండియు నీవిందునకు తగుసన్నాహములు జరుగుచుండెను. కొందఱు గాయకనర్తకీగణికాసమూహములను బందోబస్తు చేయుటయందును, కొందరు నానావిధమద్యముల నమకూర్చుటయందును, కొందఱు మాంసాహార పక్వాన్నముల

సిద్ధపఱచుటయందును, నియుక్తులై యుండిరి. ఒక్కఁడును నిరర్థకముగ కూర్చుండి యుండలేదు. ప్రతివానికిని యేదోయొకపని యే! ఉదయము గడచి జాము ప్రొద్దెక్కెను. గోవిందరావు, రామరావు, విష్ణుపంతు, నరహరిపంతు, అమరసింగ్ సులేమాన్ మియ్యా, సారోజి, జాన్ డిసోజా మొదలగు పెద్దమనుష్యులందఱు మెల్ల మెల్లగ నచటికిఁ జేరిరి. తార, సుందరి, చంద్రానన మొదలగు గణికామణులుకూడ నటకు రావించి యుండిరి. ఆపెద్దమనుష్యు లెల్లరు మిగులనుత్కంఠతో వారిరాకను ప్రతీక్షించుచుండిరి. ఇంతలో నాలుగుగుఱ్ఱపు బండి యొకటి యుద్యానవనము ప్రవేశించెను. బండిచక్రములచప్పుడు చెవిని బడుటతోడనే యచటి పెద్దమనుష్యులయుత్సాహమేమని చెప్ప వచ్చును! అందఱిముఖములు ప్రఫుల్లములయ్యెను. సులేమాను నాబండ్ల కెదురుగ బరుగిడి పోయి, యాబండ్లలోని వారికి స్వాగత మొసఁగి, వారి నుద్యానగృహమునకు దీసికొని వచ్చెను.

మయూరోన్మత్తగజములవలె నగవిక్షేప మొనర్చుచు, ఘల్లుఘల్లని నూపురధ్వనులు నలుగడల మ్రోయుచుండ వారయువతీ సమూహ ముద్యానవిలాస మందిరము ప్రవేశించెను అంత నా పెద్దమను ష్యుల మానససరోగణములు హర్షోర్మితతులనిగి తేలుచుండెను. వా రందఱును లేచి వారవధూమణులకు స్వాగత మొసంగిరి శీఘ్ర కాలములోనే యచట నెల్లెడ శాంతి నెలకొనెను. సారోజిసేటు చేతులు జోడించి యా గణికాగణమున కిట్లని మనవి చేసెను. "సుందరీమణు లారా! శుభకృత్యములు ప్రారంభింప నింకవిలంబ మేటికి? మీరు కర్ణధారిణులై యీ యతిథులను భవనదిని దాటింపుఁడు!"

ఆవారవనితలు లజ్జ నభినయించుచు, కన్నులు త్రిప్పుచు, చిఱు నవ్వొలయ నిట్లనిరి. "ఈరోజున నిచట మీవంటినరసు లింద రుండ మే మంతటికార్యభార మెల్లు వహింప గలము!"

సురేషూ నిట్లనెను. "వా! మీకీ మాకీ పానారోజులనుంచి బహాదోస్తీ వుండాది. మీకీపైన మాకీ పానవిష్వాసం వుండాదిగాదు? అరే మీరంటే మాకీ యొంతలక్షం, మాకీ యొంతపావం, మాకీ మాట నేస్తే తోసేసేది మీకీ లేదు. ఈలాటి బలీ నాజాకుపని మీకాడలేదూ యిచ్చియుంకోడిమీఁద పెట్టిచేస్తే అరె! తోబా! మాకీ మన్ను కరా బవుతుంది లేదు?

మాధవరావు వారినిట్లు వేడుకొనెను. "కారా! కూర్చుండుఁడు-ఈదినము మాకు మీచేతిమీఁగనే ప్రసాదముదొరుక వలయును."

కారర మాటాడిలేదు. మందహాస మొనర్చుచు బుడ్డీయు గ్లాసును గైకొనియెను. కొంతతడ వెల్లెడల నిశ్శబ్దముగ నుండెను నడుమ నడుమగ్లాసు, బుడ్డి వీనిరణరణశబ్దముమాత్రము వినబడు చుండెను. వడివడి పదునైదు—ఇరువది గ్లాసులు నిండి సిద్ధమయ్యెను. "ముందు మీరు పుచ్చుకొనుఁడు. కాదు, ముందు మీరు పుచ్చుకొనుఁడు." అని యొకరియెడ నొకరు పెద్దరికము జూపుచుండగనే గ్లాసు లన్నియు రణ, రణవని మ్రోతమ్రోగుచు ఖాళీయై పోయెను. ప్రథమావృత్తి సాంత మయినవెంటనే ద్వితీయావృత్తి బయలుదేరెను. అదియు క్షణములో నంత మయ్యెను వెంటనే మూడు-నాలుగు-ఈవిధముగనే యెన్నియో యావృత్తుల పై నావృత్తు లయ్యెను అరమణీరములలో నలుగురైదుగురు తొలుదొల్త సురాపానము విషయమై తమ యసమ్మతిని గనబఱచిరి. కాని మాధవరావు లేచి స్వహస్తమున పాత్రల నింపి యయ్యిష్టదేవతలముఖము లసన్నిధి బెట్టెను. భక్తుని యాశ్రద్ధాభక్తులకు దేవీసమూహము సంతుష్టిబొంది, వాని మనోవాంఛితము నెఱవేర్చుటకు సిద్ధమయ్యెను. మదిరాపానమునకు మాత్రము వారెవ్వరికి నెట్టియభ్యంతరమును లేదు.

ప్రథమాంకము ముగియగనే ద్వితీయాంకము గానము ప్రారంభ

మయ్యెను. సారోజీసేటు హార్మోనియముముందు గూర్చుండెను. రామారావు తబలాచేతఁదీసికొనెను. సుందరి కర్ణరసాయనముగ గానము సేయఁదొడంగెను.

"ప్యాలాముఝే భరదే"

ఆహా! ఆనమయమున నయ్యప్రతిమమహానంద మెవ్వరు వర్ణింపగలరు! నలుగడల సంతోషముప్రమ్ముకొనెను.

"హాయి, హాయి! బలే, బలే! ఏమిఖోశయినపాట! వహవా!" ఇత్యాదిశబ్దములచే నుద్యానభూమి కంపిత మయి, నభోమండలము గూడ బ్రతిధ్వనించుచుండెను. మధ్యమధ్యగ్లాసులు రణఝణ శబ్దించుచుండెను. యువతీయువకుల యోష్టస్పర్శనముగూడ నావెంటనే జరుగుచుండెననిసి వేరుగ చెప్పనక్కఱ లేదుగదా! ఇంతలో రెండు గంటలు గొట్టిరి. పక్వాన్నము చల్లారిపోయినందున వంటవాండ్ర కెంతయో కష్టముగ నుండెను. తుదకు హుస్సేను ముందునకు వచ్చి ధైర్యము వహించి "అన్నంపాణాషల్లారి అయింది" అని చెప్పెను.

ఈపలుకులు సులేమాన్‌మియామనసున కెంతయోకష్టముగ నుండెను. అతఁడొక్కవిసరున నావంటవానిమీఁదకు బోయి కంపితగాత్రముతో నిట్లనను "అరే, హరాంజాద్! నీకీ మనిషి వుందావు లేదు? మాకీసంతోషాన్కి పాడూసేస్తావు! నీకీ కండ్లుకనుపడ్తాదీ లేదు? అరేనువర్! యీాడ దబ్బైడబ్బైమందినవాబులు అయిష్వర్యాన్కి బరోబర్ కిమ్మత్ చేసే యీపన్నెండురత్నములు ప్రకాశించుచున్నాయి లేదు? అరేకాఫర్! దీన్కి ముందర నీవెధ్వఅణ్ణంయేమీ లెఖయుంటాదివోయ్? యిది పాంతం అయింది అంటే తర్వాతా నూస్తాం పోజీ!'

సులేమానును, తక్కినవారును బ్రాందీనిషాలో మునిఁగి యుండి "అరరే పాటయేమి మజాగావుంది, యేమిమజాగావుంది!" అను

చుండిరి. అది గాంచి మాధవరావు "అరే హుస్సేన్! నీవు పోయి తయారయినయాయన్నము నిటకు దీసికొని రమ్ము." అని ఆజ్ఞాపించెను.

"జీ హుకుం ఖుదావంద్" అనుసలాము నర్పుచు హుస్సేన్ పక్వాన్నముల దెచ్చుటకై వెడలిపోయెను. వెంటనే భోజనపు పదార్థము లన్నియు నటకు వచ్చినవి. కాని యప్పటికే వారిలో చాలమంది నేలబడి దొరలుచుండిరి. లేచి కూర్చుండుటకయిన త్రాణ లేదు. అట్లగుట మహాప్రయాసంబున, విశేషద్రవ్యము వెచ్చించి, తయారు చేసిన యాహారపానముల నాస్వాదించుటకు పాపము వారసమర్థులై యుండిరి. సుందరం, శౌరి మొదలగు వారిలో మాత్ర మొక్కరికిగూడ నింతటిమైక మెక్కలేదు. ఏలయన నట్టిసమయముల మాయావిను లగునవ్వేశ్యలు తగుమాత్రముగనే సురాపాన మొనర్చుచుందురు. ఆరంగేలిపురుషులకు మైకము కలుగజేయుటయే వారిప్రధానోద్దేశము. వారిలో నొక్కతెకూడ మ్లేచ్ఛులచే పక్వము చేయబడిన యావంటకము స్పర్శనమయిన చేయలేదు. మాధవరావు నింక నొకరిద్దఱుమాత్రము కొద్దియో, గొప్పయో భుజించిరి. తుద కావంటకమంతయు భైరవసేవకర్పణ మయ్యెను. ఇవ్విధమున తోటవిందుతో ద్వితీయాంకము ముగిసెను.

సాయంకాలము తృతీయాంకము ప్రారంభ మయ్యెను. యజమానుడు మాధవరావు పడకనుండి లేచి బయటకు వచ్చికూర్చుండెను. అటు లగుట తక్కినవారుకూడ మైకముచే దూలుచు లేనియోపిక దెచ్చుకొని లేచి కూర్చుండిరి. నిశాసమయ మగుటయే తడవుగ నాగృహమునలువంకల దీపమాలికలు ప్రజ్వలితములై యెల్లెడలగాంతి వెదజల్లుచుండెను. తోటమాలీలు కొందఱు జాజులు, విరజాజులు, మల్లెలు, మొల్లలు, సంపెంగలు మొదలుగాగల కామోద్దీపకము

లగుపుష్పములను మనోహరగుచ్ఛములుగను, రమణీయహారములు గను, సిద్ధపఱచి దెచ్చిరి. అశోకీవాలాలెల్లరు మహానందముతో వాని చేకొని గొందఱు చేతులను, గొందరు కరములును, గొందఱు కేశపాశముల శోభాయమానముగ నొనర్చిరి. తిరుగ సంగీతము ప్రారంభ మయ్యెను, ఋ రాస్వాదనముకూడ ప్రరంభ మయ్యెను. తబలా నారంగి మొదలగు సుమధురవాద్యధ్వనులు సమ్మిళిత మయ్యెను ఇవాద్యములతోకూడ నుపుష్పపురుషులయనోవృత్తులు సమ్మిళితము లయ్యెను.

అల్పకాలములోనే నారంగముపై రాలాపము ప్రారంభ మయ్యెను. "థిత్తోం థిత్తోం" అని తబలాధ్వని బయలు దేరెను. హార్మోనియము సప్తస్వరముల నను బలముగ ధ్వనించుచుండెను నర్తకీగణము నృత్యారంభమునకు గడంగెను క్రమముగ లయ సమ్మేళన మయ్యెను. ఆసమయమున నారమణీమణులయందముంచాలనముతో వారి నూపురములనుండి వెలువడుమధురఝణత్కారము కూడ ఈసంగీత ధ్వనులతో గలసి పోయెను ఇంకేమి చెప్పవలెను! సంతోష తరంగము లెగురుచుండెను. ఆయువకులకామాగ్నియు ప్రజ్వలించు చుండెను ఇవ్విధమున దాదాపు గంటన్నరవఱకు నృత్యము జరిగి నది. తదనంతరము పాటప్రారంభ మయ్యెను అయినంతవఱకు నలు వంకల నగ్ని ప్రళయము మీరిపోయినది

ఎల్లరు సుఖసాగరతరంగముల నోలలాడు చుండిరి. ఈదినమున తాము మాధవరావునుద్యానవనమున గాదు—ఇంద్రునియుద్యానవన మున వసించియున్నట్టుగ ప్రతివాడును భావించు చుండెను. మధ్యా హ్న మెవ్వడును భోజన మొనర్చియుండనందున ప్రతివానికి నిప్పుడు కడుపులో నాకలి మండిపోవు చుండెను అటు లయ్యెను సురా దేవిప్రసాదమువలన నింతవఱకును వారియుత్సాహ మేమియు దఱుగ

లేదు. కాని యాయుత్సాహ మెంతవఱ కుండును? సిరాహారము లగునాయుపరములలో పడినమద్యవునిషాచే నాకలిమంట నాలుగురెట్లధిక మయ్యెను. అందరును స్మృతిభ్రంశమొంది యుండిరి. మెల్ల మెల్లగ గ్లాసులు పగులఁగొట్ట సాగిరి. అకాచశకలములవలన ననేకుల చేతులు గీసుకొని పోయి వానివెంబడి రక్తము కారు చుండెను. క్రమక్రమముగా సంగీతముసైత సిష్టముగూడ తప్పిపోవు చుండెను. అందఱు మైకమువలన నోడ లెరుంగక గంతులు వేయ మొదలిడిరి. ఒకరిమాటనొకరు వినిపించుకొనుట లేదు. ఒకరినొకరు లక్ష్యపెట్టుటయులేదు. అందరు సురాదేవికి స్వాధీన మైపోయిరి. కడకు దెబ్బలాటలో దిగినది నొకర్లుచాకర్లుగూడ సురాదేవికి దాసానుదాసులే యగుట నింక నాదెబ్బలాటను మాన్పువా రెవ్వరు?

క్రమక్రమముగ కుర్చీలు మేజాలు నొకరిపై కొక రెక్కుచుండిరి. చిత్రములు, ఫొటోగ్రాఫులు, అద్దములు తునకతునకలై పోవు చుండెను. కొందరికి చేతులు విఱిగెను. కొందరికి పాదములు విఱిగెను. కొందరికిఁ దలలు పగిలెను. అటులయ్యు నొక్కనికిఁగూడ చైతన్యము కలుగ లేగు. భోగమువారికి సహాయముగ వెంటవచ్చిన వస్తాదొకఁ డీసందడిలో మన్మత్తులై యున్న యాపెద్దమనుష్యుల గడియారములు, బంగరుగొలుసులు, ఉంగరములు వగైరాలను సంకినమట్టునకు జమచేసికొని యాసుందరీమణులఁ దీసికొని యటనుండి పలాయనము చేసెను. ఇచట నీపోకిపురుషులెల్లరు నెత్తురుమడుగునఁ బడి గడబిడగ దొరలుచుండిరి

## ౨౭

ప్రాతఃకాలమున నొకనొకరు పరుగత్తుకొని వచ్చి మాధవరావును మేల్కొలిపి సంభ్రమమున నిట్లనెను. నడవండి, నడవండి, చప్పునఁ కొంపమునిఁగింది. అమ్మగా రేదోబుడ్డిలో మందు తాగేశారు.

ఇప్పుడు గుడ్లు తేలేస్తుంది. మాట మన్ను లేకుండా పడిపోయింది. సదాశివరావుగారు మిమ్మల్ని వేగే పిలుచుకరమ్మన్నారు!"

అమ్మగా రనగా మఱెవ్వరు? హతభాగిని యగుమనోరమయే! కడచినరాత్రి నడచినమహోత్సవమువలన మాధవరావు మిగులక్రిమం జెంది యుండెను. అటులయ్యు నిట్టిభయంకరవర్తమాన మాలకించినంత దిగ్గునలేచి యారంగేళీచలితాంద్ర నచ్చట నే వదలి యొక్కపరుగున నింటిలోనికి వచ్చెను. ఇచ్చట దృగ్గోచరమైనభయంకరకృత్యమును గాంచి స్తంభితుండై పోయెను. అతనికట్టెదుట మనోరమ యీ నన్న మరణావస్థ ననుభవించు చుండెను. ఆమె ముఖశ్రీ వికటమైపోయెను గ్రుడ్లూర్ధ్వము లయ్యెను. కన్నులు లోతునకుదించికొని పోయెను. అణుమాత్ర మైన నామెకు స్మృతి లేకయ్యెను. అతం డింకను బరికించిచూచెను. ఆమె నోట నెవ్వరు నొక్కనీటిచుక్కయైనం బోసినట్లు పొడకట్ట లేదు. ఆమెకించుక శాంతి గలుగ నెవ్వరు నుపచారముగూడ చేయుట లేదు. మీదుమిక్కిలి నతనిజ్యేష్ఠభగిని గంగ యిట్టిసమయమునంగూడ భయంకరముగ గర్జించుచు నామెపై నిట్లు హృదయభేదకవాగ్ప్రహారములం బరుపు చుండెను. "...దౌర్భాగ్యురాలా! ఎంతమాయలమల్లి వే! పనిపాటలు చేయకుండ హాయిగా పండుకొనవచ్చునే గదా యని యేమిటకక్కువెన్ని నావే! అన్నపుముద్ద లేమియు గొంతుక కడ్డుపడలేదుగద! ఇంత తిండిపోతు రాక్షసివి మాకెక్కడ దాపరించినావు! ఒసీ! నీకా యింతతొందరగా మరణము! మరేమియు భయము లేదు. ఇంకను నీ వెంతకుందిని పంప వలసి యుంటివో! నీవు చచ్చిపోయినచో రేయింబగళ్లు నన్ను కాల్చుకొనితినువారెవరు? నీకు చావనిన అంత సంతోషమైతే చావవమ్మా—సంతోషముగ చచ్చిపొమ్ము. మావాడొకదానిని పెండ్లాడి యీబాధనుండి విముక్తుండవును!"

హృదయద్రావక మగునీదారుణరంగ మంతయుం బ్రత్యక్షు

చెను. స్వహస్తమున నామెనోట నిర్మలోదకము బోసి వీవనతో వీవ సాగెను. ఇంతలో సదాశివరావు డాక్టరును దీసికొని వచ్చెను. మనోరమనాడి బరీక్షించి, ఆమె త్రాగిన యౌషధపుబుడ్డి పేరు దెలిసికొని డాక్టరు తెల్లమొగమువైచెను. వెంటనేసిద్ధపఱచి తెచ్చిన యౌషధమామెం డామెనోట నెంతోకష్టమున బోసి యిట్లు చెప్పి వెడలిపోయెను. "నన్ను చాల నాలస్యముగఁ బిలచితిరి. అందువలన నీమె జీవించుట దుర్లభ మని తోఁచుచున్నది. పావుగంటలోపల నేనిచ్చినయౌషధమువలన వాంతి యైనచో నీమె బ్రతికిన బ్రతుక వచ్చును. ఈమె నిప్పుడు లేవదీసి కూర్చోబెట్టఁడు ఏమాత్రముగూడ నిద్దుర బోనివ్వ వలదు. ఇంకొకపావుగంటసేపటికిమెస్థితి యెట్లుండునో నా కెఱుక పరపుఁడు.

డాక్టరు వచించినయీపలుకు లాలించి యెల్లరు మగుల దుఃఖించిరి. కాని గంగయానందమునకుమాత్ర మవధి లేదు. మనోరమ చావ వలయు నని యామె తన మనసున నెందరో వేల్పులకు మ్రొక్కుచు నటనుండి వెడలిపోయెను. కాని పార్వతి ముందునకు వచ్చి మనోరమను లేవదీసి కూర్చుండబెట్టెను. ఇది యేకాదు. ఆసమయమున నామెనేత్రములనుండి రెండుమూడశ్రుబిందువులు కూడ రాలెను. ఇది సదాశివునియుపదేశమే యైయుండనోపు. మనోరమ విషయమున నీదినము మాధవరావుహృదయము మిక్కిలివ్యధిత మయ్యెను. ఇప్పు డాతఁడు మనోరమ కుపచారము లొనర్చుచుండెను. అదృష్టవశమున నల్పకాలములోనే మనోరమకు వాంతి యయ్యెను. ఈవాంతి మిక్కిలియల్ప మయ్యె నద్దానివలన నెంతోయాశ జనించెను.

మనోరమకొఱ కందఱికంటెను సదాశివుఁడమితముగ దుఃఖితుఁ డయ్యెను. కతమేమన రేయింబవళ్లామె కెట్టిదుర్భరహింస జరుగుచుండెనో యాతఁడు సంపూర్ణముగ నెఱిఁగి యుండెను కాని యా

సందర్భమున వారించుట కాతనికడ నేమాత్రమును ప్రజ్ఞ లేదు. అటు లయ్యుఁ దనపత్ని యగుపార్వతినిమాత్ర మీవిషయమున నాతఁడు చాలమాఱులు మందలించెను. అందువలననే బయట కంతగ పార్వతి యామెను వేధించుట లేదు. మనోరమకొఱకే జీవనము సదాశివుఁ డెంతయో శ్రమపడుచుండెను. ఈహృదయ ద్రావకప్రసంగము మొట్టమొదట నాతఁడే కనిపట్టెను. వెంటనే యాఘోరవృత్తాంత మును మాధవునకు దెలియఁ జేయుటకై పరిచారకు నాతనికడ కనిపి తాను డాక్టరింటికి పరుగెత్తుకొని పోయెను. తొలుదొల్త సదాశివుఁ డీభయంకరవిషయమును గనుపెట్టియుండనిచో మనోరమకు చికిత్స కూడ జరుగకయే పాప మాయువతి యాపాటికి నిస్సంశయముగ మరణించి యుండును.

కొలఁదిసేపటికే మరల పెద్దవాంతి యయ్యెను. దానివెంబడి విష ము చాలభాగము బయటికి వెడలిపోయెను. మనోరమ కించుక చైత న్యము గలిగెను. ముగ్గురు డాక్టరులు బిలిపించిరి. రోగిని మరలబరీక్షించి డాక్టరిట్లనెను. ఇంక నంతగా భయము లేదు. అయినను మిగులజాగ రూకతతో నీయౌషధము వెంటవెంటనే పావుగంటకొకసారి యీయామె కడుపులో పోయవలయును.

క్రమముగా రోగికి నొక్కజీవితాశ యిప్పటికి నిశ్చయమని తోఁచెను. మనోరమ తనవిశాలనేత్రములను దెఱచి విస్మితదృష్టులతో నలువంకల జూడఁ దొడఁగెను. ఇప్పు డామె వెనుకటిమనోరమ కాదు. ఆమె కిప్పు డట్టిలజ్జయు లేదు. ఇంతలో సదాశివుఁ డౌషధము ద్రా వించుటకు వచ్చెను. కాని యెంతబలవంతము చేసినను నామె యౌ షధము తీసికొనలేదు. సదాశివుఁడు "సోదరీ! ఏల నీవిట్లు మూర్ఖపు పట్టు పట్టెదవు? ఈ యౌషధము దీసికొనుము. ఔషధము ద్రాగనిచో స్వస్థత యెట్లు గలుగును? అని యామెను బుజ్జగించెను.

అనిమిష యై మనోరమ యనేకక్షణములు సదాశివునివంక జూడసాగెను. ఆమె శేషాక్షరముపై చిఱునవ్వుగానవచ్చుచుండెను. అనవ్వు జూచియందఱును విస్మితులైరి. అందఱును నిశ్చలదృష్టులతో మనోరమముఖము వంక జూచుచుండిరి. ఇంతలో నది రముయథా స్వరూపమును బొందెను. ఇప్పు డామెం గాసములేదు. మనోరమమ్మృదు మందహాస్యముతో "నా కౌషధమువలదు. నాకు స్వస్థతయు వలదు. నాకు బ్రపంచేచ్ఛ లేదు.!" అని వక్కాణించెను.

'ఎంతపిచ్చిపిల్లవు! అమ్మా! ఏటికిట్లనెదవు?' అని సదాశివుడు పలికెను.

"అన్నా! నాయట్టిపాపి భాగినికి మరణమేశ్రేయము. నేను—" ఇంకను నేమియో చెప్పవలయు నని యుండెను, కాని యామెపై నాటాడజాలదయ్యెను. నేత్రములనుండి యవిరళాశ్రుధార ప్రవహింపసాగెను. కంఠము గద్గదమయ్యెను. సదాశివుఁ డుత్తరీయాంచలమున నామెయశ్రుల దుడిచివైచెను. మనోరమ వెక్కి వెక్కి యేడ్చుచు "అన్నా! చూడుము. నేను నీకాళ్ళకు మ్రొక్కెదను నామరణమునకు నీవడ్డమురాకు" మని యతనిని వేడుకొనెను.

సదాశివు డామె నూఱడించుచు "ఇంతయల్పవయసుననే నీకెందులకు మరణముసు గోరెద వమ్మా! ఏ కీడుంగారమువంటి సంసారముండియు నీవుమరణ మపేక్షించుచుంటివి?" అని ప్రశ్నించెను.

ఆమె శోకసాగర మొక్కపెట్టున పొంగి పొరలెను. గత స్మృతులన్నియు నలు స్మరణకు రాగనే యామెమనసు అస్థిర మయ్యెను. నోటినుండి మాట నొక్కటైన వెలువడుటలేదు. నునుచెక్కులనుండి యశ్రుధారలు ప్రవహింపఁ దొడగెను. ఈసమయమున నామె సదాశివునిప్రశ్నకేమని యుత్తర మొసంగ గలదు! కృశించినహస్తముల నామె మెల్లమెల్లగ పైకెత్తి శిరమున బెట్టి, యాకసమున దృష్టి నిగుడించెను. ఇదియే యాప్రశ్న కామె యొసగినప్రత్యుత్తరము.

ఆప్రత్యుత్తర మందఱిహృదయములను వ్యాకుల మొనర్చి వైచెను. సదాశివుఁ డెంతయో విలపించెను. అతఁ డేడ్చుచు "మాధవరావూ నీవే నిశ్చయముగ నీవే యీసర్వానర్థములకుఁ గారణము! ఈదినము వఱకును నీసోదరివలన గలుగుచున్న యసహ్యబాధలనెల్ల నెట్లో తానామె సహించుచు వచ్చినది. ఎప్పుడు నీమె "ఆ ఊ" అనుటగూడ నెవ్వరును జూచి యెఱుగరు. కాని మాధవరావూ, నీవలన కలిగిన తిరస్కారముమాత్ర మీమె సహింపజాలకుండెను. ఇప్పట్టున నీవీమెను బతిమాలనిచో నెవరుచెప్పినను నీమె యౌషధము గైకొనదు ఎదురుగ స్త్రీహత్య సంభవింప నున్నది. ఆపైన నీయిష్టము" అని యించుకదూరమున కొత్తిగిలెను.

మాధవరావుహృదయము పాషాణనిర్మితము కాదు. అతఁడు గద్గదకంఠుఁడై విషణ్ణవదనముతో "మనూ నిజమానా, నా యనాదరమువలననే నీకు జీవితమునం దసహ్యము కలిగినదా!"

మనోరమ యిప్పు డజ్ఞానబాలిక కాదు. ఇంతటిసమక్షమున గూడ నామె కిప్పుడు మాటలాడ ధైర్యము గలిగెను. చీరచెఱఁగున నశ్రువుల దుడిచికొనుచు నామె యిట్లనెను. "నే ననుభవించు చున్న యాతన మీమనసునకు స్ఫురించి యున్నచో నింతవఱకు వచ్చియుండదు. విషము దినకపూర్వము కేవల మీదుస్స్వభావవిషయమే యనేక పర్యాయములు నే నను చుండెదుదానను. అదుదాని కింతకంటె నధికదుఃఖ మిం కేమికావలయును! ఈవిషయము మీకు దెలయఁ జేయుట తటస్థించినచో నే బొందుచున్న భయంకరదుఃఖమున నొక్క కళాంశమైన మీకు దెలియజేయ తటస్థించినట్లయిన మఱియీ పృథివియం దిం కేసుఖములు నే లెక్కగొనను! ఈనాటి యీనామృత్యువువలన తనకార్యము కొనసాగినచో నాసుఖమున కింతమే లేకుండునుకదా!"

ఈమె యింతటివాక్చాతుర్య మెచట నేర్చికొనెను! ఎల్లరు విస్మితచిత్తులై స్తబ్ధు లయిరి. మాధవరావు స్వప్నమునఁగూడ తనభార్య యింతటి చాతుర్యవతియని తలఁచ లేదు. ఈనమ యమున పత్నిముఖమున నమృతమును కని యాతఁ డానందింప లేదు. కేవలమనోరమ కోపమువలననే తనవిమలచరిత్రమునకు తాను కళంకము తెచ్చుకొనెనని యింతవఱ కాతఁడు తలఁచుచుండెను "అంతయు దైవఘటనము. అది గడచిపోయినది. దానికి మనము చింతించిన లాభమేమి! ఇప్పుడీయౌషధము గైకొనుము."

ఇట్లని మాధవరా వౌషధపాత్రను మనోరమ ముఖముకడ్డగకు బట్టెను. మనోరమ కంపితస్వరమున నిట్లనెను "మీ రొక్కసారి గాంచినంత నే నిం కెందుకు చావవలయును! మీరు నాభర్త. మీరు నాకు సాక్షాద్దైవము. మీయాజ్ఞ కెదు రాడుదునా!" అని యామె యా యౌషధముఁ గ్రోలెను.

ఇంతలో మాధవరావిట్లనెను... "ఆత్మహత్య మహాపాతకము ఆత్మహత్య జేసికొనినవారు నిశ్చయముగ నరకకూపమున బడుదు."

ఈదినము మనోరమకాకస్మికముగా ప్రసంగసామర్థ్యము కలిగెను. ఇంతవర కామె యిట్లు మాటలాడు టెవ్వరును జూచియుండ లేదు. ఆమె సమమనే యిట్లనెను. "కాని యే పాపిష్ఠురాలు పతిసుఖమునుండి వంచితయగునో దానిపాతకమున కాత్మహత్యయే యోగ్యమగు ప్రాయశ్చిత్తము కాదా యేమి!"

మనోరమ యెదుట నిలుచుట కిదిన మెవరుసమర్థులు! లోలోన దెరిపి లేకుండ మండిమండి బాలిక హృదయము దగ్ధమైపోయెను. ఆమె దగ్ధహృదయముపై నీదినము బిందుమాత్రజలసేచన మయ్యెను. హృదయ మహాప్రవాహ మిన్నిదినములు బద్ధమై యుండి, యీదిన

మవరోధము తెగి, గుణాలున బయటఁ బడెను. ఓహోకాల మింకిపో యీనవాగ్ఝరి యాఁడిన మాకస్మికముగ నూట లూరి పారసాగెను. ఆదినమాదిగ తనమనసున గలయనేకవిషయములను మిగులనస్పష్టముగ బహిరంగ ప్రకటన మొనర్చెను. ఇందు మనోరమదోష మేమియు లే దని మాధవరావున కిప్పటికి నమ్మకము గలిగెను. సర్వదోషములకును మూలము సకలగుణాలంకృత యగుతనసోదరి గంగయే యని యాతఁడు మనస్సున నిశ్చయించెను.

మనోరమ కాలకృత్యము తప్పినను గంగవలన గలుగుబాధ మాత్ర మేమియుఁ దప్ప లేదు. మనోరమను రహస్యముగ హింసింప గంగ నానావిధము లగు నూతనోపాయములను గనిపట్టుచుండెను కాని యసహాయులకు సహాయుఁడును, దుర్బలులకు బలమును, అనాథలకు నాథుఁడును నై, యెవ్వఁడు సమస్తవిపద్భంజనుఁడై యుండెనో యట్టిభగవానునికృపాదృష్టి యిప్పుడు మనోరమపై బరిపూర్ణముగ నుండుటచే నేమియు దాఁచియుండక నన్నియు బయలుపడుచుండెను. కతమే మన, ఇప్పుడు పార్వతి మొదలగు వారందఱు మనోరమపక్ష మవలంబించిరి. వాఁడుకగా ప్రతిదినము సంభవించుచున్నస్వల్పవిషయములుగూడ మాధవునిచెవిని బడుచుండెను. అటులయ్యు నిందులకై యాతఁడు గంగ నక్షరముకూడ ననుటలేదు. గంగమాత్రము తనస్వభావానుసరణముగ సోదరుని వరోక్షమున నామెను దుర్వాక్యము లాడుచునే యుండెను. వినివిని తుదకొక్కదినమున మిగులవిరక్తుఁడై మాధవరావు మనోరమను పుట్టినింటికనుప నమకట్టి, ఆదినముననే యావిషయ మామెచెవిని వైచెను.

మాధవునిచరిత్రదోష మింతవరకును పోలేదు. ఇట్టిదోష మొక్కపరి మనుష్యునిచారిత్రమును స్పృశించినచో నంతమాత్రమున బోనిచ్చునా? సరిగా గన్నులు దెఱచిచూడవలెను. కాని మాధవరా

విప్పటికిని రాత్రియంతయు నింటికి రాకున్నను మనోరమనవ్వా డవ్వా దేశాంతమున గలసికొనుచుండెను. ఆసందర్భము లందు అతం డామెను మిగుల ప్రేమించుచుండెను. ఇంతమాత్రమునకే మనోరమ యపారసంతోషమును బొందుచుండెను, ఈదినమునకూడ నట్టిసమాగమమే లభించెను. దాపున నెవ్వరును లేరు. అదిచూచి మాధవరావు తనమనమున గలయాలోచనము పత్నికెఱిగించెను. మనోరమ వినయమొలుకు పలుకులతో నిట్లనె. "నాకొఱకు పెద్ద వదినెతో మీ రెందుకు జగడమాడెదరు? ఆమె యేమనను నా కావంతయు కష్టము లేదు. దినమున కొక్కసారి తమపాదపద్మ సందర్శనభాగ్యము నాకు లభించినచో నింతకన్న క్రూరమైన నూర్గురాడు బిడ్డల యార్భాటముల నైన నేనోపికతో సహించి సౌఖ్యమంద గలను. మిమ్ముడబాసి నాపుట్టింటికి మాత్ర మరుగజాలను."

కులకాంతయొక్క యాయత్యంతసరళ మగు ప్రేమభాషణముల నాలించి మాధవరావు ఖిన్నవదనుడై "హా, హా, మనూ, ఈ నీ గంభీరప్రణయకథ యానసమయమున నెటులేగినది? నీ నోటినుండి యొక్క యనురాగవాక్యము వచ్చునేమో యని యానసమయమున నే నెంత ప్రయత్నించితిని! ఎంతనిరీక్షించితిని! ఇప్పుడుసమయము మించిన వెనుక దుర్బలమును, కళంకితమును నగునాహృదయ మధ్యముననీయా ప్రబల ప్రణయ వేగమునెట్లు ధారణ మొనర్పగలను? నిన్ను ప్రేమించుటకు నేనెంతగా ప్రయత్న మొనర్చుచుంటినో—కాదు నిన్ను ప్రేమించి యుంటిని. అటులయ్యు నింతదనుక నాసర్వస్వము నీవే యని దలంప వలనుగాకుండెను. ఎంతెంతగా నేను ప్రయత్న మొనర్చుచుంటినో—యంతంతగ నది విఫల మగుచుండెను నీవు పుట్టినింటి కరిగినచో నీవెనుకనే నేను గూడ నటకు వచ్చెదను- ఈమోహాబ్ధిలో మునింగి యిచటనే యుండినచో దీనినుండి విముక్తుండ నగుదు నను

నావయుఁక లేదు. నిన్ను పుట్టినింటికి బంపుటకు నిజమైన కారణ మిదియే" అని పలికెను.

మనోరమ కోమలకపోలములపై నానందాశ్రువులు ప్రవహింప సాగెను. ఆమెయదృష్టమున నింతే సుఖము. కాని ఆమె నానందము చవ్వుననే కల్పనోదయమయ్యెను. మనోరమ కంపిత హృదయము తోడనుకరుణాజనకస్వర ముతోడను "నాథా! మతి నన్ను వెంటకొనుకొని పదువుడు. ఎచ్చట మీరుందురో యదియే నాకుస్వర్గ మనెను.

మాధవరా వుచ్చైస్స్వరమున నిట్లనెను "ఏమి? నే నెందున్న నంతే స్వర్గమా! అది యబద్ధము. మీరుమిక్కిలి నే నెచ్చట నుందునో యదియే భయానక మగురౌరవనరకమై యుండవలెను! నేనునరక ములో కీటకమను. ఈజగమున నాయట్టియధమాధముఁడుమరెవ్వఁడు."

"పతివినా, స్త్రీ కన్యము స్వర్గమైనను నరిగా దని నానమ్మకము. స్వర్గ మనుమాటయే నాస్ఫురణకు రాదు. అది మీకు వ్యతిరిక్తమైన నే త్రికరణశుద్ధిగఁ జెప్పుచుంటిని — ఆస్వర్గమేమియునాకు వలదు. నకు మీతో బాటు నరకమేసౌఖ్యము!"

మాధవరావు స్తంభితుఁడై పోయెను. ఇదేమి యీమె యాపూర్వపుమనోరమయేనా! చాలతడవు స్తబ్ధుఁడై యుండి యనంతర మాతఁ డిట్లనెను. "మనోరమా! నీ వేమనుచుంటివి? నీ వెఱుఁగవా యేమి? నే ఘోరపాతానికిని నుమా! నాలోనాకే సిగ్గగుచున్నది. ఇట్టిపాపి, నీచుఁడు, అధమాధముఁడు నగుభర్తను నీవు తిరస్కరింపవా?"

"ఏదినమున నిమ్ము దిరస్కరింప నాకు బుద్ధి వొడమునో — అంతకుఁబూర్వమే భగవంతుఁడు నా కంఠము గలిగించుగాక! మీకు నూర్గురు దాసీలున్నను వారిలో నొక్కదానిగా నంగీకరించినచో నాకు జాలును. నాకు మీచరిత్రదోషమును బరికింప నిచ్చలేదు. నా కెవ్వరును జూప నక్కఱ లేదు. ఏదినమున మీదోషముల గాంచ

నాకిచ్చువాడమునో—యంతకుమున్నే యీశ్వరుఁడు నాదృష్టిపో గొట్టుగాక! ఇపుడు మీరు నన్నట్లు ప్రేమించు చుండిరో యంతకంటె నధికము నే నెంకు నాశించుటలేదు. మీరు కూడ నాతో రావలయు ననిమిమ్ము ప్రార్థించు చుంటిని. దానికి కారణ మిదియే. నాతల్లిదండ్రులు మిమ్ము జూడవలయు నని యెంతో ముచ్చటపడుచుండురు పాపము వారిది సామాన్యపు సంసార మగుటచే నిచటికి వచ్చి మిమ్ము దీసికొనిపోవు సామర్థ్యము వారికి లేదు. అట్లగుట మీరునాతో వచ్చినచో వా రింతయానందింతురు!

"స్త్రీప్రేమ యింతటిదని నేనన్నఁడు దలఁప నైతిని. ప్రాణేశ్వరి ఇపుడు నీ వరుగుము. నీ వేమియుఁ జింతింపకుము. నీవెనుక నే మైదాఱు దినములలో నే నచటికి వచ్చెదను. ఇప్పు డిచట వ్యవహారములు చక్కఁజేయవలసిన యవసరమున్నది. దీనికి నాల్గుదినము లిచట నుండి తీరవలయును. ఇచటపని నాకస్మికముగా విడిచి వచ్చుటెట్లు?"

మనోరమ యిట్లనెను. "మీ కేది సరి యని తోఁచునో యట్లు చేయుఁడు. నేను కేవలము బాలికను అవివేకురాలను. నాకు మీవలె సమస్త విషయములు నెట్లు దెలియుఁగలవు?"

సరళహృదయ యగు బాలిక సరళహృదయముతో సరళవిషయము వాక్రుచ్చెను. భర్త యనుమతి కాఁగనే ప్రఫుల్లచిత్తమున నామె పుట్టినింటికి బయలుదేఱి పోయెను. దీనివలన ముందు గొప్పయనర్థములు సంభవించు నని యాసమయమున నెవ్వరైనఁ దలంచిరా?

## ౨౮

మనోరమ పుట్టినింటి కరిగినకతన గంగక్రోధమున కవధియే లేదు. మనోరమను పంపువిషయము నెవ్వరు నామెతో రవంతయు నాలోచింపలేదు. గంగ యిట్టియవహేళనమును జన్మావధిగా నెన్నఁడును ననుభవించియుండలేదు. యఖండప్రభుత్వ మింతకాలమున కీదిన

మున భంగ మయ్యెను. ఆమె యసాధారణగర్వ మింతకాలమున కీదినమున నీరయ్యెను. ఈవిషయములన్నియు నామె కెంతో యసహనీయము లై యుండెను. మనోరమ విషప్రాశన మొనర్చిననాటనుండి గంగహృదయమధ్యమున బ్రచండప్రళయ ముద్భవమై యుండియు బయటి కాభయంకర మగుతుఫానుచిహ్నము లేమియు గానవచ్చుట లేదు. గంగ లోలో నత్యంతక్రుద్ధ యై యుండియు మహాప్రళయము సంభవించుటకు బూర్వము ప్రకృతి యెట్లు శాంతభావము వహించి యుండునో యట్లే కొన్నిదినములవఱకు బాహ్యావర్తనము శాంతధారణ మొనర్చి యుండెను.

మనోరమ పుట్టినింట కేగినప్పటినుండియే గంగవర్తనము తప్పిన మాటి పోయినది. మొదట నామెహృదయమున నున్న పితృశోకము గుభాలున బయటికి యుబికెను. తండ్రికొఱకు నామె యనేకక్షణము లుచ్చైస్స్వరమున రోదన మొనర్చెను. కాని పూర్వమువలె నొక్కరు కూడ నామె నూఱడించుటకు రారైరి! వలదని చెప్పుటకు చెల్లెలు పార్వతిమాత్ర మొకటిరెండు మాటలు చెప్పి యామెను సమాధానపెట్టుటకు కొంచెము ప్రయత్నించెను. ఇట్లగుట పాప మామె యెంతసేపేడువగలదు? తుదకు తనకు దానే యూరడిల్లెను. తరువాత నామె పూర్వస్వరూపధారణ మొనర్చెను ఎవరితో నేమియు మాటలాడక గంగ యింటిలోని వస్తువులపై దనకోప మంతయు దీర్చికొనుచుండెను. చెంబులు, తప్పేలాలు, గిన్నెలు, పళ్ళెములు మొదలగువానిని జితుకగొట్టుటకును, పప్పు, బియ్యము, నూనె, నేయి మొదలగువానిని పాఱబోయుటకును బ్రారంభించెను. ఇవ్విధమున గంగ వంకరపను లొనర్పసాగెను. చాలకాలమునుండి మాధవరావిదియంతయు జూచిచూడనట్లు సహించి యుండెను. కాని యిప్పుడు సోదరిదుశ్చర్యలన్నియు నాతనికి మిగుల నసహ్యము గలిగించు

చుండెను. ఇప్పట్టున దానింక చిన్న కున్న సంసారము వృద్ధికి వచ్చుమార్గము లేదని తలంచి యొక్కదినమున మాధవరావు "గంగా, వినుము, నీ విట్లొనర్చుచున్నచో నింకమీఁద నేనోర్చుట లే" దనెను.

గంగ యాఁడుపులివలె కోపమున పన్నులు పటపటగొఱుకుచు నుచ్చైస్స్వరమున "నిజమేరా నాయన! ఇప్పుడు నాపనులు నీకెందుకు బాగుగ నుండును! నీ విప్పు డామాయదారి పెండ్లమువలలోఁ జిక్కిపోయినావు. ఆముష్టిముండ వాళ్ళు పెయుత్తమాటలు నిజముగా నీకేదో మందో మాకో పెట్టి వలలో వేసికొన్నారు. ఆంద్రవంశము నిర్వంశముగాను! చచ్చినవాళ్ళు నాకు గనపడినచో చీపురుకట్ట దీసికొని దిగదుడుపు పెట్టుదును" అనియఱచెను.

మాధవరావు మిగుల సంతప్తుఁడై "నీకు నే నొక్కటే మాట చెప్పెదను. నీవు న న్నెంతగి నైన దిట్టుము. కావలసినచో నాభార్యను నీ యిచ్చవచ్చిన ట్లనుము. ఇందుకు ని న్నేమియు ననను. పాప మావృద్ధుల నెందుకు శపించెదవు! నిష్కారణముగ వారిని దిట్టినచో నీ వెన్నటికిని బాగుపడవు." అని నచ్చఁ జెప్పెను.

"నీ మొగముమండ! చచ్చినవాడా! పెండ్లమునకు లొంగిపోతి నని నీకు సిగ్గైనను లేదంటరా! అత్తవారిపక్షమై నామీఁదికి పోరాటమునకు వచ్చెదవా! నీసిగ్గు బొగ్గులుగాను! ఛీ, నీ మొగమున నుమియా! చచ్చినవాఁడా, నిపాపము నీవే యనుభవించెదవులే! ఆ ధాకిని నిన్ను మంత్రించి వలలో వేసికొన్నది. ఉరిపెట్టుకొని చావుము!"

"నిజముగా నిప్పుడు నాకురిపెట్టుకొని చచ్చుయోగమే వచ్చినది. అదియే యుత్తమము. కాని చండాలురాలా! నాకన్న ముందు నీ వీప్రపంచమున లేకుండబోవు టావశ్యకము. దుష్టురాలా! నీవే

నాసర్వనాశనమునకుఁ గారణమవు. నీమూలముననే నేను ధర్మార్థకామ మోక్షములకు దూరుఁడ నైతిని. సంసారమంతయు నేట గలిపితివి. సౌఖ్య మడుగంటఁ జేసితివి. అన్నిటిని సమూలముగ నాశన మొనర్చితివి. నీవే-నీవేముందు చావవలయును—"

"చచ్చినవాఁడా! నేఁబ్రతుకుట నీకుకష్టముగా నున్నదా? నీకుల క్షయ మైపోను! నీ మొగముమండ! సరే, యిదిగో చూడు, నీసంసారముమీఁద నిప్పుపెట్టి నేఁ బోయెదను. నేచచ్చినతరువాత నీ వేమాత్రము సుఖపడెదవో చూచెదను!"

ఆచండాలురా లుగ్రస్వరూపధారణ మొనర్చి క్రోధావేశంబున శరీరము కంపింప, తనచిన్న చిన్ననగలు, ముతకధోవతులు రెండును దీసికొని, యెదుటఁ గనబడినవస్తువులను ధ్వంస మొనర్చుచు నింటినుండి తత్క్షణము బయటికేగెను. ఆదఱును నిర్ఘాంతపడి చూచుచుండిరి. గంగ నెవ్వరును వారింపలేదు. ఆసర్వప్రళయకారిణీమూర్తి సమ్ముఖమున కరుగుట కెవ్వరుసాహసింపలేదు.

ఆదినమున గంగజాడ యేమియు దెలియలేదు. రెండవరోజున నామె పినతల్లియింటి కరిగినట్లు దెలియవచ్చెను. ఈకల్లోలమువలన మాధవరావు మిగుల ఖిన్నుఁడయ్యెను. ఆఖిన్నహృదయము ప్రఫుల్ల మొనర్చుటకై యాతఁడు మరల తార సన్యభావమునశరణుఁ జొచ్చెను. మరల సురాపానము ప్రారంభ మయ్యెను. మిత్రులందఱు గలసి కొనిరి. మరల మనోరమ సౌఖ్యమున కంతరాయము వాటిల్లెను. వారమునినములలో మాధవరావు శ్వశుర గృహమున కరుగవలసి యుండెను. ఆవారముగడిచెను. ఇట్లే నాల్గువారములు తిరిగివచ్చెను. కాని మాధవరావునకు వాగ్దానము స్మరణకు రాలేదు. నడుమనడుమ నెప్పుడైన సరళహృదయయు నిర్లోభయు నగు భార్య స్మరణకు వచ్చినప్పుడుమాత్ర మామెకొఱకాతని మనస్సు

వ్యాకుల మందుచుండును కాని యీ స్థితియతిక్షణికము. క్రమక్రమముగ నాతఁడు మనోరమసంగతియే మఱచిపోయెను. ఇవ్విధమున నప్పుడే యీమాసములు గడచిపోయెను. అనంతరము మాధవరావు శ్వశురాలయమున కేగుట తటస్థింప లేదు.

౨౮

క్రమక్రమముగఁ బిత్రార్జిత మంతయు వ్యయ మయ్యెను. వ్యాపారము చక్కఁగ నడుచుటలేదు. కర్చుమాత్రము మిక్కుటముగ నుండెను. చేత సొమ్ములేమి. వ్యసనములు సాగి తీరవలెను. అందువలన ధర్మాధర్మవిచక్షణ సేయకయే విత్త మార్జించుటకు మాధవరావు ప్రవృత్తుఁ డయ్యెను. ఆజ్ఞపెట్టువా రెవరును లేనిచో చంచలవృత్తి గలమనుజునకు ధర్మాధర్మములయందును, పాపపుణ్యములయందును లక్ష్య మెట్లుండును? ఎంతదుర్మార్గ మైనను సరే ద్రవ్యలాభము గలిగినచో నంతియే చాలు, మాధవరా వెంతయో సంతసించును. ఈ ద్రవ్యమువలననే యాతని వ్యసనవ్యాపారములు సాగుచున్నవి. మానసస్థితియం దేదో కొంచెము పరివర్తనము గలుగునమయముననే యాతఁడు భార్యతో శ్వశురాలయమున కరిగియుండినచో క్రమక్రమముగ దుస్సాంగత్యమునుండి విముక్తుఁడై మరల సత్పథమునకు వచ్చియుండును కదా! కాని దైవయోగము వేఱుగ నున్నది 'బుద్ధిః కర్మానుసారిణీ' యనుట నిశ్చయము.

ఇవ్విధమున దాదాపు వత్సరము గడచిపోయెను. ఇటుల జరిగి జరిగి మాధవుని పాపకర్మములకుఁ దగిన ప్రాయశ్చిత్త మగుసమయము సమీపించుచుండెను. ఇప్పు డాతని కట్టిమానాభిమానములును లేవు. అతనిస్థితి తడిసిగాని గుడిసె గట్టఁ దన్న ట్లయినది. ఒకదానివలన మఱియొక పాపకర్మ మాతనిని జుట్టుకొను చుండెను. ఇట్టిస్థితిలో నొక్కదిన ముదయమున మాధవునియూర నాల్గువైపుల నాకస్మిక,

ంగ పోలీసువారు వచ్చి చుట్టుకొనిరి. ఒకపోలీసినస్పెక్టరును గుప్త లీసుసంఘములోని యొకరిద్దఱును గ్రామమునఁ బ్రవేశించిరి. మయమున మాధవసదాశివులిరువురు కచేరిచావడియందు గూర్చుండి యుండిరి. బయట గడబిడ యగుటతోడనే సదాశివుఁడు చప్పున చి యదియేమో కనుగొనుటకు బయటికి వచ్చెను. ఇచట మాధ ఁడు పలాయితుఁడగుటకు మార్గ మఱయు చుండెను. కాని వాని ప్రయత్నము వ్యర్థ మయ్యెను రహస్యపరిశోధకులు కచేరిచావడిద్వారము ద్దకు వచ్చినిలిచి కర్కశస్వరమున నిట్లనిరి. "రామచంద్రపు రలుకుమారుఁడు మాధవరావు జనార్దనదీక్షితునికొడుకు సదాశివ రావు నెచ్చట నున్నారు:"

సదాశివునిమనసున నెట్టిపాపమును లేదు అతఁ డేమి భ్రమను నులుపక "నేనే సదాశివరావును. ఈతఁడే మాధవరా' వని మాధ వుని వ్రేలితోఁ జూపెను.

ఇనస్పెక్టరు వెంటనే జేబులోని రెండుకాకితములఁ దీసి "మిమ్ము నవుడను ఖైదుచేయుటకై వారంటు వచ్చి యున్నది" అని పలికెను.

సదాశివుఁడు విస్మితుండై "నామీఁదనా వారంటు! అదేఁదు లకు? మేమేమి యపరాధ మొనర్చితిమి? ఫిర్యాది యెవరు?" అని వారి నడిగెను.

ఇనస్పెక్టరు కఠోరస్వరముతో "ఫిర్యాదీ సర్కారువారు. ఆరోప ణము దస్తావేజు బనాయింపు. మీరు ఆగ్రాబ్యాంకు వేయిరూపా యిల చెక్కుమీఁద పదివేలని అంకెలు దిద్ది బ్యాంకువారిని మోస పుచ్చితిరి."

ఇంతవఱకు మాధవరావు నోటనుండి యొక్కమాటకూడ వెలు వడలేదు. అంత నాతఁడు చప్పున " ఈసంగతి యసత్యము. ఆచెక్కు పది వేలరూపాయలదే" యని నుడివెను.

ఇనస్పెక్టరు కనుబొమలు ముడివడ శ్రద్ధుండై యిట్లనెను. "నిజమో యబద్ధమో యదికోర్టులోఁ జెప్పెదరుగాని, యిప్పుడు మీరు మా స్వాధీనమున నుండవలయును. మిమ్ము ఖైదు చేసితిమి."

సదాశివుఁడు నిలువునఁ గ్రుంగిపోయెను. మాధవునిచర్య గాంచ నాతనికి మిగులసంశయము కలిగెను. ఒక్కవారము దినములక్రిందట మాధవరావు పేరుగల పదివేలరూపాయల చెక్కును తానే రసీదిచ్చి బ్యాంకునుండి సొమ్ముఁ దీసికొనివచ్చి యుండెను. ఈచెక్కు ఫోర్జరీచేయఁబడిన దని యాతని కప్పు డిసుమంతయు సందేహము కలుఁగలేదు. ఇప్పుడు ముందు తా నేమిచేయవలయునో యాతని కేమియుఁ దోఁచుటలేదు. ఈసంగతి మాధవరావు మిత్రుల కందరకు వెంటనే తెలిసినది. కానియాశ్చర్యము! ఆదినమున కన్నుపొడిచి కొనిచూచినను నొక్కఁడు కూడ మాధవుని చూచిపోవుట కైన రాలేదు. ఆదినమున మాధవుఁడు తనస్నేహితుల యోగ్యత బాగుగఁ దెలిసికొనెను; కాని యది మిగులనాలస్యముగ, సమయము మించిన వెనుక!

వారంటు దీసికొనివచ్చినవారు బొంబాయిపోలీసువారు కావున వా రాయిరువురను బట్టికొని బంధించి బొంబాయికిఁ దీసికొని పోయిరి. ఆయాకస్మికసంకటము వినినంతనే పార్వతి మిగుల రోదన మొనర్ప సాగెను. జగన్నాథునకును రామునికి నిప్పుడు కొంచెము కొంచెముగ మంచిచెడ్డలఁ దెలిసికొనునంతటివయసువచ్చినది. తమ తండ్రికిని మేనమామకును సంభవించినవిపద్దశను కన్నులార గాంచి యేడ్చుచు దాము కూడ వారివెంట నేగ కదలిరి. అప్పు డొక నౌకరు వారినిఁ బట్టికొని బలవంతముగ నింటిలోనికిఁ దీసికొని వచ్చెను. మాధవరా వేగునప్పు డానౌకరుతో బిగ్గరగ నిట్లనెను. నన్ను విడిపించుటకు మీ రేమియుఁ బ్రయత్నింపవలదు. నాకుఁ గల

యాస్తియంతయు విక్రయించివైచి సదాశివుని మాత్రము విడిపింప యత్నింపుఁడు "

నిందావాక్యములతో నీవిషయము గ్రామమంతయు వ్యాపించెను.

## 30

మనుజున కూర్జితకాలము సమీపించినచో నలుదిక్కులనుండియు వానికి మహాభివృద్ధియే చేకూరి యహితవిషయములు గూడ హితప్రదము లగుచుండును. కానియొక్క కష్టకాలము ప్రాప్తించినచో మిత్రులుకూడ శత్రువులగుదురు. సగే తరువాత నిది కాలమహిమవలన నైననేమి, అదృష్టమువలన నైననేమి, మఱి దేనివలన నైననేమి. మాహాత్మ్యము గలదనుటమాత్రము నిశ్చయము. మనము యథావిధిగ వర్తించినచో తప్పక యిట్లు సంభవింపగల దని దృఢముగ నెవరును చెప్పఁజాలరు. అంతయు దైవసూత్రముచొప్పున వాటిల్లు చుండును.

లక్ష్మీబాయి వెనుకటిసంవత్సరము ధాన్యము మొదలగునవి ఖరీదు చేసి నిలువఁ జేసియుంచినదాని కీసంవత్సరము వరుణ దేవునియతి కృపావిశేషమువలన రెట్టింపుధర వచ్చెను. ఈధాన్యము వలనను సొంతవ్యవసాయమువలనను దాదాపు రెండువేల యయిదువందల రూపాయలవరకు లాభమువచ్చెను. అట్లగుట నిప్పుడు దీక్షితుని కుటుంబమునస్తాపము వదలిపోయినది. సంసారవ్యయము గడచి నాల్గు డబ్బులు వెనుకఁబడు చుండెను. లక్ష్మిసామర్థ్యము వలనను, పరమేశ్వరు నభయహస్త మామెపై నుండుటవలనను, ఆమె యేది తలపెట్టిన నది జయ మగుచుండెను. ఆమెస్థితి మిగుల నభివృద్ధియం దుండెను. నలువురిలో పరువునష్ట మని తెలిసిపోని డంబములకుఁ బోవక ప్రామాణికముగ సకలదానధర్మాదికము లొనర్చువారిపైఁ బరమేశ్వరుఁ డెల్లపుడు కరుణాళుఁడై యుండుటయు, ప్రతివిషయమునను వారికి జయముకలుగుటయు. ననుభవసిద్ధమే కదా!

ఇప్పుడు వినాయకరావు కూడ సంపూర్ణసంసారదక్షుఁ డయ్యెను. అటులయ్యు పరోపకారార్థమై శరీరమును వినియోగించుటయం దాతఁడు వెనుదీయుట లేదు. వినాయకుఁడు గంజాయిదిబ్బమున కప్పటికే సెల వొసఁగి యుండెను ఇప్పు డాతనికెట్టివ్యసనములును లేవు. నలుఁపురుసభ్యులకడ కరిగి వారితోఁ గలసిమెలసి యుండుటయుం దాత నికి గలభయము క్రమక్రమమున క్షీణించుచుండెను. ఇంతియే కాదు. ఇప్పుడిప్పుడు వినాయకరావు దీక్షితునిగ్రామమునఁ బ్రముఖుఁడై మిగుల నెన్నికలలోనికి వచ్చెను. లక్ష్మి యింటిలోనుండియే గొప్ప వ్యాపారము సేయుచుండెను. ఈవ్యవహారము జమాకర్చులెక్కయు నామె స్వయముగ నే జూచుకొను చుండెను. భర్తకు న్యూనత వచ్చు నని యీసంగతి యెవ్వరికి దెలియనీయుట లేదు. వినాయకరావు గూడ నిసుమంతయు గర్వపడక మందహాసవదనుఁడై భార్యకడ సకలవిషయములను నేర్చుకొనుచు నామెసలహా లేకుండ నేపనియుఁ జేయుట లేదు. అత్తగారి యభిమతానుసరణముగ వర్తించుటయు, నామెను సంతుష్టి పఱచుటయు లక్ష్మికి నితెవ్వరును నే ర్పవలసిన యవసరము లేదు. అత్తకోడలు సందున నొక్కదినము కూడ మతభేద మన నెట్టిదో లేదు. చిన్నమాట పెద్దమాట వచ్చుట మొదలే లేదు. అత్తగారిసంగతి యెందుకు? ఇరుగుపొరుగువారును గ్రామమున గలవారెల్లరును గూడ నెంతో కలసిమెలసి వర్తించుచు లక్ష్మి నెంతయో కొనియాడు చుందురు. ఆమెయెడ నెవ్వరు నెప్పుడు నసంతుష్టులై యున్నదే లేదు. గ్రామమున నెచటగాంచినను లక్ష్మిప్రశంసయే వినవచ్చు చుండెను.

ఒకదినము మూడవజామున వినాయకరావు తనభార్యతో "మనక మార్చివైచిన సీనగలను తిరిగి చేయించవలయు నని నా కిచ్చ వొడముచున్న" దని పలికెను.

భర్త సరళవాక్కుల నాలించి మందహాసము మొనర్చుచు నామె యిట్లనెను. ఎందులకు? ఈదినము మీమనసు నగలమీఁద కేగినది? మునుపై దొడవులు లేనిచో నే నిప్పుడు మీ కంటి కందముగ గనఁ బడుట లేదు కాఁబోలు! నారూప మిప్పుడు మీకసంతుష్టిగ నున్నది కాఁబోలు? అందువలననే నా కాభరణము లలంకరించి నాసౌందర్య లోపమును పరిపూర్తి నొందించుట కిట్లుఁ జెప్పుచుంటిరి."

"చాలుచాలు ఇదేటిమాట! ఈవిషయము నామనసున నిసుమంతయు లేదు. నీసౌందర్యము లోకోత్తరము. దానికన్న నధికము నాకేమాత్రమును వలదు. కాని నీవాభరణములు నాకయి విక్రయించితివి అందువలనఁ జెప్పుచుంటిని."

"నారూపాతిశయము మీకిష్టము లేదా! వలె దానిని సంపూర్తి నొందించుటకు మీ కపేక్షయే లేనిచో నే నానగలఁ గైకొను టెందులకు? నాశరీరమున నాభరణములు లేకున్నను మీప్రేమ నాపై నున్నది కదా!"

నీయట్టి గుణవతి యగుభార్యను ప్రేమింపనియధముఁ డీప్రపంచమున నుండునా? నీవే నాసర్వసౌఖ్యములకును మూలము నీవు నా పత్నివే గాకున్నచో నీవే నాగృహలక్ష్మివి, నీవే నామంత్రివి, నీవే నామిత్రురాలవు నీవే నాయుపాధ్యాయినివి ఇట్లగుట నిన్ను ప్రేమింపనిచో—

ఆహా! ప్రాణేశ్వరునినోటనుండి వెలువడిన యీ నెయ్యంపుతియ్యని పలుకు లాలించినపట్టున నేసాధ్వీలలామ యానందము పొంగిపొరల కుండును? ఏసాధ్వి గర్వపడకుండును. లక్ష్మి సలజ్జాస్మితవదనయై యిట్లనెను. "ఇవి యేటిమాటలు: నేను మీ కిప్పు డింకేమియు గాను, కేవలము మీదాసిని. కాని మనయింటఁ బనిచేయు సఖూబాయి వంటి దాసినిమాత్రము కాను సుండీ! మనయిరువురము సుఖదుఃఖముల

యందును, మంగళచిహ్నములయందును నొక్కరజ్జువులో బంధింపఁబడి యుంటిమి. సమస్తవిషయములందును మనస్మైక్యము కానిచో సంసార శకటము నడచు టెట్లు? నే గిందపడినచో మీరు చేయూత నొసఁగి నన్ను లేవనెత్తి కొనవలయును ప్రసంగవిశేషమువలన మీరు క్రిందికి జారినచో నే చేయూత నొసఁగి మీరు పడకుండ బట్టికొనవలయును. ఇటు లుండుటే యైకమత్యము. మునులు వేఱుగాన్యూరు మనమిరువుర మేకహృదయులము మీరు పతి, నేను పత్ని. మీరు శ్రేష్ఠులు, నేను నికృష్టను. మీరు జ్ఞానులు, నే నజ్ఞానురాలను. మీరు యజమానులు, నే దాసిని!"

వినాయకుని యానందమున కవధిలేకుండెను. సుఖసముద్రము నడుమ నాతఁ డోలలాడుచుండెను. సాశ్రునయనుడై భార్యను గాఢాలింగనముఁ జేసికొని "ప్రాణేశ్వరీ! నీ వేమైన ననుము. నీవు నాకొనర్చిన యుపకారము లనంతములు. నే నవి మఱచిపోవునంతటి కృతఘ్నుఁడను కా" నని పలికెను.

లక్ష్మి మృదులాధరము పై చంద్ర రేఖవలె చిఱునవ్వు ప్రకాశించెను ఆమందస్మిత మర్థవిహీనము గాదు. తత్క్షణ మామె ఖిన్న వదనయై "అయితే నావలన మీ కేదో యుపకారము కలిగిన దని మీకు దోఁచినందుననే నాపై ప్రేమ నిల్పితిరా? పత్నీభావమున మీరు నన్ను ప్రేమించుటలేదు?" అని వచించెను.

"ఛీఛీ, అట్టియభిప్రాయ మెన్నటికి వలదు. తొలుదొల్త నీపై ప్రేమ లేనిమాట నిజమే. మీదుమిక్కిలి నీవనినచో నా కెంతో భయముగ నుండెడిది. నీపేరు విన్నంతనే నాగుండె తటతట కొట్టుకొనుచుండెడిది. నిజముగ పైప్రాణము పైకెగిరిపోయెడిది. కాని నీ విచటికి వచ్చినప్పటినుండియు నాభయమంతయు మాయమైనది. ఇంతియే గాక నీతో మాటలాడవలయు నని నాకిచ్ఛ వొడమినది. నీవద్ద

నట్టి మహిమాశక్తిగలదో పరమేశ్వరున కెఱుక! ఇప్పట్టున మాత్రము నీవుతప్ప నా కితఃపరము లేదు. నీవు లేనిచో నేనొక్క గడియ యైన గడుపజాలను!"

౩౧

సతీపతుల ప్రణయసంవాద మీరీతి జరుగుచుండ నింతలో వెలుపల నుండి "వినాయకరావు గారూ! వినాయకరావుగారూ! వినాయకరావు గారింట్లో నున్నారా? "అని యెవ్వరో కేకలు వైచిరి. వినాయకరా వది విని వెలుపలికి జనియెను. అంత రాధయు, మనోరమయు గదిలో బ్రవేశించిరి. మనోరమ పుట్టినిల్లు వినాయకుని యూరే.

లోపలికి రాగానే రాధ యిట్లు ప్రారంభించెను. అమ్మా విన్నావా! మనయూరి జాబాయికోడలు తెల్లవారుజామున బిడ్డను గన్నది. మగపిల్లఁడు పుట్టినాఁడు. పిల్లఁడు మాణిక్యమువలె నున్నాఁడని చెప్పను! దేవుఁడు నీకు కూడ నట్టి బిడ్డ నీయవలయునని నా కెంతో ముచ్చట. ఆతల్లి జగదంబ నాకోరిక నెప్పుడు నెరవేర్చునో నీకడుపునఁ గూడ సంతనలను పుట్టియింటిలో నాట లాడుకొనుచుండఁ గన్నులార గాంచి మఱి చావవలయునని కొండంత యాశతో నుంటిని. దైవ మేమి చేయ నున్నాఁడో!"

"మీ రెంగులకటుల చింతించెదరు! నాకుమాత్రము బిడ్డలు లేరా!" అని లక్ష్మి నవ్వెను.

"మన మంతటి నోములు కూడ నోచితిమా! అయ్యో నాపిచ్చి తల్లీ! నీకు బిడ్డ లెవ్వరే!"

"ఏమి! జగన్నాథుఁడు, రాముఁడు, ఎవరిబిడ్డలు!"

అనపేక్షిత మగు నీప్రత్యుత్తర మాలకించినంత నావృద్ధురాలి నేత్రయుగళ మానంద బాష్పములతో నిండిపోయెను. గద్గదికతో నామె "బిడ్డా! ఈశ్వరుఁడు వారికి సంపూర్ణాయు వొసఁగుఁగాక! వారు

పిల్లలగుట నిశ్చయము. కాని వారు నిన్నమ్మా యని పిలువరు కదా! యనెను.

“అమ్మా యని పిలుచుటకుఁ గావలసినచో నే సిదినమునుండి బాలకృష్ణు నట్లు బిలువ మని చెప్పినను, వాఁడు నన్నమ్మా యని పిలచిన మతి చాలునా!”

కోడలిపలుకులు ముఖ్యముగ నీకడపటిమాట లాలకించి రాధ యెట్టి యానందము నొందినదో చెప్పుటకు వలనుపడదు. “ఇప్పుడు నేఁబోయి బాలకృష్ణున కిది చెప్పద” నని యాముదుసలి యటనుండి వెడలిపోయెను. బాలకృష్ణుఁ డన్న నావృద్ధురాలికి ప్రాణము. రాధ యిప్పుడు మునుపటిరాధవలె నుండలేదు. ఆమె నేత్రములలోని జలవర్షము కొంతకాలమునుండి నిలిచిపోయినది. ఆమెజిహ్వాయంత్రము పూర్వమువలె నిప్పుడు రేయింబవళ్లు నడచుచుండుటలేదు. ఇంతియే కాక నాముదుసలి మోముపై నిప్పుడు కొంచెము వికాసము కూడ గాన్పించుచుండెను వృద్ధురా లిప్పుడు సంతుష్టురాలివలె గానవచ్చుచుండెను.

అత్తగారు బయటి కేగినతరువాత లక్ష్మి మనోరమ నుద్దేశించి “మనోరమా! నేను నీమొగ మిట్లు చిన్నబోయిన దేమి!” అని ప్రశ్నించెను.

పుట్టినింటికి వచ్చినప్పటినుండియు మనోరమ చాలవఱకు దిన మంతయు లక్ష్మియొద్దనే గడపుచుండెను. మనమున సకలవిషయములను, సమస్తదుఃఖములను, ఆమె లక్ష్మికడ దాపక స్పష్టీకరించుచుండును లక్ష్మియు ననేకవిధముల నామెను నూఱడించుచు, హిత వచనము లుపదేశించి దుఃఖోపశమన మొనర్చి యామెకు ధైర్యముఁ జెప్పుచుండును ఇందువలన పాపము మనోరమ కొంతవిధముగ నిం చుక శాంతి కలుగుచుండెను లక్ష్మిపలుకు లాలించి మనోరమ దీర్ఘ

నిశ్వాసము విడిచి యిట్లనెను. "ఏమోకాని యీదినమున నామన సెటులనో యున్నది. కారణ మేమియు నగుపడదు. ఏమిచేయుట కును మన సొప్పదు. ఇంతవఱకిట్టిమనస్తాప మెన్నడును ననుభవించి యెఱుఁగను. ఈదిన మిటులుండు టేటికో!"

అశ్రువులు మనోరమ నేత్రములు నిండి వచ్చెను. వడివడి నొక దానివెనుక నొకటొకటిగ నశ్రుబిందువు లూరలసాగెను. బాలిక తన మ్లానవదనమును మఱియొకవంకకు ద్రిప్పికొనియెను. అదిగాంచి లక్ష్మికోమలహృదయము నీరయ్యెను. అటులయ్యు తనమనోవేదన మనోరమకుఁ దెలియనీయక యూరకె నగుచు నిట్లనెను. యజమాను డింతదనుక రాడాయనే యను చింతయే నిన్నిట్లు వేధించుచున్న దని నే దలంచెదను కాని చెలీ! నీవు భర్తయే దైవమని వానిని మనంబునఁ బూజింపుచుంటివి మఱి యాతడు రాకపోయినను నీ మనసున నాతని నట్టే నిల్పి యేల ధ్యానించి తృప్తి నొందకూడదు? దైవము మన పాపచక్షువులకు గానవచ్చునా?

అది నిజమే! కాని పతి యన దైవము కాదా? "పతియనదైవ మనుమాట నిజమే! కాని యీదైవము కేవల మనఃపూజచేతను, ధ్యానముచేతను, దృప్తినొందదు. ఈదేవునకును మనకును బ్రత్యక్ష సమాగమము కావలయును. ఇట్టిదైవము నెల్లప్పుడు పావనస్థాన మైనహృదయపీఠమున నిల్పి యుంచవలయును కాని పరికించి చూడ నీ కేమియు నట లక్ష్యము లేదని తోచుచున్నది. దేవుని చరిత్ర విషయమున సరియైనదృష్టియుంచి చూచుకొనినచో ననేకసమయ ములం దది స్థానభ్రష్టత నొందును. దానిదర్శనము గూడ సంభవించుట తటస్థము గాకపోవును."

"కాని సఖి! మనకిరావిషయమునందు లక్ష్యముంచుట కేమి యవసరము? మన కేమి స్వాతంత్ర్యము?"

"దేవునిదర్శనము మనకు లభింపవలయు నను నిచ్ఛయున్నచో మన మీవిషయమున లక్ష్యముంచ నవసరమున్నది. స్త్రీజాతి కింతకంటె ముక్తియవసరమైం దేది! మనోరమా! నీకు యథార్థము చెప్పుము మాధవరావును జూచుటకై నీమనసు వేగిరపడు చున్నదా లేదా!"

శిశిరసిక్తప్రభాతకమలమువలె బాలికనేత్రద్వయము మరల నశ్రుధారాక్రాంత మయ్యెను. అల్పకాలములోనే యొకటి రెండు బాష్పబిందువులు కూడ నామె స్నిగ్ధకపోలములపై మెఱయ సాగెను, అపవిత్రదుఃఖాశ్రువులే లక్ష్మిప్రశ్నమునకు ప్రత్యుత్తర మొసగెను. మనోరమ కింక వేఱుగఁబ్రత్యుత్తర మొసఁగ నావశ్యకత లేదు. లక్ష్మితనచీరచెఱఁగుతో నామె యశ్రువులు దుడిచి వైచెను. అటుపిమ్మట మనోరమ కొలదికాలములోనే సుస్థిరయై "ప్రాణ మొసగినను, నిప్పు డొక్కసారి వారిదర్శనము నాకులభించునా చెలీ! యనెను.

అనుచుండ బాలికకు దుఃఖము పొంగి పొరలివచ్చెను. ఆమె పెద్దపెట్టునరోదన మొనర్ప దొడగెను. లక్ష్మియామెను జేరదీసి బుజ్జగించి శాంతవచనముల నోదార్చుచు ప్రియ వాక్యముల సిట్లనెను. "చెలీ మనోరమా! నీవిట్లు దుఃఖింపకుము. నీవంటి సాధ్వికి నీశ్వరు డెల్లప్పుడును కష్టములు కలిగింపడు. నీయట్టి పతిభక్తితత్పర యగుసాధ్విలలామ యొందునగానరాదు. నీభర్త వేశ్యాశక్తుఁడును, వ్యసనాసక్తుఁడును నై యున్నను నీవందుల కేమియు నిష్ఠురము లాడుట లేదు. అతఁడు ఘోరతర పాపపంకిలమున మునిఁగి యున్నను నీవాతని దేవునివలెఁ బూజించుచు చుంటివే! ఇంక నీపతిభక్తి కంతము కలదా! ఏసాధ్వికిట్టి యకృత్రిమ పతిభక్తి యుండునో యట్టిదానిని భగవంతుఁడు పతిసుఖవిముఖ నొనర్పఁడు. చెలీ! నామాట నమ్ముము రెండుదినములలో, లేక రెండుమాసములలో నీసర్వస్వము నీయాధీన

మగును. ప్రస్తుత మేదో దురదృష్టవశమున ననుభవింపవలసి వచ్చిన దానిని కొంతకాల మనుభవింపక తీరదు. దేవతలకు గూడ పురాకృత మనుభవింపక తీరదు. ఇక మనుష్యమాత్రుల మగుమనమాట చెప్పనేల!

లక్ష్మి వచించినప్రియభాషణములవలన మనోరమకు గొంతయూ టగలిగెను. ఇంతలో వినాయకరావు చేతనొక యుత్తరము బట్టి కొని మ్లానవదనుండై యట కరుదెంచెను. భర్తృవిషణ్ణ వదనమును గాంచినంతనే ఏమది, మీ మొగ మట్లు చిన్నబోయిన దేమి? ఏమియువిశేషములు లేవుకదా? యనిలక్ష్మి వేగిరపాటుతో నడిగెను.

భార్యమాటకుఁ బ్రత్యుత్తర మొసగకయే వినాయకరా వుత్తర మామెకందించి దీర్ఘనిశ్వాసమువిడిచి యచటనే నిలువఁ బడియెను. లక్ష్మికంపితహృదయముతో లోలోన నాయుత్తరమీక్రిందివిధముగఁ జదివికొనఁదొడగెను.

శ్రీ జగదీశ ప్రసన్న!

తీర్థస్వరూప రాజమాన్యరాజ శ్రీవినాయకరావు బాబుగారి సముఖమునకు——

తమ కుమారుఁడు జగన్నాథరావనేక త్రికాలాభివందనములొనర్చి చేయువిన్నపములు.

ఇచ్చట కుటుంబము మహావిపత్తున మునిగియుంటిమి. ఈదిన ముదయమున పోలీసువారు శ్రీనాయనగారిని, శ్రీమాధవరావు మామ గారిని ఖైదుచేసి తీసుకొనిపోయిరి. ఏదో ఫోర్జరీ చేసినట్లు వారిమీదఁ నేర మారోపించిరని మేము వింటిమి. ఏదుర్మార్గులు విరోధము వలన నీయపనింద దెచ్చిపెట్టిరో తెలియదు. ఇచట మాకెవరును సహాయ మొనర్చువారు లేరు. తుదకు ధైర్యమూ చెప్పువారైన లేరు. ఈసంకటము నుండి మమ్ముద్ధరించు భారము మీపై నున్నది.

మీకన్న దిక్కు వేరెవ్వరు? కాన నీవృత్తాంత మంతయు మీకు సవిస్తర
ముగ విన్నవించు కొంటిని. పెద్దలగుమీ రేది యోగ్యమని తోఁ
చునో యట్లొనర్పఁ బ్రార్థించెదను.

ఇట్లు తమప్రియబాలకుఁడు

జగన్నాథ సదాశివ దీక్షితుడు.

తా. క. మాతృశ్రీ మనోరమ అత్తగారికి గూడ నీసంగతి యంత
యును దెలియపలచ కోరెదను ఆ గా తండ్రిగారి నిటకుబంపఁ గోర
గను. ఇదియే విజ్ఞప్తి— తమ జగన్నాథుఁడు.

ఇట్టి యుత్తరము జదివి గొని స్తంభిత యై పోయెనుకాని యిట్ల
నెను "నిశ్చయముగా నెవ్వరో దుర్మార్గుల కుట్రయే యిది. ఇందుకు
సత్యమే జయించును. కాని యథార్థమును న్యాయమూర్తులు తెలిసికొను
నట్లు తగినసాక్ష్యము మొదలగు విషయము లిప్పటినుండియు మనము
జాగ్రత్త పుచ్చుకొనక పోయినచో తప్పక చిక్కులు వచ్చి
తీరును. ఇంక గాలుసేతులు జాచుకుని చింతించుచు కూర్చున్నచో
లాభము లేదు. తడవు చేసిన కొలది నిష్టము సంభవించును. ఈయు
త్తరము దీసికొని వచ్చిన మనుష్యుని కొంచెముగా లోనికి రప్పింపుఁడు.
అచట జరిగిన సంగతి యంతయు సవిస్తరముగ దెలిసికొందము.

వినాయకరావు నౌకరును లోనికి బిలిచెను. ఇంతవఱకు మనోరమ
స్తబ్ధయై యూరక యంతయు వినుచుండెను. తనసర్వస్వమును
ఈదినము పోలీసువారు జప్తుచేసి దీసికొనిపోయి రని యి తవఱ కామె
తెలిసికొననే లేదు. ఆమె యింతవఱకు నెవరికో యేదో మహాపద
సంభవించిన దని తలంచు చుండెను కాని నౌకరును గాంచి నంతనే
యథార్థస్థితి యామెకు దెలిసిపోయెను. నౌకరు మనోరమను జూచుట
తోడనే వెక్కివెక్కి యేడ్చుచు జరిగినసంగతి యంతయు విశదీకరిం
చెను.

మనోరమ మొట్టమొదట సమస్తవృత్తాంతమును వినియెను. నోటి వెంట మాటలేదు. స్వేచ్ఛాశ్వాసముకూడ లేదు. కాని తుదకు చూచుచుండగనే తాను మూర్ఛితయై గుభాలున భూమిపైబడియెను.

౩౨

నానావిధోపచారములవలన మనోరమ మూర్ఛనుండి తేఱి యించుక స్మృతి బొందెను. లక్ష్మి తాను ననేకవిధముల నూరడించి యిట్లనెను "చెలీ మనోరమా! నిజముగ నీభర్త యపరాధి యైనచో భయపడవలసిన యవసరము లేదు. సత్యమును రక్షింప భగవంతుం డున్నాఁడు సుమా! ఈ కేసు బొంబాయికి వెళ్ళినదని వినుటచే నాకెంతో ధైర్యము కలిగినది. నావిషయముగా భావించి వారిని విడిపించుటకై ప్రయత్నము చేసెదను. నీ వేమి తలఁచుచుంటివో కాని యీవిషయమున మనకు జయము కలుగు నని నావిశ్వాసము"

ఎల్లరు చకితులై లక్ష్మివంక జూచుచుండిరి. వినాయకరావు తుదకు దీర్ఘనిశ్వాసము విడిచి "ఎంతయినను నీ వాఁడుదానవు. ఈపని నీవలన నెట్లు నెఱవేఱఁగలదు?" అని యడిగెను.

ఆసమయమున లక్ష్మి యిట్లనెను. "ఏమి గురు! మేమాఁడువారల మగుటవలన నీ గాత్రపుఁ బని మావలన సానుకూలము కాదా! అనేకవిషయములలో బురుషులకన్న మేము బలహీనల మగుట నిజమే కాని, నూత్నవిషయముల గనిపట్టి కష్టములనుండి విముక్తులఁ జేయుట మావలన గాకుండునా యేమి?"

పతివ్రత వాక్కు లాలించి వినాయకరావు మిక్కిలి యచ్చెరువు నొంది యిట్లనెను. "నీవు కోపము తెచ్చుకొనకుము. నీ బుద్ధి, నీసామర్థ్యము, మొదలగున వన్నియు నే నెఱుఁగుదును. కాని యిట్టియాపదలలో నీవలన నెట్లు సాహాయ్యము కలుగునో నాకు దోఁచకున్నది."

"ఆపదలు వచ్చిన వని కలవరపడి యంతయు మఱచినను చేయ

వలసినదానిని మఱతువా? మామేనమామ బొంబాయిలో ప్రసిద్ధి కెక్కిన బ్యారిష్టరను విషయము నాతలపునకు రాకయున్నా? వారి సాయమువలన నే నీసంకటమునుండి వారిని విడిపింపఁదగుప్రయత్న మొనర్చెదను. రేపటి తెల్లవారుజామున నే మనము బొంబాయికి బయలుదేఱవలయు నని నా యభిప్రాయము."

ఇంతలో రాధ యట కరుదెంచెను. కొడుకు పై వచ్చిన కేసు సంగతి తెలిసినతోడనే వృద్ధురాలిమనసు వ్యాకుల మయ్యెను. ఆమె పెద్దపెట్టున రోదన మొనర్ప సాగెను. చాలకాలమునుండి శ్యాముడు నలి యేడ్చు టెవ్వరును జూడలేదు.

నానావిధములగు సమాధానవాక్యములతో లక్ష్మి యత్తగారి నూరార్చెను. తనకొడుకును విడిపింప బ్రయత్నించుటకై తనకోడలు బొంబాయి కేగు నని తెలిసినమీఁదట రాధ కింతో ధైర్యము కలిగెను. ఇప్పుడా వృద్ధురాలు తనపుత్రుఁడు నిశ్చయముగ నయ్యాపద నుండి విముక్తుఁడై నట్లు తలంచెను. ఏవిషయమున వినాయకునకు విశ్వాసము లేకుండెనో యావిషయమున రాధకు పూర్ణవిశ్వాసము కలిగినది! పాపము హతభాగిని యగుమనోరమ నెన్నియో తెన్నుల నూరార్చి వారందఱా మె నింటికి చేర్చిరి.

మఱునాఁడు తెల్లవారుజామున బయలుదేఱి తగుసమయమునకు వినాయకరావు భార్యాసహితుఁడై బొంబాయికివచ్చి చేరెను. లక్ష్మి మేనమామ "గిర్గాం" లో నుండెను. తన మేనగోడలు నాతిభర్త యాకస్మికముగా నగుదెంచుటచే మేనమామయు నాతనిభార్యయు మిగుల నానందించిరి. మేనమామను గాంచినంతనే లక్ష్మి యాతని పాదములపై బడి "మామా! మమ్ము జుట్టికొన్న యీభయంకర విపత్తునుండి రక్షించుటకు నీవు తప్ప నింకెవ్వరును లేరు" అని విలపించెను.

మామగారి కిది యేమియుఁ దెలియలేదు. అతఁడు మహావిస్మయమునఁ బడియెను. ఇవెగాంచి వినాయకరా వాతనికి సమస్తవృత్తాంతమును నివేదించెను. లక్ష్మియన్న మేనమామ కెంతో ప్రాణము. ఆమె నోదార్చి యాతఁడిట్లనెను. "అమ్మా దీనికై నీవు నాకడ నిట్లు జాలిగదుర పరితపించెద వెందులకు! ఎంత వెఱ్ఱి తల్లివి! లెమ్ము నా ముద్దులలక్ష్మిపై వచ్చిన యాపద నామీఁద వచ్చినట్లు కాదా! నీవేమియుఁ జింతింపకుము వినాయకరావూ, మీరు కూడ స్తిమితముగ నుండుఁడు. వారిని విడుదల చేయుటకై నాచేతనైనమట్టునకు ప్రయత్నించెదను"

అని మేనమామ యగుశ్రీధరపంతులు బొంబాయిలో ప్రఖ్యాతి వహించిన బ్యారిష్టరు. కోర్టులో నీతఁడన్న నెంతయో గౌరవము. శ్రీధరపంతులు వకాలత్ నామా పుచ్చుకొని దానిలో సహియొనొందుట బహుశః ఎవ్వరును జూచియుండరు. తొందర తొందరగ భోజనము నొనర్చి యాతఁడు పోలీసుకోర్టున కేగెను. కేసువృత్తాంతమంతయు దెలిసికొని ఛీఫ్ప్రెసిడెన్సీ మేజిస్ట్రేటువద్ద ముద్దాయిలను జామీను మీఁదట విడుదలచేయు విషయమున వెంటనే పిటీషను పెట్టెను. కాని వానిప్రయత్నము వ్యర్థమైపోయెను. శ్రీధరపంతులు తానే జామీనుండుటకు సిద్ధపడియెను. కాని మేజిస్ట్రేటిట్లనెను. ఏవిధముగను మీవిన్నతి నంగీకరించుటకు నాకు వీలుపడినది కాదు. ఇందుకు నేను మిగుల చింతించుచుంటిని. అయినను మీరు సరిగాతగిన యేర్పాటులన్నియుఁ జేసికొనుటకు తగిన యవకాశము సంతోషపూర్వకముగ మీకొసఁగుచుంటిని.

యథాసమయమునకు విచారణ ప్రారంభమయ్యెను. బ్యాంకిలోని యుద్దతుముగ్గు రుద్యోగులయొక్కయు, చెక్కు నొసఁగిన వానియొక్కయు, వాఙ్మూలము మొదట తీసికొనిరి. ఆసాక్ష్యమువలన మేజ

ట్రస్టీలు కేసు సెషన్సుకోర్టుకు కమిటు చేసినట్లు తనయభిప్రాయము ను కనబఱచెను. కేసు స్వభావ మంతయు జూరీ శ్రీధరపంతు లాదుల కంగీకరించెను. సెషన్సువిచారణదిన మింకను రెండుదినములుమాత్రమే యుండెను. అట్లగుట ముద్దాయీలు జైలులో విశేషకాలము నిరాశులై కష్టపడవలసిన యోగము తటస్థింప లేదు.

సెషన్సు కోర్టులో ఇరుల సాక్షు లందఱి వాఙ్మూలములుతీసికొనిరి. ఆ కాలమున శ్రీధరపంతులు బొంబాయిలో ప్రఖ్యాతబారిష్టరై యుండుటచేతను, ఈ కేసులో నాతఁడు పూనుకొని పని చేయుటవలనను సాక్షు లందఱు నాతనికి వెఱచి యాతని యభిప్రాయాను సారముగ వర్తించుట కంగీకరించిరి వారి వాఙ్మూలములోని యసంబద్ధత జడ్జిగారికి జూరరులకును స్పష్టపఱచి ముద్దాయీల నిరపరాధిత్వ మును బారిష్టరుగారు వారికి మిగులనమ్మకము గలుగునట్లు నచ్చ బలికిరి ముద్దాయీల తరపు వారి మానసము లెల్ల సంతోషవికసితము లయ్యెను.

"నిర్దోషు లని యేక వాక్యముగ విడిదిపుచ్చ జూరీ లాలోచించు చుండ సంతలో మాధవరావు జడ్జి నుద్దేశించి యింగ్లీషుభాషలో ధారాళముగ నిట్లనెను విఙ్ఞస్వాములు న్యాయమూ ర్తి! జూరీ లోని యోగ్యగృహస్థులారా! నేనుగొంత చెప్పవలసి యున్నది. చిత్త గింపుడు. మీదృష్టికి నేను నిర్దోషినని తోఁచినను, ఈశ్వరుని సమ్ముఖ మున నేను మహాదోషిని. నాతరఫున మహావిద్వాంసుఁ డగు బారిష్టరు గారు తమయుపూర్వకౌశలమువలన మీకన్నులలో దుమ్ముకొట్టెను. కాని పరమేశ్వరుని కన్నులలో దుమ్ముగొట్ట నాతనివలన గాదు. నే స్పష్టముగ నొప్పుకొను చుంటిని. ఈయపరాధము నేజేసితిని. నాతో సమానముగ బోనులో నిలుచున్న నాబావమఱది సదాశివరావు మాత్రము నాతో గూడ నిష్కారణముగ కష్ట మనుభవించుచున్నాఁడు.

స్వహస్తమున నాచెక్కు మార్చుట కాతని కొనగితిని. ఈతఁడు దానిని మార్చి రొక్కమంతయు గాకు దెచ్చియిచ్చెను. ఈ చెక్కు వ్యవహారమం తేఁ డేమియు నెఱుంగఁడు. ఇందుల కెట్టి శిక్ష విధింపవలసి యున్నను నది సంపూర్ణముగ నాకే విధింపుఁడు. ఇంతియే కోర్టువారికి నే విన్నవించుకొనునది.

మాధవరావునోటినుండి వెలువడిన యీపలుకు లాలించినంత కోర్టులో నున్న వారందఱు స్తంభితులై పోయిరి. బారిష్టరు గారిశిరము పైన వజ్రాఘాతము బడినట్లయ్యెను. మాధవరావును చిన్నకుఱ్ఱడని రెండుమూఁడుసారు లాతఁడు కన్నుసన్నచేయుచు, నడుమనడుమ వారింపఁ బ్రయత్నించెను. కాని మాధవరా వదియేమియు లక్ష్య పెట్టలేదు. ఇంక బారిష్ట రూరకుండలేక పోయెను. అతఁడు లేచి కోర్టు వారి కీక్రింది విధమున విన్నవించు కొనియెను.

"ముద్దాయితల తిరుగు చున్నది. అతఁడు బుద్ధివిహీనుఁ డయి నాఁడు. తా నపరాధి నని యొప్పుకొనుచుండుట కూడ నాతఁ డెంతమం తయు నెఱిఁగియుండఁడు. విజ్ఞులైనవారు నగు నో న్యాయమూర్తీ! జూరీలోని సద్గృహస్థులారా! పోలీసువారివలన నన్యాయముగ నిట్టి యవమాన యావమానము సంభవించెనేని మర్యాదగల మానవున కెవ్వని కైనను బుద్ధిభ్రంశము కలుగక మానదని సర్వజ్ఞు లగుమీరెఱిఁగి యే యుందురు. కాన కరుణామయు లగు న్యాయాధీశులు ముద్దాయి యొక్క యీ యసంబద్ధప్రలాపము నేమాత్రమును లెక్కగొనక విడిచిపుత్తురు గాక యని ప్రార్థించుచున్నాను."

కాని యేమిలాభము! బారిష్ట రింకను కుర్చీపై గూర్చుండెనో లేదో యప్పుడే మాధవరావు మరల నిట్లు ప్రారంభించెను. "బారి ష్టరుగారు వచించినది పొరబాటు. నా కేమియు మనశ్చాంచల్యము లేదు. నన్ను విడిపింపగలందులకాతఁ డెంతయో శ్రమపడి తన

చాతుర్య మంతయు వినియోగించెను. ఇంగ్లండు వారికి నేను యావజ్జీవము కృతజ్ఞుడ నై యుందును. నా యీ పరిశ్రమకును చాతుర్యమునకును తగుఫలితము కోర్టువారియొకట ప్రార్థనాపూర్వకముగ నేవల దని కోరుచుంటిని. ఈపరమపాతకుఁడు కేవల మీయపరాధమే చేసియుండ లేదు. ఇంక ననేక పాతకములచే నీ బాధముఁడు తనచరిత్రకు కళంకము దెచ్చికొనియెను. అందుకు తగిన ప్రాయశ్చిత్తమనుభవించిన గాని చరిత్ర సంశోధన మొనర్చు సద్బుద్ధి కలుగ నేరదు. కేవల మిదే కారణమున కై న్యాయాధీశుల కన్నులలో దుమ్ముగొట్టి యీపాప జీవితమును సహించుటకు నాకేమాత్రమును నిష్టము లేదు'' తరువాత వినాయకరావువంక కుదిరిగి యాతఁడిట్లనెను. "వినాయకరావు! మీయన్నగారిని దీసికొని మీ రింటికి నరుగుడు. పాతకియగుమనుష్యుని సంగమువలననే యాతనికి కూడ నీయవమానము సంభవింపవలసివచ్చెను. నీయొక్కయు, నీభార్య మేనమామయొక్కయు నుపకారము నే నాజన్మాంతము మఱచిపోను!''

నిరాతంకనిష్కంపితదీపజ్యోతివలెను, ప్రశాంతసముద్రమున గానవచ్చు గంభీరసముద్రమువలెను, కోర్టంతయుఁ గొంతపడి మిగుల శాంతముగను స్తబ్ధముగను నుండెను. అందఱు చిత్రప్రతిమలవలె తటస్థముగ నుండిరి. తుదకు జూరీయభిప్రాయము మారి "ముద్దాయి యగుమాధవరావుదోషి. కాని కోర్టువారు నాతనిని క్షమించవలయు నని'' వారు సిఫారసు చేసిరి. న్యాయాధీశుఁడును జూరీలసిఫారసునందు సంపూర్ణలక్ష్యమునుంచి ముద్దాయి మాధవరావునకు సంవత్సరము కఠినశిక్ష విధించి సదాశివరావు నిర్దోషియని స్థిరపఱచి విడచిపుచ్చెను.

## 33

కోర్టుబోనులో నుండి బైటపడగనే సదాశివుఁడు వెక్కి వెక్కి యేడ్చుచు తనకనిష్ఠ భ్రాత నాలింగనము చేసికొనియెను. అతని నోటివెంట మాటలేదు. కొంతపడి కతఁడు పెద్దపెట్టున రోదన మొనర్పదొడగెను.

బాష్పోదకముచే వినాయకుని వక్షస్థలము తడిసిపోయెను. కొంత కాలమునకే యయ్యిరువురు పరస్పరానందాశ్రువుల దుడిచివైచిరి. అందఱును గలసి శ్రీధరపంతులుగారియింటికి వచ్చిరి. తనసోదరుని విడుదలకు వినాయకురావెంతటియానందమును బొందుచుండెనో యంతకు నిమ్మడిగ మాధవరావును విడిపింపజాలనందులకంతకధిక దుఃఖము ననుభవించుచుండెను. గుమ్మములోనికి రాగానే వీరిరాకకై యెదురుచూచుచున్న లక్ష్మియింటిలోనుండి వీధిద్వారముకడకుఁ బరుగిడి వచ్చి "ఏమయిన" దని మిక్కిలి యుత్కంఠతతో నడిగెను. వినాయకరావు చెప్పలేక యిట్లనెను "కార్యము సందు సగము మనకు నైనది. మాతమ్ముఁడుగాఁ నిర్దోషి యని స్థిరపఱచి విడచి పుచ్చిరి కాని పాపము మాధవరావున కొక్కవత్సరము కారాగృహవాసశిక్ష—"

లక్ష్మి వ్యధితాంతఃకరణయై "మాధవరావుకొఱకు మామామయ్య యంత శ్రద్ధగా పనిచేయలేదని తలంచెద" నని పలికెను. వినయకరావు తద్వృత్తాంతమంతయు సవిస్తరముగ భార్యకుఁ దెలిపి "మా మేనమామ వారిరువురివిషయముననుగూడ నొక్కటే విధముగ నెంతయో శ్రమపడి పనిచేసిరి. కాని మాధవరావు తనకుఁ దానే కారాగృహములోనికి కేగ "నని చెప్పెను.

లక్ష్మి అత్యంత చింతాతురయై "మనోరమ నింక నేనెట్లూఱడింతును! ఆసాధ్వీమణి కెప్పటికి నూఱటలేదు. మాధవరా విప్పుడు నిశ్చయముగ పశ్చాత్తప్తుఁడై తనకుఁ దానే స్వయంకృతాపరాధమునకుఁ బ్రాయశ్చిత్త మనుభవింప నిప్పుడు ప్రారంభించినాఁడు. అదియట్లయిన నుండనిండు. దీనిబట్టిఁ జూడ తుదకు మనోరమకు శుభప్రద మగునట్లే తోఁచుచున్నది."

వినాయకరావు విస్మితుఁడై "ఇంకను మనోరమకుఁ గలిగిన బాధ యేమి!" యని యడిగెను.

"అపరగుణదయాళుఁడు పరమేశ్వరుఁ డేదిచేసినను నా కిది యంతయు మనమంచి కొఱకే. మనోరమ ప్రస్తుతప్రవృత్తివలన నామెకు భర్తృవర్తనమును నిరోధించుట యిప్పటికిఁ సాధ్యముకాదు. పతి దుర్మార్గప్రవృత్తుఁడై యున్నప్పుడు యుక్తిమైన వానిని సన్మార్గమునకుఁ దీసికొనివచ్చుటకై భార్య ప్రయత్నించవలయును. ఈ విషయము మనోరమ మనసునకు స్ఫురింపలేదు. ఆమెముఖమున నేనే విన్నదానిబట్టియే నేనిట్లు చెప్పుచుంటిని. ఆమె పుట్టినింటికి రాక పూర్వము అనగా మాధవరావు నడవడి గాడితప్పు సమయముననే యామె యాతని కించుక సాయ మొనర్చి యుండినచో మాధవరా విప్పటి దుర్దశలకుఁ బాలుగాక యథార్థముగ నప్పుడే మరల సన్మార్గానువర్తియై యుండును. కాని యామె యటు లొనర్పక తా నిచటికిఁ బయలుదేఱి వచ్చెను. అందువలన దిరిగి మాధవరా వధఃపతనమార్గమునఁ బ్రవృత్తుఁ డయ్యెను కాని మనోరమవంటి సాధ్వీమణికి సంతతపతి సౌఖ్యానుభోగము? ఇంతయు నాకే సుమా మాధవరా విప్పుడు కారాగృహవాసశిక్ష ననుభవించుట. ప్రస్తుతము మనోరమవలన నెట్టిసహాయమును పొందకుండగనే మాధవరావు స్వచరిత్రసంశోధన మెట్లు నిశ్చయింప నగునో యామార్గమునే యాతఁ డవలంబించెను. అగ్నియందుఁ గాల్చి రంధ్రముఁ బొడవనిచో బంగారము ముడివేయుట కెట్లు వీలుపడును?

"నిశ్చయముగ నిదియంతయు నేఁడో వానియిచ్ఛయే. జగదీశ్వరుఁ డేయుద్దేశమున నేవిషయము ఘటింపఁ జేయునో యని యల్పబుద్ధు లగుమానవుల కగమ్యము. సరే కాని మన మిప్పు డిచట వృథాకాలయాపన మేల చేయుచున్నాము? అచట మాయమ్మ యెంతయో దురపిల్లుచుండును."

కాని శ్రీకరపంతు లాదిగము వారిని జోసీయఁ లేదు. మఱునాటి ప్రొద్దిటిబండికి బొంబాయినుండి వారు తిరిగి తమయూరికి వచ్చిరి. సదాశివుని గాంచినంతనే రాధ యానందము బట్టశక్యము కాకుం డెను. సదాశివరావు సజలనయనుఁడై తల్లిపాదములఁబడి యామెను మన్నింప వేడుకొనెను. వృద్ధురాలు కొమరుని బాష్పములు దుడిచి వాని నూరడించెను. వీరందరువచ్చిన సంగతి వినినంతనే మనోరమ లక్ష్మివద్దకుఁ బరుగెత్తుకొని వచ్చెను. మనోరమను జూచి నంతనే లక్ష్మిమనసెంతయో వ్యాకులమును బొందెను. “చెలీ! ఏమైనది?’ అని చింతాతురస్వరమున మనోరమ వచ్చుచునే యామెను బ్రశ్నించెను.

ఇట్లు బ్రశ్నించుచు మనోరమ కరుణాజనక దృష్టితో లక్ష్మివంక వీక్షించెను. ఆమెకు నిజవృత్తాంత మెఱింగించుట కెంత ప్రయత్నిం చినను వానికి సాహసము కలుగలేదు. మనోరమయెదుట మాధవుని యథార్థవృత్తాంత మతిగుప్తముగ నుంచునట్లు వారందఱు స్థిరపఱచి కొనిరి. లక్ష్మి స్థిరచిత్తయై గంభీరముగ నిట్లనెను. “సఖీ మనోరమా! అంతయు శుభ మయ్యెను ఈశ్వరునికృపవలన తలపెట్టిన పనియందు మనకు జయమే కలిగినది. కాని నీపతి మేము తెచ్చినను మావెంట నిటకు వచ్చుట కంగీకరింప లేదు. అమ్మా! ఆతఁడిప్పుడు నిజముగ పశ్చాత్తప్తుఁడై యున్నాఁడు. ఒక్క సంవత్సర మజ్ఞాతవాసమున గడపి స్వయంకృతాపరాధమునకుఁ బ్రాయశ్చిత్త మనుభవించినంత నాతఁ డిచ్చటి కరుదెంచును. ఇటులీవత్సరము గడచి యాతఁ డిచ్చటికి వచ్చినంత నప్పుడు నీ యానర్వస్వముపై కేవలము నీయధికారమే యుండును గదా చెలీ! నీవిప్పుడంతగఁ జింతనొందకుము.”

మనోరమ అన్న వదనము కొంచెము ప్రఫుల్ల మయ్యెను. ఆమె వెంటనే యిట్లనెను. “ఎంత భయంకర విపత్తు నుండి విముక్తులైరి. నా కంతియే చాలును. వారికచ్చట సుఖముగ నుండునో యచ్చటనే

సంతోషముగ నుండనిమ్ము. కాని చెలీ! ఇంతటి భయంకరపాప కార్యము వారు చేసిరని నే నమ్మజాలను. నిష్కారణముగ వారిపై నీయపనింద వచ్చినది. వారు నిర్దోషు లని నా యభిప్రాయము. వారిచరిత్రకుఁ గళంక మనునది యెప్పుడును సంభవింపనేరదు. వారికష్టము లన్నియు ననుభవించుటకే యీ పాపిష్ఠురాలి యదృష్ట దోషఫలముననుమా!"

ఇంతవఱకు లక్ష్మి మన స్సెట్టి యస్వస్థతయు బొంది యెఱుఁగదు. కాని మనోరమయొక్క సరళప్రకృతి, సరళప్రేమయొక్క గంభీరత మొదలగునవి మనసున స్ఫురించుటతోడనే లక్ష్మి నేత్రద్వయము మశ్రుపూరిత మయ్యెను. ఆమె తన యశ్రువులఁ దుడిచికొని యిటనెను. "సఖీమనోరమా! నీయట్టి నవనీతహృదయు లీపృథ్వీతలమున నతిదుర్లభురాలు అది చూచి నేనెప్పుడును నీవంటి యంతఃకరణము కావలయునని యభిలాషపడు చుంటిని. అమ్మా! నీ యీసద్గుణసంపదలవలననే నీవు సుఖవతి వయ్యెదవు. నామాట గట్టిగ నమ్ముము."

లక్ష్మివాక్కప్పటికి సన్నృతము కాదని మనోరమకు గట్టినమ్మకము. అందువలననే లక్ష్మిపై మనోరమకుఁ బ్రాణముకంటెఁ గూడ నధిక ప్రేమ. అప్పుడు లక్ష్మి పలుకులవలన నామె తనకుఁ దానే సమాధానపడియెను. ఆమె యీసంవత్సర మెప్పుడు గడచునా యని దినములు లెక్కపెట్టుకొను చుండెను. ఎల్లప్పుడును లక్ష్మి సహవాసమున వేళబుచ్చుటయం దామెకు మిగుల నిష్టము. లక్ష్మికి విశ్రాంతి తీరికఁజాలు. 'రామాయణము మహాభారతము' ఇత్యాది గ్రంథములలోని నానావిధోపదేశరూపకపూర్ణవిషయముల నామెకువినిపించు చుండును.

## ౩౪

జగన్నాథుని రాముని నిచటికి దీసికొని రమ్మని లక్ష్మి సదాశివరావు నెంతయో బతిమాలుచుండెను. సదాశివు డింటికి వచ్చి వారము గడచినది. ఇచటికి వచ్చినప్పటినుండియు వాని సంతోషమునకు పరిమితి లేదు. ఇల్లు వాకిలి తోట మొదలగున వన్నియు నూతన వ్యవస్థితములై యున్నతి నొందుట గాంచి యాతఁడు విస్మితుఁ డయ్యెను. సర్వత్ర లక్ష్మిప్రశంసన మాలకించియు సంసారము సందర్భమునందామె కట్టుబాట్లును, దక్షతయు స్వనేత్రముల దిలకించి యాతఁ డాశ్చర్యనిమగ్నుఁ డయ్యెను. విశేషముగ నామె సంసర్గము వలన దనసోదరునివృత్తియందు గాన్పించుచున్న స్థిత్యంతరము కన్నులార జూచి లక్ష్మియెడ దేవివలె లోలోన నాతడు భక్తుడయ్యెను. సంసార మన నిప్పు డాతనికి స్వర్గమువలె దోచెను. ఈసమయముననే పార్వతినామెబిడ్డలను దీసికొని రమ్మను లక్ష్మివేడికో లాతనిచెవిని బడియెను. సదాశివుడు తనలో నిట్లనుకొనెను. "లక్ష్మి! ఈస్వర్గధామమునందు నివసించుటకు నీసోదరి పార్వతి యిసుమంతయు నర్హురాలు కాదు. దాని నిచటికి దోడ్తెచ్చినయెడల నీనందనవనము మరల శ్మశానవాటిక యగును."

సదాశివు డామెతో స్పష్టముగ నిట్లనెను. "దాని నిచటికి దీసికొనివచ్చిన ప్రయోజన మేమియు లేదు. జగన్నాథుని రాముని మాత్రమిచటికి గొనివచ్చుటకై నేనిప్పుడే మనుష్యుని బంపెదను"

లక్ష్మి కిది యేమియు రుచింప లేదు. రాధయు వినాయకుడును గూడ పిల్లల నిరువుర మాత్రమెదీసికొని వచ్చుట కనుమతింప లేదు. అప్పు డింక జేయునది లేక సదాశివుడు తన భార్యకూడ యిచటికి వచ్చుట కంగీకరించెను. మంచిరోజు జూచి బాలకృష్ణుని దాసి సఖూబాయిని పార్వతిపుట్టినింటికి ప్రయాణము చేసిరి. పోవుచు

పోవుచు బాలకృష్ణుడు లక్ష్మికడ కరుదెంచి నమస్కార మొనర్చి యిట్లనెను, "వదినే! జగన్నాథుని రామని దీసికొని వచ్చుటకై నేనేగుచుంటిని. సరే కాని యచట గలయింకొకవదిన నిశ్చయముగా నీవంటిది కాదు. నేనేమియునామెను వదినే యని పిలువ జాలను. నీవు దీనికి సమ్మతించినమొదల నామె నిచటికి దీసికొని వత్తును."

లక్ష్మి నవ్వుచు "పొమ్ము మూర్ఖుడా! ఆమె నాకంటెను పెద్దది. కావున నీ కామె నాకన్నను పూజ్యురాలు" అని పలికెను.

"వదినే! నీ వా సంగతి విడిచి పెట్టుము. ఇప్పుడు కానరాక పోయినను నేను మీయిరువుర నొక్కచోట జేర్చినచో దాని సంగతి యంతయు నప్పుడే తెలిసివచ్చును. గుఱ్ఱము మైదానము దాపుననే వచ్చినది లే! మావదినవంటివదిన యీభూలోకమున నెచ్చటను దొరక దని నామనోనిశ్చయము!"

ఇట్లని బాలకృష్ణుడు నవ్వుచు బయటికి వచ్చెను. దాసికూడ నచ్చటనే యుండెను; పార్వతిని పుట్టినింటికి జేర్చి వచ్చిననాటనుండి యు పాపమీవిషయము దాసిమనసును కలగుండుపడ జేయుచునే యుండెను. ఈదినము పార్వతిని తిరిగి తీసికొని వచ్చునుద్యోగము దానిపై బడుటచేత దానికి గలిగిన సంతోషము కడువున నిమిడినది కాదు "అమ్మా! అమ్మా!" యని యఱచుచు నది యింటిలో నున్న రాధకడకు ఎచ్చిసంతోషమున బరవశయై "అమ్మా! యీడాక నేనోరు మూసుకుండాను యేమంతమవాళ బాగ్గెవని చెప్పను! మాదొడ్డిల్లాలు గొప్పింటిపిల్లై యుండి యిట్లా అబద్దా లాడు తుందా! నాయింటి కొచ్చి నాతో మాయయ్యకు చానాజబ్బుగా వుండాది. చేగేమెల్లాలి. అందుకని నీవుకూడా నాతో వద మన్నది. నేనల్లి ముందీదకు దీసుకొస్తా మఱియిదంతా నిబద్దో యుఱ్ఱ

ద్దమా తెలిపిత్రా. అమ్మా యేంచెప్పను! మీపాదాలు సోక్చి ఆనాలనుంచి నాకు" అనుచు సఖీబాయి రోదనమున కుపక్రమించెను. రాధ యెట్లో దాని నోదార్చి పంపించెను.

ఇప్పట్టునమాత్ర మత్తయింటికివచ్చుటకు పార్వతియేమియు సత్యాంతరము చెప్ప లేదు. కత మే మన సఖియోగపర్యవసానమేమయ్యెనో యదియునామెయుందే యెరిగి యుండెను. సదాశివరావు విచటికిరాక బొంబాయినుండి యింటికి వెడలిపోవుటచే నామె యెంతో దుఃఖిత యయ్యెను. కాని యాదుఃఖము వెంట వెనుకటివలె నామె యుత్సాహమేమియు ప్రజ్వలితము కాలేదు. జానకీ బాలకృష్ణులవెంబడి నామె వెంటనే యత్తవారింటికి బయలుదేరివచ్చెను.

జగన్నాధుఁడు, రాముఁడు రాగనే రాధయానందమున నధీరయై పోయెను. బండిలోనుండి దిగగనే యాబాలకు లిరువురును నాయనమ్మను గ్రుచ్చుకొని వదల రైరి. ముందుగ నెవరిని దగ్గరకు దీసికొందునా యను విచారముచే నావృద్ధురా లధీర యయ్యెను. ఇంతలో లక్ష్మి చిన్నవాఁడైన రామునెత్తి చంకసిడుకొనియెను. జగన్నాధుఁడు నాయనమ్మను విడువలేదు. రాధ జగన్నాదునెత్తికొనియెను. "ముందుగ నేనే మా నాయనమ్మను వశము జేసికొంటిని. కాఁబట్టి నేనే గెలిచితిని. మా రాము ఓడిపోయె" నను యోచనచే జగన్నాధునిముఖకమలము ప్రఫుల్లమై కనుపట్టెను.

లక్ష్మియుంగూడ ప్రేమముతో పార్వతిహస్తము బట్టికొని యింటిలోనికి దీసికొనివచ్చెను. పార్వతి యత్తగారికి నమస్కరింపగనే రాధ మనఃపూర్వకముగ కోడలి కనేకాశీర్వాదము లొసగెను. పెద్దకోడలి సర్వాపరాధములును నావృద్ధురాలిప్పుడు మఱచిపోయెను. ఈదినము జగన్నాథుని, రాముని దీసికొని మహానందమున నామె వారి కన్నుపాపను లిడుటయందు నిమగ్న యయ్యెను. లక్ష్మి పుట్టింటి

నుండి యత్తవారియింటికి వచ్చినప్పు డూరంతయు నెటుల మహో త్సాహముగ నామెను గాంచుటకు వచ్చెనో యట్లు నేడెవ్వరు రాలేదు. పెద్దకోడలి యాగమన మెవరికి నేమియు నాహ్లాదజనకము గా లేదు. ఎవ్వరికి నామెను చూడవలయు ననుకోరిక కూడ కలుగలేదు.

తోడుకోడలి నింటిలోనికి దీసికొనివచ్చి కూర్చుండబెట్టినవిమ్మట లక్ష్మి మిగుల వినయముతో నిట్లనెను. "అక్కా! నాయట్టి తెలివి మాలిన పిల్ల పై నీసంసారభార మంతయు బారవైచి మీ రింత వఱకు నిట్లు నిశ్చింతముగ నెట్లుంటిరి?"

"ఏమిచేతునమ్మా! అత్తగారియెదుట నాకుండుట కాధారము లేక. నన్ను గాంచినచో నామెకన్ను లోర్వవు. మఱి నే నేమి చేయుదును?"

అక్కా! అత్తగారిమాటలిప్పుడుమన మొకలెక్కగ గొనవచ్చునా? పాప మిప్పు డామె వృద్ధురాలైనది ఆమె పలుకులకు మన కలుక యెందులకు?

"లేదమ్మా రెక్కలు విఱుచుకొని పాటుపడు చున్నను నెక్క డో కొనివేసిన ట్టుత్త పుణ్యానికి విధివిలాసము లేకుండ నన్ను సాధించు కొనితినునా? నిష్కారణముగ నిది యెవ్వారు సహింపగలరు? అమ్మా, నీ కిది యంతయు బాగుగ నున్నది కాబోలు! అయినను నత్తగారికి నీవన్న నెంతో యపేక్ష. ఆమె నిన్నేమియు ననదు. నా వలెనే నీమీదకూడ నోరు చేసుకొనినచో నీవుమాత్ర మింట నుందువా?"

"అక్కా! మనమిరువురముగూడ నామెమనసును గనిపెట్టి వర్తిం చినయెడల నామె మనల నెందుల కనవలసి వచ్చును? అథవా యామె యెప్పుడైన పెద్దది రెండుమాట లన్నను మనము పడకూడదా? మఱల మన మామె నెందుల కెదిరింప వలయును? సరే దాని కేమి

యది యిప్పు డట్లుంచుము, ముందు కాలుసేతులు గడిగికొని కొంచెము ఫలహారము చేయరా? నిన్న నేవేళ భోజనము చేసినావో!"

ఇట్లని లక్ష్మి యప్పుడే తోడికోడలికి ఫలహారాదికము లమర్చెను. పార్వతికి చూడగా నిప్పుడు సంసారమునం దేమియు లేమికి గానిపించుటలేదు. దరిద్రచిహ్నములు సైత మిప్పుడు దృగ్గోచరమగుట లేదు ఎక్కడ గాంచిన నక్కడ నైశ్వర్యచిహ్నములే కన్పట్టుచుండెను. కాని యేమిచమత్కారము! ఇవి యంతయు గాంచినంత పార్వతిమనసు సంతుష్టి బొందలేదు. మీదుమిక్కిలి నీర్ష్యానలముచే నామె దగ్ధ మగుచుండెను.

## ౩౮

సమయము గనిపెట్టి వ్యవసాయాదివ్యవహారము లన్నియు లక్ష్మి యిప్పుడు సదాశివుని స్వాధీనము జేసెను. వినాయకరావుగూడ పనిపాటలయం దన్నగారికి సహకారియై యుండెను. లక్ష్మి తనలక్ష్య మంతయు నిప్పుడు సాంసారికకృత్యములయం దుంచెను. ఇంటిలో నేమికలదో యేమిలేదో చూచుట, స్వయంపాక మొనర్చుట వడ్డన సవరణ మొదలగు కార్యభార మంతయు నిప్పుడు లక్ష్మి వహించెను. అట్లని పార్వతి బొత్తుగా నేమియు బనిపాటలొనర్పక పోవుట లేదు. లక్ష్మి సమిష్టిసంసారపు కార్యములు చేయుచుండ పెద్దకోడలు తనయొక్కయు, తనభర్తయొక్కయు, తనబిడ్డలయొక్కయు భోజనసంబంధ మగుకార్యములపట్టున మిగులశ్రద్ధతో దగినకట్టుదిట్టములు చేసికొనుచుండును. లక్ష్మి తీరుబాటయినప్పుడెల్ల రామాయణము, మహాభారతము, భాగవతము మొదలగుబోధప్రదగ్రంథముల నిరుగుపొరుగుస్త్రీలకు చదివి వినుపించుచుండ పార్వతి శృంగారరసపూరితము లగునాటకములు, జావళీలు, పెండ్లిపాటలు అవినీతిదాయకము

లగుకథలు మొదలగు వానిని చదివి ఆప్రక్క చిన్న సందులో నున్న నీచస్త్రీలకు తనశిక్ష నొసగుచుండును. లక్ష్మి జగన్నాథునకు రామునకు చదువను వ్రాయను నేర్పుచుండ పార్వతియు నానము మున సుద్దముక్క చేత గొని ముగ్గులు గీయుట, పచ్చి సాదుట మొదలగు పనులు చేయుచుండును. లక్ష్మి నూగి దారము గైకొని పిల్లలచొక్కాయిలు, లాగులు మొదలగునవి కుట్టుచు కూర్చుండియుండ పార్వతి గోడసంచులు పచ్చీసుపాళీ మొదలగు నిరుప యోగవస్తువుల గట్టుచు గూర్చుండును.

ఇంకను యథార్థము చెప్పవలసినచో నీకార్యములుగాక పార్వతి కింకేపనులు చెప్పినను నామె యటు లక్ష్యముంచుట లేదు. ఏలయన పార్వతి నెవ్వరైనను చెంబెడునీళ్ళు తెచ్చిపెట్టుమని యడిగినచో తత్క్షణ మామె తెచ్చియిచ్చును గాని యామెచేత నన్న దెం దెంతచిన్న దైననుసరే యది జారిక్రిందపడుటయో గానిలోని నీర మొలికిపోవుటయో తుదకేదో యొకటిగా నైన నప్పట్టున సంభవించి తీరును. ఎప్పుడైన నొక్కదినమున స్వయంపాకము చేయుటకు సాయము రమ్మని పిలిచిచో పార్వతి యెప్పుడును రాననిచెప్పుట లేదు ఆదినమున ప్రతిపదార్థమును మాడి బొగ్గులై బహుశః తిరిగి వంటజేసికొనవలసి వచ్చును సారాంశము లక్ష్మి యేదో నను కూర్చుచుండ పెద్దకోడలు ధ్వంసము చేయుచుండును.

ఇందువలన గృహకార్యములం దేమియులోపము గలుగుచుండట లేదు. కారణమేమన లక్ష్మి సమస్తకార్యములయందును దృష్టి యుంచి సమర్థించుకొని పోవుచుండెను. ఇంతియేకాదు. పార్వతి వలన నేదేనియపరాధము జరిగినచో నదికూడ లక్ష్మి తనమీదకే దెచ్చుకొనును. ఇందువలన రాధ పెద్దకోడలి నేమియు ననుటకు వీలు గాకుండెను.

ఇవ్విధమున నాలుమాసములు గడచెను. ఒకదినముగూడ నేవిషయమున నెవ్వరికిని వివాదము కాని పోరు కాని సంభవింప లేదు. సదాశివరావు ప్రముఖుడై మిగులనుత్సాహమున నింట గూర్చుండియే సంసారము నడుపుచుండెను. ఇంతలో నొకనాడు మూడవ జామున పార్వతి సోదరి యగు గంగ 'త్రిపాది" యుచటికి వచ్చెను. గంగ రాకవలన పార్వతి మొదలగువా రందఱు విస్మితులైరి. లక్ష్మి యామెకావరాతిథ్య మొసగెను. సోదరి దుర్దశ గాంచి పార్వతి యెంతయో సంతాప మందెను.

భోజనాదిక మయినంత పార్వతి యప్పగారిని తనగదిలోనికి దీసి కొనిపోయి "అక్కయ్యా మనపినతల్లి గారియింట నందఱు క్షేమముగ నున్నారా?" యని యడిగెను

"దానిమొగము మండ! అది మనకు పినతల్లి యా? అట్లని చెప్పుకొనుటకూడ సిగ్గుచేటు! అది యొక్కతెయు చచ్చియైన పోయినది కాదే! దాని కేమి తెవులొచ్చినదా, ఆమాటకు గారిమొండ యింకను వేయేండ్లు బ్రతుకును! మరేమియు భయములేదు"

"మా పినతల్లితో నేదో పోరాటము జరిగినదని తోచుచున్నది. ఎందుల కక్కా! తగవునకు కారణ మేమి వచ్చినది?"

"అంతయు చెప్పుటకు ప్రారంభించినచో పెద్దగ్రంథ మగును. దానికొడుకు కోడలుపోరాడినారు—అదియు నాదోషమే! వారికి వీరికి తగవు పెట్టుట తప్ప నాకు వేఱేపని లేదు కాబోలు! సరేయది యట్లుండనిమ్ము. దానిపొగరుబోతుచేష్టలు చూడు" గంగ తన వీపుమీదకొంగు ప్రక్కకు తొలగించి యచ్చటచ్చట తేలిన కణుతులు గట్టియున్న బెత్తపుదెబ్బలను జూపించెను. ఆదెబ్బల జూచుటతోడనే పార్వతియనసునమాత్రమే నొప్పి కలుగకుండునా? ఆమె రహస్యముగ గంగతో నిట్లనెను. "అక్కా! విను. ఇక్కడమాత్ర మీ

సంగతి వెల్లడి గానీయకుము. అటుగానిచో మనమిచట దలయెత్తు కొని తిరుగలేముసుమా॥"

సోదరిదుర్దశను గాంచి పార్వతి మనసు నీరయ్యెను అప్పట నెవ్వరు నౌదార్యవారైన లేక, పరులచే నిట్టిభయంకర మగుదెబ్బలు దిని 'అతలనుండి వెడలగొట్ట డి, ఈదినమున దనయింటి కాశ్రయమునకై వచ్చినసోదరిగాయముల విశేషపరితాప మొందకుండ పార్వతి యెటు లుండగలదు?

దాగా పాశ్చాత్తాపమునొందె ను మిగుల సంతోషమున గడచెను. అందరు గంగవిషయమున మిగుల జాలి జెంది యెంతయో యాదరించిరి. కాని 'దేశసంచారిణి, గంగవచ్చినప్పటినుండియు పాపముమనోరమ దుఃఖమున కంతము లేదు గ గను గాంచిన తనే యాభీరురాలి శరీరమున రక్తమంతయు వట్టిపోయెను. ఆదినము ను డియు మనోరమ భీతిజెంది దీక్షితునిగృహమునకు సాధారణముగ వచ్చుటయే మానివైచెను ఎప్పుడైన వచ్చినను నక్కి నక్కి, యొదిగియొదిగి, యెంతయో జడియుచు చప్పుడుకాకుండ వచ్చి లక్ష్మిమాత్రము జూచి పోవుచుండును గంగవీపుపైని దెబ్బ లెప్పుడునిశ్శేషముగ మానిపోయెనో, పార్వతి పూర్తిగ తనకు లొంగిపోయె నని యెప్పుడు దృఢ నిశ్చయ మయ్యెనో యప్పుడు గంగ మరల దనపూర్వస్వరూపమును ధరించెను. ఒక్క దినమున నక్కచెల్లెం డ్రిరువురు మాటలాడుచు గూర్చుండియుండగ గంగ యిట్లుపక్రమించెను. "ఏమేపార్వతి, నీ తోడుకోడలన్న మీయత్తగారి కెంతోప్రేమ యనుకొందును! అది యేమిచేసినను నోరెత్తదు. నీపొడ యేమాత్రము గిట్టదే!"

"అవును! నాకునదే మిక్కిలివింత యగుచున్నది."

"నీవునాకది వేళ చెప్పట యెదుంకు? నేనదియంతయు నా కన్నులతో జూచుచునే యుంటిని."

"ఏమిచెయ్యనమ్మా! నాప్రారబ్ధ మిట్లున్నది! మావారిస్వభావము నీ వెఱిఁగినదే. ఆయనముందు నామాట యేమి యెక్క బోవు వచ్చును?"

"అయితే తనకుమాలినధర్మమా! తన పెండ్లాముబిడ్డల నధోగతి పాలు చేసి, తానుమరదలితో గూర్చుండునా యేమి?,,

"నేనేమిచెప్పనక్కా! ఆయనస్వభావ మటువంటిది. నాకు నోరెత్తుటకు వీలు లేదు. నాదుఃఖ మంతయు లోలోపలనే దిగమ్రింగి కుళ్ళి చావవలసినయోగము వచ్చినది!"

"నేనింతవరకు సదాశివరావే మహాపౌరుషము కల వాఁడనుకొంటిని. ఏమమ్మాయీ చమత్కారము! చక్కఁగాఁ చదువుసంధ్యలు వచ్చినందుకు- తనబాగోగులే తా నెఱుఁగఁడే!"

"అక్కా! ఇదియంతయు దైవఘటనమునుమా! ఇదిగో చూచితివా? లక్ష్మీఖ్యాతి యూరంత నిండి యున్నది, కాని వాళ్ళ కెంగమముండి? ఆవచ్చినవాళ్ళకు నేనేవిషముపోసితినో- నాపేరు వినగనే మండిపోవుదురు."

"ఆహా! ఇప్పుడు నా కంతయు దెలిసిపోయినది. పార్వతీ! యిదిగో చూడు! నీతోడుకోడ లీసంసార మంతయు కడిగిపెట్టు చున్నది. ఇంతవరకు నీ విది గ్రహించనే లేదని తలఁచెదను. దానికేమియు బిడ్డపాపలు లేరుగదా? అట్లగుట కొట్టికోలవాలముగా సత్యనారాయణపూజ చేయుచు, బ్రాహ్మణసంతర్పణ లొనర్చుచు, అతిథ్యభ్యాగతు, మొదలగువారెవరు వచ్చినను వాండ్రకు పొట్టపగుల మేపుచు నిల్లిచ్చవచ్చినట్లు సొమ్మంతయు నమ్ము చేయుచున్నదే! భగవంతునిదయవలన నీకు రత్నమాణిక్యములవంటి యిరువురు కొడుకు లున్నారు. ఏమైన రెండుడబ్బులు మిగిలినచో నవి వారికే యుండును. కాని యొక్కడనుండియో యవాంతరముగ నీగాలిదెబ్బవచ్చి

యంతయు చుట్టపెట్టుకొని పోవుచున్నదే! అయ్యో ద్రవ్య మంతయు నిష్కారణముగ నష్టమువచ్చినట్లు దుర్వ్యయము చేయు చున్నదే!"

"నిజమేసుమక్కా! నీవు చెప్పిన దంతయు నిశ్చయమే! ఆదినమే నీవు నా కిట్లు జెప్పియుంటివి- పిట్ట యెప్పు డురిలో జిక్కినదో యిప్పుడే వేటకానిదయినది. ఇప్పుడు నీపలుకులవలన నాకింగితము కలిగి నది. సరేకాని దీని కేమియు నుపాయము లేదా?"

"ఓసిపిచ్చిదానా! ఉపాయముల కేమికొదువ! ఒకటికాదు వేయి యుపాయములున్నవి. నీవింతటనీ వెందుకు వేఱుపడ కూడదు! ఇదిగో చూడు. నీమగడు బాగుగాచదువుకొన్నవాడు మంచితెలివి కలవాడు. ఇంక దానిమగండో పట్టిమూర్ఖుడు జ్ఞానశూన్యుడు. కలిసి యున్నచో నీకే నష్టము. దాని కేమి?"

"అది యంతయు నేనెఱుఁగుదును. కాని యేమిలాభము? ఆయనయిష్టపడవలెనుకదా? అక్కా! ఆయన విద్వాంసుడు. తెలివి గలవాఁడు నని నీ వనుకొంటివి కాని నాకుమట్టునకు శుద్ధమూర్ఖుడైనట్లు తోఁచు చున్నది!"

"నేను నీకు చక్కనియుక్తి జెప్పెదను నీయత్తగారితోను, తోడు కోడలితోను జగడమునకు బ్రారంభించుము. ఏమగునో చూతము. దీనివలన విభాగము లగుటకు దాఁకయంత నదే యదను నంప్రాప్త మగునో కాదో చూచెదవు గాక. ఓసి పిచ్చిదానా! ఇట్లు నవ్వులాట క్రింద దినమును వెళ్ళఁ బుచ్చుచు గూర్చున్నచో పని యెట్లు సానుకూల మగును?"

అనంతర మక్కచెల్లెం డ్రిరువురు కొంతతడవు రహస్యాలోచన మొనర్చిరి. సారవంతమగుభూమిపై విత్తులు వెదజల్లుటయే యవ శిష్టముగా తత్క్షణమే మొలకలెత్తును కదా! మఱుదినమునుండియు కలహప్రియ యగుగంగ నాటినవిషవృక్షము చక్కగ ఫలించెను

ఇంతవరకును దీక్షితుని గృహము సంతోషదాయకమై చూడ ముచ్చటగనుండెను రాధయు నామె పెద్దకోడలు నెడతెరిపిలేకుండ పోరాడు చుండిరి. లక్ష్మి యాపోరాటమును మాన్పుటకై తనశక్తి ధారబోయు చుండెను. కాని నిష్ఫలము! మీదుమిక్కిలి పార్వతి వలనను గంగవలనను నామె యెన్నియో కర్ణకఠోరవాక్యములు విన వలసి వచ్చుచుండెను. కాని లక్ష్మి వాని నేమియు లెక్కగొనలేదు. ప్రతిదిన మీతీరున నత్తకును కోడలికిని జగడము మితిమీరు చుండెను లక్ష్మినికూడ నీకలహములోనికి దింపవలయు నని యయ్యక్కచెల్లెండ్రిరువురు నెంతో విశ్వప్రయత్న మొనర్చుచుండిరి. కాని వారి కం దేమియు జయము కలుగలేదు పాపము సదాశివుడు మహావిపత్తులో మునిగెను. వానిస్వభావమున గలపెద్దలోప మిదియే మహాకరినురాలగు భార్య యెదుటను నుండెనేని యాతడు మేకపిల్లవలెనైపోయి వాసనోరు కట్టుబడి పోవును. ఒక్కదినమున జగడ మాడియాడి మిక్కిలలసిపోయి పార్వతి భర్తతో నిట్లనెను. "నేనిక మీద నణుమాత్రము సహించి యుండజాలను మీరీవిషయమున నేదో మంచియో చెడుగో తగిన యేర్పాటు చేసి తీరలెను. తనముద్దులకొడుకును ముద్దులకోడలిని బెట్టుకొని యామె నుండనీడు. మనత్రోవ మనము చూచికొందము ఇప్పుడు మన మిచట నుండుట యామెకిసుమంతయు నిష్టములేదు."

భార్యానుడువులకు సదాశివునికన్నులు తెఱచుకొనెను. ఇంతవఱకు జరుగుచున్నకలహములు వెంటనే వానిమనసునకు స్ఫురించెను. ఈపోరాటమునకు తగినంత కారణ మేదో కల దని యాతనికి మొదటఁ దోచలేదు. ధూర్త యగుతనభార్యనోట నాకస్మికముగ నీయశ్లీలభాషణము లాలకించినంత సదాశివున కత్యంతాగ్రహము కలిగెను. ఆకోపభరమున నాత డిట్లనెను. "ఇట్లుతగవులు,

పోరులు చేయుటలో నీయుద్దేశ మేమో యిన్నాళ్ళ కిపుడు నాకు దెలియవచ్చినది. నీకు నేను స్పష్టముగ జెప్పుచుంటిని ఒకవేళ నట్టి సమయము తటస్థించినను నిన్నైన వదలిపెట్టుదును గాని మాయమ్మనుమాత్ర మిన్నటికిని విడువ నని నమ్ముము. ఇంకను నీకొకటి జెప్పు చుంటిని. నాకిక్కడ నేమి యున్నది? కొద్దియో గొప్పయో యేమియున్నదో యది యంతయు తటస్థించినది. ఇపుడు మన యెడుగడ యంతయు వారియన్నముపై ననే యాధారపడి యున్నది. ఇటు లుండియు నీ కింతయభిమాన మెటులఁ గల్గినదో తెలియగా కున్నది. నీవు వేఱుపడినచో నష్ట మెవరికి.''

పార్వతి నిరుత్తరయయ్యెను. దీని కేమిప్రత్యుత్తర మీయవలెనో యామెకు దోచలేదు. క్షణమాత్రమున క్రుద్ధయై యామె యిట్లనెను. "ఏమి! ఏమంటిరి? యమ్మకొఱకు నన్ను విడిచివైతురా! మంచిది. అటులనే కానిండు. నేను చచ్చిపోదునేమో చూతము నే నొకరికొఱ కిట్లు గేయుంబవ ఊపిరిసలుపకుండ పనిచేసి చచ్చుచున్నను నది మాత్రము లెక్కలోనికి రాదు. మఱి నాకు మాత్రమంత యొకరినిజూచి యోర్వజాలమి యెందులకు? ఊరిలోని వచ్చిన వాండ్రందఱు మీమరదలి క్షేమమైనప్పుడు మీకు మాత్రము వాండ్రతో నేకీభవింప కెటు లుందురు?

సదాశివుడు మిన్న కుండెను. భార్యకఠోరవాక్యము లతడు శాంతముగా వినుచుండెను. అభంగురమూర్తి సమక్షమున నాతడు తనకోప మణుమాత్రము గూడ జూపఁజాలక ధీరవృత్తితో నాత డిట్లనెను. "నలువు రేపక్ష మవలంబింతురో యాపక్ష మెవ్వరు స్వీకరింప కుందురు? ఇంతవరకెప్పుడును నీనోట నిట్టిపల్కులు విన లేదు. ఇంతవఱకు మాయమ్మతో నేనెట్టి వాదవివాదములకును బోర

కొన్నదై తివి, నేను చక్కగ దెలిసికొంటిని. దీని కంతయు మూలము మీయక్కయే. ఆమె వచ్చినప్పటినుండియు నీమనసే మారిపోయినది. సర్వానర్థములకు మూలము నీయక్క గంగయే. తెలిసినదా?"

ఇంతలో వెనుకనుండి "ఏమి! నీయీసర్వానర్థములకు మూలము నేనా?" యనుమాటలు తటాలున వినబడెను.

సదాశివుడు వెనుదిరిగి చూచెను—గంగ!

భార్య యవినీతి ప్రసంగమువలన సదాశివునితల మొద్దువారి పోయెను. అతనికి వెనుక ముందుగ దెలియుటలేదు అతనికి స్మృతిమాత్రము లేకపోలేదు. అతడు మరల మాటలాడ సాహసించెను. అవునవును నీవే నీవే!

ఇప్పుడుమాత్రము గంగ యించుక వెనుకకు తగ్గి యిట్లనెను. "మఱి నీసొమ్మంతయు నీటిపాలై నెవరు వమ్ముసేయు చుండిరో, ముష్టిమంత చేతి కిచ్చి నిన్నును నీపెండ్లాముబిడ్డలను నింటనుండి సాగ ద్రోల నవతె ప్రయత్నించు చుండెనో దాని మూలమున—"

సదాశివుడు కోపముతో నదుముచునే యిట్లనెను. "ఎవరివిషయమున నీవిట్లుక్రూరముగ మాటలాడుచుంటివి?"

"ఇంకెవరు. అది నీమరదలే—"

దుశ్శీల యగుగంగనోటితో సచ్ఛీల యగులక్ష్మిని నిందించుటాలకింప సదాశివుని క్రోధాగ్ని యధికముగ బ్రజ్వలించెను. పామరుల యెదుట పుణ్యాత్ముల యవమానమును, నపవిత్రులముందు పవిత్రుల యనాదరమును గాంచి స్వాంతమున నెంతయో నొచ్చెను "పాపి నీ వామెసంగతి నోటనుచ్చరించుటకు గూడ తగవు!"

ఏమి! ఎందువలన—"

"ఎందువలననా? నీకు సిగ్గైనలేదా? ఆమె స్వర్గము, నీవు నరక

ఆహా ధర్మము, నీవధర్మము. ఆమెలక్ష్మి, నీవు దరిద్రదేవతవు. నీనోట నామెనామము శోభించునా!"

మూతవైచి బిగించినకుండలో నూతనముగఁ బెట్టిన క్రొంచుపా పెట్లు బుసకొట్టునో యటులే గంగ సదాశివునిపుడు లాలించి బుసకొట్ట మొదలిడెను. గంగకే దేవిసామర్థ్యమున్నచో నీదిన మాతని నేమిచేసియుండునో! ఒకటి రెండుమాట లని సదాశివుడటనుండి లేచిపోయెను. కొంతసేపటికి గంగ యుంచుక శాంతించెను. ఈదినమున ఘటిల్లిన వ్యవహారమునం దందతియాదకన్న లక్ష్మిపై నామె మిగులఁ బగఁగొని యుండెను. ఈపగ నెప్పుడుదీర్చుకొందునా యని గంగ మిగుల తహతహపడు చుండెను.

౩౬

దీక్షితునిగృహ మీదిన మేలనో గఁద్రగోళముగ నుండెను. సదాశివునిపుత్రులు జగన్నాథుఁడు రాముఁడు స్మృతితప్పి పడియుండిరి. వైద్యుడు వచ్చి నాడిపరీక్షించి "ఏదో విషము కడుపులోనికి పోవుట చేత వీరికీస్థితి సంభవించె" నని తెల్ప నింటిలో నందఱు నాపిల్లల విషయమున హతాశులై, ఆ యాకస్మిక భయంకర సంఘటనమునకు శోకింప దొడఁగిరి. వైద్యుఁ డొసఁగిన యౌషధమును వినాయకరావు వారికి ద్రాగనిచ్చు చుండెను రాధ దేవతార్చనాగృహమున కరిగి దేవునిముందు సాగిలఁబడి బిడ్డలను బ్రతికింపుమని యెన్నియో తెఱఁగుల మ్రొక్కు లిడుచుండెను. పార్వతి రోదన మొనర్చుచు నాకాశ పాతాళము లేకముచేయు చుండెను. లక్ష్మివైద్యుఁడు చెప్పినచొప్పున నాబాలకుల కిరువురకును పరిచర్యలు సలుపు చుండెను. ఇట్టిసర్వనాశన మునర్చినవా రెవరో యని గంగ యజస్రాశ్రువర్షము గురిపించు చుండెను. సదాశివరావు హతబుద్ధియై వెఱ్ఱివానివలె ఱెప్పవాల్పక చూచుచుండెను.

ఇంతలో వైద్యు డొసగిన యౌషధము తనప్రభావము కనబఱిచెను. అయ్యర్భకుల కిరువురకును క్రమక్రమముగ వాంతి కాసాగెను. అందఱి మనస్సులందును మరల నాశాంకురము లుద్భవించెను. మరల కొంత తడవునకు వైద్యుడు వచ్చి పరీక్ష చేసి "ఇపు డింక భయపడవలసిన యవసరము లే" దని ధైర్యము చెప్పి వారి యాశను బలపరచెను. కొంతతడవున కాబాలకులకు స్వస్థత కల్గెను. భోజన సమయమం దేదేసువిషము కడుపులోని కేగుటవలన వారు స్మృతి తప్పి పడిపోయి యుందురని యనుమానించి, అది తెలుసుకొనుటకు వైద్యుడిప్పుడు మిగుల నుత్సాహియై యుండెను. అతడు వాంతియం దట్టిపదార్థ మేదేని గానుపించునేమో యని నిరీక్షించుచుండెను. ఈదినము వంటకమంపరు భుజించియేయుండిరి. అట్లగుట నీపిల్లలిరువురకు మాత్రమే యన్నములో నీవిష మెట్లు వచ్చెనో తెలుసుకొనుటకు నెల్లరు నుత్సుకులై యుండిరి. తొలుదొల్త నేదో విషపదార్థము తినుటవలన గాని, మఱి దైవికముగాం గాని యిట్లు సంభవించి యుండునని వైద్యుడు తలంచెను. కాని పరీక్షణల వలన నాతని కంటబడిన దానింగాంచి యాతడాశ్చర్యనిమగ్ను డయ్యెను. పరిశీలింపగా వాంతి మధ్యమున నల్లమందు మిశ్రిత మైనట్లాతనికి దెలియవచ్చెను. ఎవరో ప్రత్యేకముగా కలపనిచో భోజనపదార్థములందు నల్లమం దెట్లు వచ్చును? అతడు స్పష్టముగా నందఱితో నిట్లనెను. "ఎవ్వరో దుర్మార్గులు భోజనపదార్థములలో నీబిడ్డలకు నల్లమందు పెట్టిరి. భోజనానంతరమున వెంటనే వాంతికి ఔషధము కడుపులో బడుటవల్ల మేలయినది లేనిచో నిస్సంశయముగ ప్రాణహానిసంభవించియే యుండును."

ఈసంగతి విని యెల్లరు విస్మితు లైరి. ఈ ఘోరకృత్య మెవరి వలన జరిగినదో యనువిచారమున నెల్లరమనస్సులు కలవర మంద

సాగెను. ఇరుగుపొరుగమ్మలక్కలు చాలమంది యచటకూడి యుండిరి. ఇంతలో వైద్యుడు "అయితే నల్లమం దెక్కడిది? మీలో నల్లమం దెవ్వరికైన నభ్యాసము కలదా?" అనెను.

ఎవ్వరు నిందుల కొప్పుకొనరైరి. వైద్యుడు కొంతతడ వాలో చించి "ఎవ్వరీదినమున స్వయంపాక మొనర్చిరో, ఈబాలకుల కీదిన మెవ్వ రన్నము పెట్టిరో, వారివలననే యీకృత్యము జరిగియుండవల యును. ఈదినము వంటచేసినవా రెవరు?" అని ప్రశ్నించెను.

ఈప్రశ్న యాతనినోటినుండి వెలువడుటయే తడవుగ లక్ష్మి యని గంగ చప్పున ప్రత్యుత్తర మిచ్చెను. లక్ష్మి యీవిషయము నొప్పుకొన కుండుటకు వీలులేదు. కారణ మేమన, నిశ్చయముగ నీ దినమున నామెయే వంట చేసినది. వంటకాగానే యామెయే ప్రప్రథమ మున తనచేతిమీదుగ నా బాలుర కిరువురకు నన్నము పెట్టినది.

ఒకదాని కొకటి తోడుగ నావిషయమును బలపరచు చుండిరి. లక్ష్మినోటినుండి యొకమాట యైనను వెలువడ లేదు. చాలసేపటి వర కందఱు స్తబ్ధులై యుండిరి తుట్టతుదకు సదాశివుడు నిట్టూర్పు విడిచి యిట్లనెను. "నాభార్యయు నామెసోదరియు లక్ష్మిమీద ననేకాపకారములు చేసియుండిరి. నేనుగాని, నాపుత్రు లిరువురుగాని యేమియు నొక్కయపరాధమైన చేసియెరుగము. అట్లయ్యు నిట్లు సర్వనాశన మొనర్చుటకు లక్ష్మి యె ట్లుద్యుక్తురా లయ్యెను!"

మావగారి పలుకులు లక్ష్మికి ప్రాణాంతకదుఃఖమును కలిగించెను. ఇంతకంటె నాకస్మికముగ నామె శిరమున వజ్రాఘాతముపడినప్ప టికి నామెప్రాణ మంతగా వ్యథితము కాజాలదు. సదాశివుని భాష ణము లాలించి యటకేగినవా రందరు విస్మితులై తమమనమున 'అసంభవ' మను కొనుచు నటనుండి వెడలి పోయిరి. గంగయు పార్వతియు నీసుతోగ మేమియు నూరక బోనిచ్చినవారు కారు.

ఎన్ని దినములకో యిప్పటికి వారి మనోరథము పరిపూర్ణమైనది. వార లనేకవిధముల లక్ష్మిని నిందింప సాగిరి. ఆదిమున గంగ యానం దమున కంతము లేదు. ఆమె సంతోషము రవంతసేపు కూడ కడు పున నిముడ లేదు. ఈపాటిభయంకరకృత్యమువలన నాకొడుకుల కిరువురకును దేహావసానము కలిగినప్పటికి సంగులకై గంగ యంతగఁ జింతించి యుండ దని తోఁచుచున్నది. అక్కచెల్లెండ్రిరు వురును గలసి యిప్పు డీసంగతినూరంతయు జాటింపఁబ్రయత్నించు చుండిరి. సదాశివుఁడు. ఖిన్నవదనుఁడై వీధియరుగు మీఁదికి వచ్చి కూర్చుండెను. ఆదినమున జరిగిన ఘోరకృత్యమువలన మనసంత యుఁ జెడి యాతఁడాదిన మింటిలోని కరుగ లేదు. వినాయకరా వనాఁడు హతబుద్ధియై పోయెను. సదుమనస్కుఁడగు నతఁడు గుణవతి యగుతనభార్యయొక్క యశ్రుప్లావితముఖకమలమును గాంచి మిగుల వ్యాకుల మొందుచుండెను. ఇంతలో పార్వతి యట్టహాస మొనర్చుచు నచటి కరుదెంచి లక్ష్మి నుద్దేశించి "నీవు తలపెట్టినకార్యము కడముట్టె నని యిప్పు డిక్కడ కూర్చుండి యేడ్చుచుంటివా? నీ కడుపులో నెంతవిష మున్నదో యెవ్వరెఱుగుదురు?" అని పార్వతి లక్ష్మి తనబిడ్డలవద్దనుండి లేవగొట్టెను. లక్ష్మి యటనుండి లేచి యత్తగారిదగ్గఱకు బోయి కూర్చుండి శోకించుచు "ఈసంగతి మీరు కూడ నిజ మని నమ్మితిరా?" యనెను.

వృద్ధురాలు పైటకొంగుతో కోడలికన్నుల దుడుచుచు "అమ్మా! నేను కన్నులార గాంచినప్పటికి నీసంగతి నమ్మఁజాలను. నీవిది మన మున నుంచుకొని యేడ్వఁబోకుము నాయమ్మగాదు!" అని బుజ్జ గించెను.

ఆదరపూర్వకము లగు నత్తగారిపలుకు లాలించినంత మాత్రమున లక్ష్మి కిప్పుడా వంతయు నోర్పు కలుగులేదు. ఆమె పెద్దపెట్టున రోద

నము చేయుచు "నాపైవచ్చిన యీయపవాదము బోవుటెట్లు? మీరే దీని కేదేని యుపాయము జెప్పవలయును." అని యత్తగారిని వేడుకొనెను.

ఆముసలి కోడలి నోదార్చుచు, 'అమ్మా! నీయట్టిబుద్ధిశాలిని యగుపిల్లను నే జూడలేదు. అంతయు నీ వింత బేల వయ్యెద వెందులకు? తల్లీ బిడ్డా నీకు నేనేమి చెప్పగలను. ఈవిషయ మెవ్వరైన నమ్మెదరా? నీవంటిగుణవతికా యిట్టికళంక మంటునా? నే నంతయు దెలిసికొంటిని. ఈపనియంతయు నదౌర్భాగ్యపుముండ గంగదే. ఆగుండ బంగారమువంటి నాసంసారమును మన్ను చేయుటకై వచ్చినది!"

అత్తగారి నుడువులవలన లక్ష్మిప్రాణములు కుదుటబడెను. కొంచెము స్థిరచిత్తయై యామె యటనుండి లేచిభర్తనుసమీపించి "ఇందు మీ కేమి తోచుచున్నది?" అని యడిగెను.

వినాయకరా విట్లనెను. "ఈదుష్కృత్య మాదుష్టురాలు గంగదే యని నాకు బాగుగ నమ్మకము. ఆఘండాలురాలుగాక యిట్టి రాక్షసకృత్య మొనర్చుటకు సాహసింపగల స్త్రీగాని పురుషుడుగాని పృథ్వీతలమున నుండబోరు. ఇది నేగట్టిగ చెప్పగలను. కాని ప్రాణేశ్వరీ! నేడు నీధైర్య మంతయు నెట కేగినది? నేడు మాయన్నగారి నోటవచ్చినపలుకు లెఱ్ఱగ గాల్చి వైచినముద్రలవలె నామనసున ముద్రితములై చురచురగాల్చుచున్నవి. నీ వేటి కింతగా నధీర వయ్యెదవు? సత్యమెన్నటికిని దాగనేరదు!'

లక్ష్మి మిగుల నావేశముతో "సత్యమే జయించు నని నేనును నమ్మియుంటి" ననెను. కాని యీవిషయము సాధారణముగ నణగి పోవునది కాదు. సదాశివుని మనసున గలసందేహ మేమిచేసినను తొలగకుండెను. గంగ ప్రత్యక్షముగ దనచెల్లెలిబిడ్డలకు విషము

చెప్పె ననుట శక్యముగాదని యాతనిదృఢవిశ్వాసము. తుదకు దుర్బోధనలలో దగుల్కొని సదాశివరావు వేఱుపడుటకు గూడ ప్రస్తావన చేసెను. కాని యాతడు వేఱగుట కొప్పుకొనక లక్ష్మి యావజ్జన్మము పుట్టినింట నుండుటకై ప్రతిజ్ఞ చేసెను. కాని యెంత చెప్పినను రాధ యందుల కంగీకరింప లేదు. అప్పుడు లక్ష్మియే తనయత్తగారి నివ్విధమున వేడికొనెను. "మీర లనేకకష్టముల కోర్చి యీసంసారము నుద్ధరించితిరి. అది యిక్కటరి చితికిపోయినచో మరల గూడుకొనుట బహుదుర్ఘటము. అత్తయ్యా! నాప్రయోజకత్వ మేమి కలదు? నాకొఱకై బంగారమువంటి మీసంసారము నేల పాడు చేసెదరు? ఇచట నుండి వెళ్ళుట నాకెందుకును విచారము లేదు కాని యీదీనురాలికి మీపాదసేవాభాగ్యము లభింపనేర దని నా కత్యంతదుఃఖము కలుగుచున్నది."

కోడలిపలుకులవలన రాధ కెంతయో దుఃఖము వచ్చెను. ఆమె యేడ్చుచు "అమ్మా! నియోగ్యత సామాన్యమా? నీవే నా గృహలక్ష్మివి. అట్టినీవు లేనిచో నాసంసారమువసు నైపోయినట్లే! బిడ్డా! నీవు లేనిచో నీసంసారము నాకెందుకు? నీవు నాపజ్జనున్నచో మఱి యీసంసారమంతయు మునిగిపోయినను నాకు భయము లేదు." అని చెప్పెను.

ముదుసలి పెద్దపెట్టున నేడ్వదొడగెను. ఆమె యింకేమియు బలుకజాల దయ్యెను. తల్లియొక్క శోకస్వరము వినవచ్చినతోడనే వినాయకరావచటి కరుదెంచి యిట్లనెను. "అమ్మా! సత్య మెన్నటికిని దాగి యుండనేరదు. ఈదినము పలికినపలుకుల కన్నయ్యగారు నెప్పుడో యొకప్పుడు పశ్చాత్తాపము నందకపోడని నానమ్మకము. దీని నిప్పు డిచ్చట నుంచుట యేమియు లాభము లేదు. కొద్ది దినములలో నిజము బయల్పడక పోదు. మఱి తిరిగి దీనిని తీసికొని

వచ్చుట కెంతయవకాశము పట్టను! సోదరు లిరువురము వేఱు పడుటకంటె నిది పుట్టినింటి కేగుటయే యుత్తమము"

మఱి యుపాయము గానరానందున తుద కావృద్ధురాలందుల కిష్టపడియెను. లక్ష్మి యావజ్జన్మము పుట్టినింట గడపు నుద్దేశముతో నాదినమే పుట్టినింటి కరుగ స్థిరపఱచుకొనియెను. బండిలో నెక్కుటకుముం దత్తయు గోడలు నొండొరులు గౌగిలించికొని యెంతయో విలపించిరి. జగన్నాథుని రాముని దగ్గఱకు దీసికొనవలె నని లక్ష్మి వారిని దగ్గఱకు బిలిచి వారి మోముల దనహస్తముతో నిమిరి ముద్దు పెట్టుకొనుచుండెను. ఇంతలో గంగ యొక్కగంతున నటవ్రాలి యాబాలుర నిరువుర నామె కౌగిటనుండి లాగికొని పోయెను. లక్ష్మి సజలనయన యై యేకదృష్టిని వారివంక జూచుచు బండి యెక్కెను. వినాయకరావామెను బంపించుటకై వెంట బయలుదేరెను. బాలకృష్ణుడు కూడ వారితో బ్రయాణమయ్యెను. నిజముగ బాలకృష్ణుడరుగ నవసర మేమియు గనబడదు. రాధ సదాశివుడు నింక కొంతమందియు వాని ననేకవిధముల వారించిరి. కాని వానిని బట్టి యాపుట కెవ్వరికిని ప్రజ్ఞలేకపోయెను. అత్తవారియూర నీదినము లక్ష్మి శాశ్వతముగ సెలవు గైకొనియెను. శత్రువుల కుపకారమొనర్చుటకై యామె తనసౌఖ్యమును తృణప్రాయముగ వర్జించినది!

బండి దృష్టిపథము తప్పెను. గంగ యానందవిహ్వాల యై పార్వతిని గాఢాలింగనము చేసికొనెను.

౩౨

లక్ష్మి పుట్టినింటి కరిగినతరువాత పాపము రాధ మంచము పట్టెను. మూడుదినములవఱకు నన్నమైన ముట్టలేదు. అన్యాయముగ దుస్సహమగునపనిందపాలై కోడలు పుట్టినింటి కేగుటవలన రాధ యత్యంత

దుఃఖిత యయ్యెను. క్రమక్రమముగ నీసంసారకృత్యములయందామె విరక్త యయ్యెను. ఏమూడుజాములో దాటినతరువాత బలవంతము మీద రెండుముద్దలు నోట వేసికొని, యామె యెందేనిజాగి, కన్నీరు గార్చుచు దినము బుచ్చుచుండెను.

దీక్షితునిసంసార మంతయు నిప్పుడు పెద్దకోడలియొక్కయు, నామె జ్యేష్ఠభగిని గంగయొక్కయు, జేతులలో బడియెను. భార్యపోరు వలన సదాశివరా విప్రుడు మరల కంట్రాక్టుపని ప్రారంభించెను. దాని వలన నాతఁడు మాటిమాటికి పొరుగూరి కరుగవలసి వచ్చుచుండెను. కాంతాకాంచనముల యద్భుతమోహినీశక్తికి బలియైపోయి సదాశివుడు వెనుకటిసంగతు లన్నియు పూర్తిగ మరచి పోయెను. అట్లగుట నమాయకు డగుసోదరుని ద్రవ్యము గొని తన కైనఋణములు తీర్చుకొనవలయు ననియు, తనయిచ్ఛానుసార మారోక్కమును వినియోగింపవలయుననియు వానికి బలవత్తర మగునిచ్ఛ కలిగెను. వినాయకరా వేపనిచేయుటకును నిప్పుడు మునుపటివలె నంతటి యుత్సాహిగా లేడు. లేకపోయినప్పటికిని అన్నగా రేమాట చెప్పినను త్రోసివేయుట లేదు. అన్నగా రేపని నియమించినను వినాయకరావు భక్తిభావమున శిరసావహించి యొనర్చుచుండును. ఈయింట నుండుట కిప్పుడు వినాయకరావున కణుమాత్రము నిష్టములేకుండెను. కేవలము తల్లికి నన్నగారికిని మనసు నొచ్చిపోవు నని శ్వశురగృహమునకు బోవ డయ్యెను.

లోకు లనుకొనుమాట చివరకు నిజమే యయ్యెను. సంవత్సరమునకు దాదాపు పదిపండ్రెండు వ్రతములు దీక్షితుని గృహమున జరుగుచుండెడివి. అవియన్నియు నిప్పుడు కట్టుబడి పోయెను. అతిథ్యభ్యాగతుల పరామర్శ యిప్పు డెవ్వరును గైకొనుట లేదు. భిక్షుకులకు

పిదపను వియ్యము లభించునప్పటి కింకో దెబ్బలాటయగుచుండెను. మునుపటి యాయింటికళయే మారిపోయినది. ఈసమయమున సదాశివరావునకు కంట్రాక్టులో పెద్దదెబ్బ తగిలెను. చేతినిండ, జాలినంత ద్రవ్యములేకుండ కట్టిపనులలో బ్రవేశించినదో దీనివలన నెంతటి మానహాని యైన గల్గును.

ఒకనాఁడు వినాయకరా వెవ్వరితో చకారము కూడ ననక యొక్కడికో లేచిపోయెను. వానిజాడయేమియు దెలియరా దయ్యెను. సదాశివరావు మిగులవిచారమునఁబడియెను రాధయవస్థ వర్ణించుట కలవికాదు. అనంతరము మూఁడుదినములకు మాధవరావును వెంటబెట్టుకొని వినాయకరా వింటికి తిరిగి వచ్చెను వచ్చుటతోడనే మాధవరావు మొట్టమొదట భార్యమనోరమను జూడ బోవక గవా న్యముగ ముందుసదాశివరావును గలసికొనియెను. అతని గాంచుటతోడనే యమితానంద భరితుడై సదాశివు డెన్నియో ప్రశ్నలడుగ మొదలిడెను కాని నడుమనే వాని నాపి మాధవరావిట్లనెను. “సదాశివరావు! మీతమ్మునివలన నే విన్నసంగతిని జెప్పి ముందు నన్ను రెండుమూఁడు ప్రశ్నలడుగకుండ నూరకుండ జాలను. జగన్నాథునకు, రామునకు నెవరో సల్లకంచు బెట్టగా నాసంబంధమున నీవు నీమఱదలిమీఁద నసహ్యపడితివట!”

సదాశివుడు స్థిరచిత్తుడై “అవును నే విన్నసంగతులను బట్టి లక్ష్మిమొదల సంశయ మొందకుండ నుండుటకు వలనుపడదు” అని బదులు చెప్పెను.

“నాకు మిగుల నాశ్చర్య మగుచున్నదే! సదాశివరావు, మునుపటి సంగతు లన్నియు నీవు మొగలంట మరచితివి గాబోలు! ఏదినమున నాకేష్టసోదరికి నీయింట నాశ్రయమిచ్చితివో యాదినమునసే సమాలనాశనమునకు నీచే బీజారోపణ మొనర్చుకొంటివి. ఆమె తో

కారణమున నిచట నుండగోరితిని యది యంతయు సిద్ధించినది. ఆకోరికయే నా కామెయెడ సంశయము గలుగజేయుచున్నది. ఇది గాక యామెయెడ సంశయించుటకు మఱియొక విశేషకారణము కూడ కలదు"

"నీసోదరిని నే నెఱుగక పోలేదు. ఎఱిగినను నీసందర్భమున నామె యెడ ననుమానపడుటకు నా కేమియు కారణ మగుపడుట లేదు."

ఓహో! అర్భకుల కేదేని మఱియొకటి పెట్టియుండినచో నేనును నమ్మకనేపోదును. కాని నల్లమందు పెట్టెనని యెవ్వఁడు నే వింటినో యప్పుడే నాకు గట్టియనుమానము కలిగినది. నీకునిశ్చయముగ చెప్పుచుంటిని. ఈపని తప్పక యాచండాలురాలిదే! మానాయన గారికి నల్లమందు తినువాడుక కలదు. అది నీవు మఱచితివని తలచె దను. ఈదుర్మార్గురా లప్పటినుండియు దొంగతనముగ నల్లమందు తినుట కలవాటుపడినది. సదాశివరావు! నీ వాకపటకళంకసాధ్వీమణి విషయమున ననుమానించుట నిజముగ మిగుల నన్యాయముసుమా!

మాధవరావుపలుకు లాలించినంత సదాశివుని హృదయమున విద్యుత్ప్రకాశ మయ్యెను. కన్నులపైనున్న పొరలు దీసివేసినట్లు నిజావస్థ యెటు లుండునో యీసమయమున వానియవస్థ యటు లయ్యెను. సకలవిషయము లిప్పుడు వానికన్నులయెదుట స్పష్టముగ గన్పట్టుచుండెను. వానిముఖము తెల్లనైపోయెను. ఇంతలో మరల మాధవరా విట్లనెను. "నీకు నామాటలయందు నమ్మకములేనిచో పరీక్ష చేసి చూడుము. దానికడ నీకు నల్ల మందు దొరకు నని నే నొక్కి చెప్పగలను."

సదాశివునిమనసున కేమితోచెనో యెవ్వరెరుగుదురు! మాధవ రావు నచ్చటనే గూరుచుండు మని చెప్పి, యాతడు తత్క్షణము లోనికరిగి, కొలదిసేపటిలోనే చేత నొకడబ్బీ పట్టుకొని బయటికి వచ్చెను.

ఆబరిణె మాధవరావుచేతి కిచ్చి "బరిణెలో నేమున్నదో తెఱచి చూడు" మని యతనితోఁ జెప్పెను.

మాధవరావు బరిణె నానవాలుపట్టి "నీవే చూడుము. దీనిలో నల్లమందున్నదో లేదో" యనెను.

సదాశివుడు సిగ్గిలుచు "మాధవరావు, నీవనినదే నిజము. లక్ష్మి విషయమున నిష్కారణముగ సంశయించి యామెను నిందలపాలు చేసితిని" అని పలికెను.

మాధవరావు మిగుల నుత్సాహముతో "అయితే మఱి ప్రజలకు నిజమేదో తెలియజేయుటకు విలంబము చేయకు" మని యుపదేశించెను. ఇది జరిగినతరువాత మాధవుడు శ్వశురగృహమునకు బయలుదేరెను.

చివఱకు నిజ మేమో బయటబడినది. తనకోడలిపై నన్యాయముగ వచ్చిన యపవాదు తొలగిపోయిన దని తెలిసినంతనే రాధకు పట్టరాని సంతసము కలిగెను. తనయునుంగుఁగోడలు మరల నింటికి రాగనే మిగుల వైభవమున సత్యనారాయణపూజ యొనర్తు మని యామె నిశ్చయించుకొనియెను. అందుకు దగినప్రయత్నములను గూడఁ జేయఁదొడగెను. కాని యేసంగతి వినినంత వృద్ధురాలియానందము బ్రహ్మాండము పట్టజాల కుండెనో యావిషయమే పార్వతి చెవిని బడినంత నామెక్రోధము బ్రహ్మాండమును బ్రద్దలుచేసికొని బయటబడియెనా యేమి యని భయ మగుచుండెను. సంతాపభరమున చేతిలోఁగల పని యట్లనే యెక్కడిదక్కడ విడిచిపెట్టి, పార్వతి గంగపై నొక్కపెట్టున విఱిగిపడి, యత్యంతకఠోరవాక్ప్రవాహములచే నామెహృదయభేదన మొనర్ప దొడగెను. ఆమె మిగుల తీవ్రముగా "నీమొగము మండ రాక్షసిముండ! నీవంటిభయంకర కాలసర్పమునకు బాలు పోసి నేనింత వఱకు పెంచు చుంటినే! నీ

హృదయమున నేమైన దయ యనునది యున్నదా లేదా? నో రెఱుఁగని నాముద్దుబిడ్డలకు విషముపెట్టుటకు నీకు చేతు లెటు వచ్చెనే చండాలపుముండ! నీచేతు లింకను మూడి పడిపో లే దేమి!" అని యఱచెను.

కృతాంతునివలె భయంకర మైనపార్వతీమూర్తిని చూచుట తోడనే గంగ మొదట కొంచెము బెదురుపడియెను. కాని యిది యంత యు నెమ్మదిగ సహించి యూరకుండుట యుచితము గాదని మనసులోఁ దలపోసి, యామె బల్లిభయంకరగర్జనకు ప్రత్యుత్తర మొసఁగుట కెంతో బలవంతముగ నోపిక దెచ్చుకొని, నోరు దెఱచి "ఏమి— అంతనోరు పాఱవేసికొను చుంటివి! నీ వెవరి నిట్లను చుంటివో నాకు దెలియుట లేదే!" యనెను.

గంగనోటివెంబడి నీమాటలు వెలువడినవి, కాని యామెగుండె మాత్రము దడదడకొట్టుకొనుచునే యుండెను. మొగము బొగ్గువలె నల్లనై పోయెను. ఇంతలో పార్వతినోరు మరల విడబడియెను. "ఓసి చండాలపుముండ! నీకింకను మొగ మెత్తుకొని మాట్లాడుట కేల సిగ్గులేదు! నీపెట్టెలోనే నల్లమందుబరిణె కాన్పించినది; కాదా? ఓసిదౌర్భాగ్యపుముండ! నీ కేమియు ధర్మాధర్మభయము లేదా ఎవరియన్నము తినుచుందువో వారికె మొదలంట నాశన మొనర్ప బ్రయత్నించెదవా? అక్కడ నీతమ్మునిసంసారమునకు నిప్పంటించి నావు. పినతల్లిగారియింటికి వెళ్ళి యక్కడకూడ వెలుగపెట్టి వచ్చి తివి. ఇప్పు డిక్కడకు వచ్చి మాకాపురమునకు నిప్పంటించి కూరు చుంటివా నిర్భాగ్యురాలా! సన్న్యాసులైన సరిగా నిట్లు చూతురు? నీకాళ్ళపై నీచేతులతోనే ఱాతి నేల పడవైచికొనదవు? నీనోట నీవేల మన్నుకొట్టుకొనదవు? నీచేతులలో పుండుపుట్ట! లోకు లకు వేపుకొని తినినగాని నీకడుపుమంట తీరదా? ఏమి—మాట్లాడ వేమి? నోరుపడిపోయినదా యేమి?"

ఇంక చెల్లెలియెదుట నిలుచుటకు గంగకు శక్తిలేదు. ఆమె పాదములు గడగడవణకసాగెను. గొంతెండి పోయినందున పార్వతివలె గట్టిగా మాట్లాడుటకుసైతమామెకు సామర్థ్యము లేదయ్యెను. ఇక నేమియుఁ జేయజాలక యొకానొక విషహీనసర్పిణివలె నామె 'హో హో' యనిమాత్రము పూత్కారము చేయ దొడఁగెను.

ఇంతైనప్పటికిని గంగ సిగ్గుమాలి బుసలుఁగొట్టుట గాంచి పార్వతి కెంతో కోపము వచ్చెను. క్రోధావేశపరవశయై యామె యిట్లనెను. "తమ్మునిచే నింటిలో నుండి వెడలగొట్టించుకొని, పినతల్లి యింటికి పోయి యక్కడ దెబ్బలుపడి యిప్పుడిక్కడకు వచ్చితివి. దౌర్భాగ్యురాలా! నీ కేమియుసిగ్గైన లేదే! ఇప్పు డిచ్చటనుండికూడ దగినప్రాయశ్చిత్తము జేసి పంపించెదను. ఇప్పుడు నిన్నెవ్వ డింటిలో కాలుబెట్టనిచ్చునో చూచెదను——"

గంగకన్నులవెంట నశ్రువులురాలసాగెను. ఆమె వెక్కి వెక్కి యేడ్చుచు నిట్లనెను. "ఇంతకునా ప్రారబ్ధ మిట్లు పట్టినది! నే నెంత మంచి చేసినను విషమై పోయెను. పైగా వచ్చినవాళ్లు నామీద బడుటకు తయారగుదురు. చివఱకు నీవుమాత్ర మిటు లనుటలో నాశ్చర్య మే మున్నదమ్మా!"

కాని పార్వతియేమాత్రమును శాంతింప లేదు. ఆమె కోపమున మరల నిట్లనెను. "ఓసీ దుర్మార్గురాలా! ఈకుచ్ఛితపుమాట లన్నిటిని నే నెఱుఁగుదును. ఒకరికి నీవు చేయగలమంచి యేమి! నీ మొగము భోగ్గులు గాను! నీవు నన్నేమియు నుద్ధరింప వద్దు. నీవిక్కడ నుండ తగవు. తక్షణమిటనుండి వెడలిపొమ్ము. జాగ్రత్త! ఒక్కక్షణమైన నిట నుండెదవేమో! పదు——నిదొంగయేడ్పు లేమియు నా మనసునుకరిగింప జాలవు. తెలిసినదా!"

చెల్లెలొనర్చిన యియ్యసహనీయమైన యవమానమువలన గంగ

రోదనము వెంటనే నిలిచిపోయెను. ఇప్పుడు క్రోధలక్షణములు గానవచ్చుచుండెను. ఆ ఆయమ్మగంగ తనయుగ్రస్వరూపమును ధరించెను. పండ్లు పటపట గొఱుకుచు, అధరదంశన మొనర్చుచు, భయంకరకర్కశస్వరమున నామె "నామొగము బొగ్గులు కావలయునా? మంచిది. సరే అగుచున్నదిలే! దౌర్భాగ్యురాలా! ముందు నీవును—నీసంసారమును బొగ్గులు కానిదే—మఱి నామొగము బొగ్గు లగునా? యని కేక వేసెను. పార్వతికూడ నింక సహింపజాల దయ్యెను. రోసముచేఁ గన్నులు జేవురింప నామె బాహ్యజ్ఞానశూన్యయై పోయెను. ఆసమయమున వినాయకరావటకు వచ్చియుండనిచో నక్కచెల్లెం డ్రిరువురకును భయంకరయుద్ధము జరిగియే తీరును. వినాయకరావు వదినెగారిచేయి బట్టుకొని యెంతో కష్టముమీద నామె నావలకు దీసికొనిపోయెను.

## ౩౮

మాధవరావు సదాశివునియొద్దనుండి బయలుదేరి వెంటనే తన యత్తవారింటి కరుగుచుండెను. త్రోవలో వెనుకటిసంగతు లన్నియు నొకదానివెనుక నొకటిగ తలపునకు రాసాగెను. మనోరమ యాకృతి యాతనికట్టెదుట గన్పట్టుచుండెను. ఆమెకు గలసహజభీతియు, సంశయమును, ఆమెవిహ్వలాకృతియు, లజ్జావనతదృష్టియు నిష్కారణముగ దనవలన గలిగినమర్మభేదకతిరస్కారమును! కఠోరదూషణములవలన నెన్నడును జలింపనియామెహృదయాంతర్గతమగునగాధప్రేమయు, భయమున నిట్టూర్పులు విడుచుచు కరుణాజనకస్వరంబున నామె పలికిన యస్పష్టవాక్యములు. మొదలగునవు న్త హృదయదావకవిషయముద్రితమైన మనోరమయాకృతి క్రమక్రమంబున మాధవరావుదృష్టిపథమున వచ్చి నిలువబడియెను. అనంతరము తన

జ్యేష్ఠసోదరివలన మనోరమకు గలిగినదుర్భరహింసలన్నియు వాని కన్నుల కట్టినట్లుండెను. ఇవ్విధమున నొక్కొక్కదినము స్మరణకు వచ్చి, ఒక్కొక్క విషయమే యెట్లు వానికన్నులముందు గనఁబట్టుచుండెనో; యట్టులే యాయనవగాధిని యగునయ్యజ్ఞానబాలిక సహనశీలతకూడ జ్ఞప్తికి వచ్చి మాధవరావు విస్మితుఁడు కాజొచ్చెను. మాధవరావు తానుకూడ నేదోస్వల్పముగ మనోరమను నొప్పించి యుండెను కదా! భార్యవిషయమున దా నొనర్చినయయ్యత్యాచారము స్మరణకు వచ్చుటతోడనే వానిహృదయము కాంతివంత మయ్యెను. తన సగానే కొంతరో నిందించుకొనియెను పశ్చాత్తాపమువలన నాతని హృదయము దగ్ధము కాసాగెను. ఇప్పుడు భార్యకు మొగ మెట్టుల జూపగునా యని యాతఁడు సిగ్గుపడు చుండెను. ఈవిచారములవలన నాతనితల తిరిగిపోవు చుండెను.

ఇవ్విధమున మనస్సున సరిక్రమనొంది కడకు గస్సిటిని బాగుగ దుడిచికొని మాధవరావు సంశయించుచు శ్వశురగృహప్రవేశ మొనర్చెను. అగృష్టవశంబున దొలుతనే మనోరమ వానిదృష్టిని బడియెను. దగ్గఱ మఱెవ్వరును లేరు. మాధవరావును జూచుటతోడనే మనోరమ మూర్ఛిత యయ్యెను. మాధవరావు పరుగెత్తుకొని పోయి యామెను జాగ్రత్తగ బట్టికొని యాప్రక్కగదిలో నున్న సెజ్జపై బరుండబెట్టెను. భార్యయవస్థ జూచినంత మాధవరావు మనసు మిగుల దిగులుజెందెను మనోరమ మూర్ఛితయగుట చూచి మాధవునిహృదయము శతధావిశీర్ణ మయ్యెను. బాలకుని చందమున నాతఁడు వెక్కివెక్కి యేడ్వసాగెను. కడకు మిగుల ప్రయాసమున నాతఁడేడ్చుట మాని, యనేకోపచారము లొనర్చి మనోరమను మూర్ఛనుండి తేర్చెను. మనోరమ మెల్లగా దననల్లనివిశాలనేత్రముల దెఱచెను. ఎట్టయెదుట జూడ నాథునిముఖకమలము గానవచ్చెను.

పిదప నొక్కమారు నలువంకల గలయజూచి యామె మరల దనదృష్టుల భర్తమోమువైపునకు ద్రిప్పెను. అంతలో నామె మరల కన్నులు గట్టిగా మూసికొనియెను. ఆసమయమున మాధవరావు హృదయక్షేత్రమున ప్రవహించుచున్న శోకప్రవాహము నేత్రముల నుండి వెల్లువయై పైకి పొంగి పారుచుండెను. మనోరమ కన్నులు మూసికొన్నతోడనే యాతడు బాష్పధారల దుడిచికొని గద్గదస్వరమున "మనోరమా!" యని పిలిచెను.

మొదట మనోరమకు నేమియు వినబడినట్లు తోచదు. ఆమె మిగులభీతిల్లి మరలనొక్కమారు కన్నులు దెఱచి చూచెను కాని వెంటనే యవి మెల్ల మెల్లగ మూసికొని పోయెను. ఆమె నోట మాటయే లేదు. తుదకు చాలసేపటికి మిగుల నస్పష్టస్వరమున నామె "ఏమిది! దైవమా! ఇదియంతయు నిక్కమేనా?" యనెను.

మాధవునకు దుఃఖము పొరలివచ్చెను. అతడు గద్గదకంఠు డయ్యెను. వానికిని నోటివెంట మాట రాదయ్యె. కన్నులనుండి బొటబొటబాష్పములు గార్చుచు నాతడు స్తబ్ధుడై నిలుచుండెను. నేత్రములు గట్టిగమూసికొనియే యాసమయమున మనోరమ జాలి గదుర మిగులనస్పష్టముగ "దేవా! ఇదినిజముగా స్వప్నమే యైనచో దయయుంచి నాకు స్వప్నావస్థయే చిరకాల ముండనిమ్ము!" అని పలికెను.

ముకుళిత కమలమువలె శోభాయమాన మగుభార్య మనోహరముఖమును ప్రేమాతిరేకంబున ముద్దుగొని డగ్గుత్తికతో మాధవరావిట్లనెను. "మనోరమా! ఇదికలగాదు కన్నులుదెరువుము. నిన్నుఁ దగునీభర్త యిదిగో జీవముగ నీయెదుట నిలిచి యున్నాఁడు. నీవీ నిర్దయుని మన్నింపనిచో నీని కింక నాశ లేదు. నిన్ను క్షమాపణము వేడుటకే యిటకు వచ్చియున్నాఁడు!"

మనోరమ కన్నులు తెఱచి చూచి చప్పున లేచి నాథునిపదము లపై శిర మంచెను. చాలకాలమునకు లభించిన యాపాదములను నామె ప్రేమాశ్రువులచే నభిషేక మొనర్పఁ గొడఁగెను. మనోరమ వెక్కి వెక్కి యేడ్చుచు "ఇప్పటి కింతకాలమునకు దీనురాలైన యీ దాసి జ్ఞాపకమునకు వచ్చెనా!" యనెను. మాటలతో నాప్రశ్నకు ప్రత్యుత్తర మొసఁగు టెట్లు? మాధవరావునకు దుఃఖము పొరలి వచ్చెను. మనోరమ భర్తపాదములపై శిరముంచి మిగుల విలపించు చుండెను. కొంతతడవునకు మాధవరావామెను లేవనెత్తి అక్కున జేర్చికొనియెను. పతివక్షస్థలమున మస్తక ముంచి మనోరమ యానందాశ్రువులతో తడిపివైచెను. అహా! ఆయిరువురకు నసమయ మెంతసంతోషదాయకము! ఆసౌఖ్యము వారికు ప్రత్యక్షస్వర్గసౌఖ్యము నైన ననుభవించుటకు నిచ్చగింతురా! కొంతసేపటి వఱకు నెవరినోటినుండియు పలుకు వెలువడలేదు. కొంతతడవునకు మనోరమ మిగుల ప్రేమతో నతనిమోమువంకఁ జూచి వినయము తొలంక "ఇన్ని దినములవఱకు మీ రిటకు రాకుండుటకు గతమేమి?" అని యడిగెను.

భార్యప్రశ్నము మాధవున కెంతయో యచ్చెరువయ్యెను. ఏమి ప్రత్యుత్తర మీయవలయునో యాతనికి దోఁచ లేదు. తుదకు మిగుల నాశ్చర్యమున నాతఁడు "ప్రాణేశ్వరీ! నీవు మఱచితివని తలంచె దను. నేనిన్నిదినములు నాపాపమునకు ప్రాయశ్చిత్త మనుభవించు చుంటినిగదా!" యనిచెప్పెను.

ఈమాట వినుటతోడనే మనోరమ యాశ్చర్యచకిత యై మాధవుని మోమువంకఁ జూడఁదొడఁగెను. ఆమెకు దానియర్థము సరిగా దెలియలేదు మాధవరావునకుమాత్ర మామెమాటలయందలి యర్థము వెంటనే దెలియవచ్చినది. "ప్రాణేశ్వరీ! ఇప్పుడు నీవద్ద నే

నెట్టిరహస్యమును దాఁచుటలేదు. సంవత్సరము కారాగృహవాస శిక్ష పొంది నే నొనర్చిన ఘోరపాతకమునకు ప్రాయశ్చిత్త మనుభవించితిని. ఇప్పుడు నేను దుర్మార్గమునందు ప్రవర్తింపబోను. చెప్పుచెప్పు, మనోరమా! నామాటలయందు నీకు నమ్మకము గలదా!" అని మాధవరావు పలికెను. సిగ్గుచే మనోరమ తలవంచి యిట్లనెను. "మీపలుకుల నెన్నడైన సంశయించితినా! ఇప్పటికిని మీవలన నెప్పుడేపాపము సంభవించినదో యావిషయమునమాత్రము నామనసున నెన్నటికిని చోటు—"

ఇంతలో వినాయకరావు మాధవరావును కేకవైచెను. ఎంతో కష్టమున కన్నీటిని దుడుచుకొనుచు అక్కున జేర్చియున్న భార్యాశిరమును విధిలేక తొలగించి మాధవరావు మెల్లమెల్లగ బయటికి రాదొడగెను. మనోరమ విస్మితయై నిశ్చలదృష్టుల నాథునివంక జూచుచుండెను.

మాధవరావు బయటికి వచ్చినంతనే వినాయకరా వి ట్లనెను. "బావా! మీయుపకార మెన్నటికిని మఱవను. అమృతసేవ చేయించి యీమృతదేహమున మరలఁ జీవనమున మీరు ప్రాణము పోసితిరి. మరల నాకు సంసార మొనగూర్చి మీరు పుణ్యము గట్టుకొంటిరి. నడువుడు. మాయన్న మీకై యెదురు చూచుచున్నాడు. ఒక్కతూరి యటకు రండు!"

"ఈవిషయమున నేనొనర్చినసహాయ మేమియు లేదు. వినాయకరావు, మీకింతవఱకే యేయనిష్టములు వాటిల్లెనో వానికన్నిటికి నీనిచుడే, యీపాతకి యగుమాధవరావే కారణముకాదా? సరే యది పోనిమ్ము. నీవు ముందు నడువుము. నేను వెనకనే వచ్చెదను"

వినాయకరావు వెడలిపోయెను. ఇంతలో సదాశివరావే యచ్చటికి వచ్చిచేరెను. మాధవరావును చూడగనే సదాశివుఁ డిట్లనెను.

"మాధవరావు! మే మందర మిప్పుడు లక్ష్మిని దీసికొనివచ్చుటకై పోవ నుంటిమి. నీ వా మెపై నారోపించిన నిష్కారణదోషమును గూర్చిన యథార్థవృత్తాంత మామెకు తెలిగించి యామె మనస్తాపము దొలగించినగాని యిప్పు డొక్కక్షణ మైనను నా మనసు స్వస్థత వహింపదు!"

ఇది వినుటతోడనే మాధవరావు మిగుల సంతసమున నిట్లనెను. "అవు నవును. అట్లుచేయవలసినదే నయమువు. నేను కూడ మీతో వచ్చెదను. మావదినెగారు కూడ నచటనే యున్నది. ఆమె పట్టున నే నింతవరకుఁ జేసిన యపరాధముల కామెను క్షమాపణ వేడికొని యెటు లైన నామెను మరల నింటికి దీసికొని వెళ్లెదను. సదాశివ రావు ఆమె యనుమతి చొప్పున నే— ముఖ్యముగ వదిన యెట్లు చెప్పునో యట్లేప్రవర్తించి యిప్పుడు నూతనసంసారము ప్రారంభించెదను."

"నయమువు. అయితే మఱి బయలుదేరుటకు ప్రయాణముగమ్ము. అమ్మా, వినూ, జగన్నాథు, రాముఁడూ ఇంక నింటిలో నందరిని వెంటఁదీసికొని వెళ్లెదను. ఎందుచేతనో నా కొంటరిగ నచటి కేగు టకు ధైర్యము చాలకున్నది. మాధవరావూ, నీవే చెప్పుము. ఇప్పు డొంటరిగ నచటి కేమొగము పెట్టికొని పోదును!"

మాధవరావు నవ్వుచు "మఱి నేను మనోరమను కూడ వెంట దీసికొని వచ్చెదను. ఇంక నామెను విడిచియుండుట లేదు!" అని పలికెను.

నిర్ణీతదినమున నందఱును లక్ష్మిని దీసికొని వచ్చుటకై బయలు దేఱిరి. దాసి యగు సఖూబాయియు, నౌక్రు నౌకరు, గంగయు నీముప్పురుమాత్రము సదాశివరావుగృహమున దిగబడిరి.

## ౩౮

నేడు వాటిల్లినకలతవలన గంగకు పార్వతియెడ గలసోదరీవాత్సల్యము రవంతగూడ కడముట్టెను తనచెల్లెలిబిడ్డలకు చేతులార విసము బెట్టి గంగ యింతవఱకు సంతోషసాగరమున నోలలాడు చుండెను. కాని యెంతవిచారకరము! ఆ సంతోషసాగరమున నేడు హాలాహలతరంగము లుద్భవించి మహాకల్లోల మొనర్చు చుండెను. అట్లగుట నిప్పుడు గంగకు పగ దీర్చుకొన రాక్షసవాంఛ యుద్భవించెను. తా బూనిన కార్యము సఫలమగుటకై మిగులయోచించుటవలన నామెహృదయము దగ్ధ మగు చుండెను. ఆమె మేలుకొన్నను స్వప్నమునను పగయే దోచు చుండెను.

రాత్రి రెండుజాములయ్యెను. కాని గంగ నిద్రయన నెట్టిదియో యెఱుగదు. అభయంకరనిశీథసమయమున నామె పిచ్చిదానివలె నిల్లంతయు కలయదిరుగుచున్న దేలనో! ఆదిన మింట నొక్కపిట్ట యైన లేదు ఆనా డామెయిష్టానుసార మొనర్చుట కేయాటంకము లేదు. అనాయాసముగ సంభవించినయిట్టిమంచియదనను గంగ వంటి పగ బూనియున్న మానిసివలన నెందుకూరకబోవును! తన దుర్వాంఛ నేటితోన నెఱవేర్చుకొందునా యని యామె యోచించు చుండెను. ఎంత యోచించినను చాల సేపటివఱ కేమియు స్థిరపడినది కాదు. అందువలన నామె మిగుల నస్థిర యై విడువబడినయున్మాదినివలె నిల్లంతయు నృత్యము సేయ సాగెను. అట్లుండ నామెదృష్టి సమీపమున నున్న ధాన్యపుగోట్లవంకకు బోయెను. ఇంక చెప్పవలసినదేమి! ఆరాక్షసి మహానందమున కిలకిలనవ్వ సాగెను. నిస్తబ్ధ మగువాగంభీర నిశీథసమయమున గంగ వికటహాస్య మెంతో భయానకముగా నుండెను!

ఆసమయమున నేమి దోచెనో యెవ్వ రెఱుంగుదురు! గంగ లోపలికి పరుగెత్తుకొనిపోయి కొలదిసేపటిలో వెలుగుచున్న పెద్ద కాగడ చేతబట్టుకొని బయటకు వచ్చెను. ఇదియేమి! ఆకొట్లవంక జూచి యాచండాలురాలు మరల ఫకఫకనవ్వుచున్నది దేనికొరకు! కాగడా వెలుతురలో నామె మొగ మేటికింతభీషణముగ గానవచ్చుచున్నది! ఆ కాగడాతో సమానముగ గంగకన్నులుకూడ నిప్పుల కట్లు ప్రజ్వరిల్లుచున్నవి! ఎంతభయంకరము—ఇది యెంతభీషణమూర్తి. చూచిచూచి చేతిలో గట్టిగ బట్టుకొనియున్న యాకాగడ నాదుర్మార్గురాలు ధాన్యపుగొట్ల కంటించెను. అంతట భయానక మగువెలుతురు వచ్చెను. కొట్లు పెళపెళ పేలుచుండెను. ఆపెళపెళధ్వనులకు సరిగా గంగకూడ పకపక నవ్వసాగెను. శ్మశానమధ్యమున బ్రజ్వలిత మగు చితిచుట్టును మూగి పిశాచము లెల్లు భయంకరముగ జిందులు ద్రొక్కునో యటులే యాపిశాచియు మిగులసంతసమున నాట్యము చేయుచున్నది.

ఇప్పుడింకేమిచేసినను నగ్ని జల్లార్చుట కలవి గాదని తోచినంత గంగమనసున నేమిపొడమినదో యెవ్వ రెఱుంగుదురు! ఆ రక్కసి తానపండుకొన్న గదిలోని కరిగి తలుపు లోపల గట్టిగడియ వైచికొనెను. భగభగమని భయంకరాగ్నిజ్వాల లెటుల మేఘమండల మంటుచున్నవో యటులే సుస్వరా లగు గంగయానందము కూడ భూమ్యాకాశముల పట్టకుండెను. కొట్లలోనిధాన్యము తగులబడుచున్న పటపటధ్వనులు నలుగడల గనిపింపజేయుచుండ దానిలో పిశాచీవికటహాస్యము గూడ నిండిపోయినదే! క్రమక్రమముగ భీషణాగ్నిజ్వాలలు లేచి యెట్లాకాశమండలము నిండి పోవుచుండెనో యటులే గంగయానందముకూడ నాకసమున కెగయుచుకొని పోవు చుండెను. కాని హాహా! ఇంటిలో నింక పెద్దవెలుగెక్కడిది!

అదిగో చూడుడు! ఆపిశాచిభయానకమూర్తి మరల గనబడు చున్నదే! దాని కింకను నిద్ర యెటుల వచ్చును! అదిగో చూడుడు. మహానందమున గడయుంచియు నెటుల గంతులు వేయుచున్నదో! ఆహా యిదియేమి! దీనినాట్యము నిలిచిపోయిన దేమువలన. అగ్ని తాపము సైపలేక పోయినదా యేమి! సర్వనాశనమునకు సంసిద్ధ మైన యీరాక్షసి తనమనమున నిప్పు డేమి యోజించుచున్నదో యెవ్వ రెఱుంగుదురు! ఆచండాలురాలు మూసినద్వారము మరల చప్పున దెఱవబడెను. కాని యింతలో సర్వసంహారకాలమున మృత్యుదేవతికర వివదనమును దెఱచి యత్యాశతో భయంకరజిహ్వను నలువంకల నెటుల జూచునో యటులే యొకభీషణజ్వాల యామె శరీరమునకు ప్రాకెను. అంత నాపిశాచి భయమునదిగ్భ్రమ జెంది పోయెను. తత్క్షణము కంపితహస్తమున ద్వారమును బంధించెను. కాని యింతమాత్రమున నగ్ని గతి కవరోధము గలుగ లేదు. గడియ వైచి యున్నద్వారమే పెళపెళమని నేల గూలెను. ఆమెను నలువంకలనుండి యగ్నిప్రళయము చుట్టివైచెను. ఇట్టి వెలు వలికి బోవుదమన్నను నామెకిప్పట్టున శక్యము కాకయ్యెను ఇంత వరకు సంతసమున నొడలెఱుంగక గృహామంతయును జిందులు ద్రొక్కుచున్న గంగయే యిప్పుడు ప్రాణసంరక్షణార్థమై యేమియు దోచక గలవరపడుచు నిటునటు దడబిడలుగ బరుగెత్తుచుండెను. ఆసమయమున నామెకు గల మనోందోళనము, వాటిల్లిన దుర్భరయాతనయు, ఆమె పాపిష్ఠి హృదయమును వ్రయ్యలు జేసి ప్రత్యక్షముగ జూపవలయునే కాని కేవల వర్ణనము వలన దెలుపుటకు సాధ్యము గాదు.

ఆపాతకి హృదయము వ్రక్కలు చేసి చూపుటకు శక్యము కాదు. “రండు. రండు. ఎవ్వరైన వచ్చి నన్ను బ్రతికింపుడు” అను కర్కశ

స్వరము దిక్కుల బ్రతిధ్వనించుచుండెను. కాని ఆభయంకరాగ్ని జ్వాలల మధ్యమున బ్రవేశించి తన జీవితాశ వదలుకొని యూరక్కసి నెవఁడు రక్షించును? శరీరమున ధరించిన వస్త్రము లేదు. శిరస్సున వెండ్రుకలు లేవు. రెండుచేతుల బైకెత్తి యామె పిడికిళులు గట్టిగ బట్టెను పన్నులు బిగియబట్టి పటపట గొఱుకుచుండెను. క్రోధమున జ్ఞానశూన్యయై పోయెను. వికటనేత్రములతో నిటు లేకాగ్రదృష్టిని జూచుచు పిలుచున్న యాభీషణమూర్తి యొక్క క్షణమాత్రము గానవచ్చినదో లేదో యప్పుడే ప్రచండాగ్ని జ్వాలలామెపై వ్యాపించెను. నలువంకల భయానకాగ్నిప్రళయము జుట్టి వైచెను. ఇవ్విధమునఁ దానే యంటించి భయంకరాగ్నిలో గంగపాతకదేహము భస్మమైపోయెను. ఒకరిని నాశన మొనర్చుటకై ప్రదీప్త మొనర్చిన యయ్యగ్నినారాయణునకే తుద కాదుష్టరాక్షసికూడ నాహుతి యయ్యెను.

## ౪౦

సంధ్యాకాల మయ్యెను. సుశీలయు, లక్ష్మియు, గష్టసుఖములఁ జెప్పికొనుచు కూర్చుండియుండిరి. ఈదినము లక్ష్మి మోముపమ్మి మిక్కిలివిషాదియుండెను. సుశీలపలుకులు జాలసేపు శాంతముతో నాలకించి, నడుమనడుమ దీర్ఘనిశ్వాసములువిడుచుచు లక్ష్మియిట్లనెను. "వదినే! పతివ్రతయగు స్త్రీ యత్తిల్లు విడిచి తనపుట్టినింటికి వచ్చినచో భర్తకమంగళ మనియందురు. నిజమానా?"

సుశీల దుఃఖాక్రాంతకరణయై "మఱి నీ విచ్చటి కెందులకు వచ్చితివి?" అని యడిగెను.

"వదినే! మానుజులు స్వసౌఖ్యమునందును క్షేమము నందును మాత్రమే లక్ష్య ముంచుట పాటియగునా?"

"అదియును సత్యమే. సరే. కాని మరి నీవిటుల రేయింబవళ్ళు కన్నీరు విడుచుచుండుటకు?"

అనుమాత్రమున లక్ష్మి మనసున దుఃఖవారిధి పొంగివచ్చెను. కన్నులనుండి యవిరళాశ్రుధారలు ప్రవహింపసాగెను. ఆమె యిట్లనియెను. "వదినె! మనకన్నులనుండి యశ్రువు లొలుకనిదే యొరులను సుఖపెట్టు టెట్లు!"

సుశీల మిగుల ననురాగమున లక్ష్మిని దగ్గఱకుఁ దీసికొని యామె బాష్పములఁ దుడిచివైచి సప్రేమముగ నామెవీపుపైఁ జేయి వైచి "నామాట విని నీ విప్పుడత్తింటికరుగు" మని బోధచేసెను.

"నాయెదుట నీవింక నామాట దలపెట్టకుము. అది యసంభవము. కావున నెంతదనుక నావిషయమై సంశయింతురో, యెంత వఱకు నిజము బయల్పడదో యంతవఱకు నాకన్నీటిధారలు కట్టుబడవు. నేనచటి కేగుటయు సంభవింపదు. సరే! అది యటుండనిమ్ము. వదినే! ఇన్నిదినములనుండి కరుణజూపు మని దైవమును బ్రార్థించుచుంటిని. కాని యింతవఱకు నాపై వానికి గనికరము గలుగలేదు"

"అమ్మా! మనయదృష్టఫలమును మనమే యనుభవింప వలయును. పూర్వజన్మమున మన మెట్టిసుకృతదుష్కృతములొనరించితిమో యవ్విధముననే యీజన్మమున వాని ఫలితము లనుభవింపక తీరదు. మన మెంత ప్రయత్నించినను వాని గడువశక్యము కాదు. ఫలితము బొందినతరువాత భగవంతునకు దయగలుగును. సర్వవిషయములును నియమము తప్పకుండ జరుగునని తెలిసికొనుము."

"వదినే! నీవును దిన మంతయు పూజా, అర్చన, ధ్యానము, జపము వీనితోనే గడుపుచుందువు. పగలంతయు గ్రుక్కెడు నీరైన దీసికొనవు. రాత్రిమాత్ర మెప్పుడో దేవతాతీర్థమును బుచ్చుకొని

కొంచెము ఫలహార మొనర్చెదవు. ఈవ్రతము వలననే, నీయుప వాసము వలనను నీకు దేవతాప్రసన్నము కలదని ప్రజ లందఱు జెప్పు కొనుచుందురు. కావున నింకెంత కాలమునకు నాకు పతిసేవాభాగ్యము కలుగునో నీవు చెప్పుము చూతము!"

లక్ష్మి యొక్క నిష్కపట వాక్యము లాలించి "పిచ్చిపిచ్చి పట్టలేదుకదా? నేనేమి జ్యోతిష్కురాలను తపస్విని యనుకొంటివి కాబోలు! సరే యిది నిజ మైనచో-వస- నేను నీ కాశీర్వాద మొనర్చెదను. దైవము నీయభీష్టము సత్వరము నెఱవేర్చుగాక!" "గుఱి నీకు దేవతాప్రసన్నము కలదని యుండ రనుకొనుమాట యసత్యమే, సరే అట్లుకాకచో వదినె! మఱి నీవిట్లు వ్రతోపవాసము లొనర్చి శరీరమును గష్టపెట్టు కొందులకు? అటు లయ్యా నీశరీర మిట్లు తేజఃపుంజ మెటు లైనది?"

"నీపూర కిటుల బిచ్చిపడపోకుము తల్లీ! నాయట్టి పాతకికా వైకుంఠధాముఁడు ప్రసన్నుఁడగునా? కాని యొక్కదినమున నాకు స్వప్నమున వైకుంఠము కనఁబడినది. ఇంకను అం దిట్లు గాన్పించినది. ఆవైకుంఠమున వైకుంఠేశ్వరుఁడు విరాజమానుఁడై యున్నవాఁడు. అప్పటినుండియు ప్రతిదినమును నేను నాహృదయరాజ్యమున నుద్దేశపూర్వకముగ నావైకుంఠనిర్మాణ మొనర్చి, నాజీవితేశ్వరుని హస్తయుగ్మమున శంఖ, చక్ర, గదా, పద్మములనొసగియాతనికి యీవైకుంఠములోని వైకుంఠేశునిగనొనర్చి వానినే సర్వదా ధ్యానించుచుందును. ఒకొక్కకప్పుడాయుమూర్తిని స్మరింపు చుండ నాకాఁకలిదప్పులు కూడనస్ఫురించవు"

"ఏమి? వదినే! ఏమనుచుంటివి! ఇందు వలన నీ కాకలిదప్పులు కూడ లేకుండఁ బోవునా!"

"ఓసి వెఱ్ఱిదానా! ఒక్కసారి మనసు ప్రసన్నమైనచో మఱింత కెక్కడి మన్నింపవలెను?"

"వదినే! నీ వేమైన ననుము నాకిట్లుదోఁచుచున్నది. నీ వేకే నొకశాపభ్రష్టదేవతవై యుందువు. నీవు ధన్యవు. నీ పతిభక్తి ధన్యము. కానిచో మేము ప్రత్యక్షసంసారమునం దుంటిమే కాని యేమిప్రయోజనము? పతి ధ్యానించియు, చింతన మొనర్చియు మేము ప్రసన్నహృదయుల మగుటకు దూరులమై మిక్కిలి వ్యాకులము మాత్రము నొందుచు శోకించుచుంటిమే! మా దిట్టిపతిభక్తి! అటు లయ్యును వదినే, నీ కేమియు బతిదర్శన మగునను నాశాలేశముగూడ లేదు. దైవానుగ్రహమువలన మా కట్టియాశ కలదు."

అదివిని సుశీల మిగులనావేశమున నిట్లనెను. "ఏమి, లక్ష్మీ! యేమంటివి! నాకు వారిదర్శన మగుననునాశయే లేదా? ఏయాశ యాధారమువలన నే నింతదనుక ప్రాణధారణ మొనర్చుచుంటినో యాయాశనే నీవు లేకుండజేయు నెంచితివా? మాకుగూడ ఘనదర్శనము కలదమ్మా! అది యీలోకమునమాత్రము కాదు-వైకుంఠమున! ఓసి యమాయకురాలా! ఇచ్చటి మాదర్శనమున కనేక విఘ్నములు కలుగఁగలవు. మాటిమాటికి వియోగము తటస్థింపఁగలదు. కాని యచటి మాసంయోగము చిరస్థాయిగ నట్లుండవలసినదే!"

లక్ష్మి సుశీలమొగమువంక జూచుచుండెను. ఆసమయమున నామె వదనమండలముపై నొకవిధమగు నప్రతిమతేజము విరాజమానమై యుండెను. ఆతేజముముం దచట వెలుగుచున్న దీపప్రకాశముకూడ మందమగుచుండెను. లక్ష్మి నయనాశ్రుకణంబుల సుశీలపాదములపై శిరముంచి గద్గదకంఠియై యిట్లనెను." వదినే! నేను మిక్కిలి మూఢురాలను. నాపల్కులకు నీకు కోపమువచ్చినదా! నన్ను మన్నింపవా?"

సుశీల లక్ష్మిని దగ్గరకుదీసికొని, యక్కునఁజేర్చి బుజ్జగించి, ప్రేమ మీఱఁగ నామెను ముద్దిడుకొని యిట్లనెను "లక్ష్మీ! నీ వీదినమున నింతపిచ్చిదాన వైతి వేలకమ్మా? నే నిప్పుడే దేవతను కాను నీపై నాకేమియు కోపము లేదు. కన్నులు దుడిచికొని చూడుము."

ఇంతలో నొకపరిచారిక యటకు బరుగుపరుగున వచ్చి లక్ష్మి నుద్దేశించి యిట్లనెను "అమ్మా! ఇంకా కూర్చుండారేం? మీయా త్తో రందరు మనగుమ్మంవాడికొచ్చేరండి. అల్లదో చూడు మీ యత్తగారున్నూ, పారోతమ్మగారున్నూ యీడకేవస్తుందారు-"

పరిచారికవాక్యములు చెవి సోకినంత లక్ష్మి మ్లానవదనము ప్రఫుల్ల మయ్యెను. ఆమె చప్పుడు లేది వీధిద్వారము వద్దకుఁ బరుగెత్తికొనిపోవుచుండెను. ఇంతలో రాధయు, పార్వతియుఁ బడకటింటిలోనికి వచ్చిరి. లక్ష్మి వారిరువురకు నాదరపూర్వకముగ నమస్కారమొనర్చెను ఆమెనేత్రము లానందాశ్రువులచే నిండిపోయెను. సుశీలయు మిగుల నాదరమున రాధకు నమస్కారమొనర్చి కుశలవార్తల నరసెను. రాధ లక్ష్మిని మిగులఁ బ్రేమమునఁ గౌగిలించుకొని యిట్లనెను. "బిడ్డా! తుదకు దైవము సత్యమును బయలు పరచెను. ఈకార్య మాపరమచండాలి చేసె యని యిప్పటికి మా కెల్లరకు నమ్మిక కలిగినది."

అనంతర మావృద్ధురాలు గంగసంబంధ మగునమస్తవృత్తాంతమును దెలియఁ బరచెను. లక్ష్మి యత్తగారివద్దనుండి యీవలకు రాగనే పార్వతి యామె కేలుఁ బట్టికొని యిట్లనెను. "సోదరీ! నేను నీ కనంతాపరాధము లొనర్చి యుంటిని. కాదు. కాదు. నిన్ను దుస్సహ మగునవనిందపాలుఁ జేసితిని. కాని యవి యన్నియు మనసున నుంచికొని యిప్పుడందులకై యేమియు జింతింపకుము. నీవు నా కన్న జిన్నదాన వైనను, మే మందరము నిన్ను మన్నన వేడికొను

టకై యీదినము ప్రత్యేకముగ వచ్చితిమి. ఇంతకాలమువఱకును నిన్ను సరిగా దెలిసికొనలేక పోతిమి. కాని నీ మనసుయోగ్యత మాకు సంపూర్ణముగ దెలియవచ్చినది. కడచిన దంతయు మనము మఱచిపోవలయు."

పార్వతికన్నులనుండి బొటబొటబాష్పము లురల సాగెను. తోడి కోడలిపలుకులవలన లక్ష్మీముఖకమలము ప్రఫుల్లమాయెను. ఆమెకు గూడ నేత్రములనుండి యానందాశ్రువులు ప్రవహించు చుండెను. ప్రభాతసమయమున వికసించిన కమలముపైఁ బడిన మౌక్తికా కార హిమబిందువులవలన కమల కాంతుల సుశోభిత మగునో యట్లు లక్ష్మీవికసితముఖకమలమున కీసమయమున నానందాశ్రువు లధిక శోభను గలిగించెను. కారుమబ్బులమాటున క్షణకాలము మాటు బడియున్న పున్నమచందురుఁ డామబ్బువిడిపోవగనే మరల నెటుల తనపూర్ణప్రకాశముతో నభోమండలమున దేదీప్యమానుఁడై ప్రకాశించునో యటు లీనిష్కారణముగ వచ్చినయపనింద తొలగిపోవుట తోడనే లక్ష్మీముఖచంద్రము పూర్వతేజమున విలసిల్లసాగెను

ఆమె వికసితాంతఃకరణ యై యిట్లనెను. "అక్కా! అదివఱకు అణుమాత్రమును నామనసున లేదు. దానివలన నాకెప్పుడును నెట్టి కోపమును గలుగలేదు. కాని నీవు గనుక నన్ను సోదరీభావమున జూచి, నాయెడ నిశ్చయముగ సంతుష్ట వైతివేని యొక్కమారు నా జగన్నాథుని, రాముని నీచేతితో నాయంకతలమున గూర్చుండబెట్టితి వేని నాకష్టము లన్నియు దూరము లగును."

ఇంతలో మనోరమ యొకచేత జగన్నాథుని యొకచేత రాముని బట్టికొని వచ్చుచు నట కరుదెంచెను. లక్ష్మీమనోభీష్టము నెరవేఱ్చ టకు పార్వతి మిగులనానందమున సంసిద్ధ యై యుండెను. ఇంతే కాదు. అందులకై యామె కెంతయో కుతూహలము కలిగి

యుండెను. కాని పార్వతివలన నీకార్యము నెఱవేఱువఱకున్నైన లక్ష్మి రూపిక బట్టజాల దయ్యె. ఆయర్భకులు కంటబడుటతోడనే యామె రయమున పరుగిడిపోయి వారి నెత్తి చంకనిడుకొని మిగులప్రేమమున వారినిర్దోషవదనముల పలుమారు ముద్దిడుకొనసాగెను. టక్కరికాడగు రాముఁడు మాత్ర మేమిచేసినను తనపినతల్లిచంకనుండి క్రిందికి దిగ దయ్యెను.

మనోరమ లక్ష్మిపాదములు గట్టిగ బట్టుకొనెను ఆమె సంతోష మాదినము త్రిభువనములును బట్టజాల కుండెను. లక్ష్మి మిగుల ప్రేమమున నామెను లేవనెత్తి యాలింగనము జేసికొని, రహస్యముగ నామెచెవిలో వినోదముగ నిట్లనెను "ఏమి? యిప్పటికైనా పలుకు లనుభవము లోనికి వచ్చినవా లేదా? వచ్చినాడా లేదా నీ నాధుఁడు తనకుదానై నిన్ను వెదకికొనుచు?"

మనోరమ సలజ్జయై మధురస్మిత మొనర్చుచు "మావదినెగారి వాక్కు లెన్నడైన నసత్యమగునా?" యనెను.

ఆహాహా! ఇట్టిమధురహాస్యము మనోరమముఖమున నింతకు బూర్వ మెన్నడును గనఁబడలేదుగద! ఆమెయొక్క మధురస్మితముఁ గాంచి నంత లక్ష్మి యానందము ద్విగుణిత మయ్యెను. నవ్వుచు నామెయిట్లనెను. "మనోరమా! ఇప్పుడు మాత్రము నీసర్వస్వ మును చక్కగ గాపాడుకొను చుండవలయు సుమా! ప్రయత్న మొనర్చినచో వనములోని పక్షి కూడ వశ మగును. మఱి పురుషుల సంగతి యెందులకు?"

మనోరమ మరలలజ్జితయై శిరము క్రిందికివంచి మెల్లగ నిట్లనెను. "అది యెట్లు కాపాడుకొనవలయునో మావదినెగారే నేర్పవల యును."

లక్ష్మి ప్రేమాతిరేకమున దనహస్తము మనోరమ గడ్డముక్రిందికి

చేర్చి "ఏమి యింతవరకు నీవు నేర్చికొననే లేదా! ఎంతచెలువు!" అని నవ్వెను.

ఈప్రియభాషణములవలన మనోరమకు గలిగిన మహానందమును వర్ణించి తెలుపుట శక్యముకాదు. మనోరమ మా రేమియుబలు కక మరల లజ్జచే మోమువాంచెను. కాని లక్ష్మి సిగ్గుచే వంగినయామె ముఖకమలమును పైకెత్తి ప్రేమభరమున ముద్దిడుకొనియెను.

౪౧

ఈదినము నానాగారి సంతోష మే మని వర్ణింప నగును! లక్ష్మివంటి యేకపుత్రికపై వచ్చినయపవాద మీదినమున పరమకృపాళుడైన యాజగన్నాయకుని కరుణవలన తొలగిపోయి అత్తింటనివసించు భాగ్యము తనకు లేదని నిరాశచేసికొనివచ్చిన తనపుత్రిని, యీదిన మామె భర్తయొక్కడేగాక యింటగల వారందరు నామెయెడ మును పటికన్న నినుమడిగ ప్రేమడిగలవారై, మిగుల సన్మానంబున మరల దోడ్కొనిపోవుటకై వచ్చుటచే నానాగారి కపరిమితానందము కలిగెను. సత్యముపట్ల భగవంతుడు కలడనుదాని కీదిన మాతనికి ప్రత్యక్షసాక్ష్యము కనుపట్టినందున భక్తిరసముచే నాతని పవిత్రాంతః కరణము పొంగిపొరలసాగెను. అతడు మహాదరంబున వచ్చినవారి కెల్లరకు స్వాగత మొసంగెను మార్గాయాసముచే నలసినవార లగు టచే వారందరుభోజనములైన వెంటనే విశ్రమించుటకరిగిరి నానా గారికి మాత్రము నిద్ర యేమాత్రము వచ్చినదికాదు. ఆనందాతిశయ మున నాతనిహృదయ మీదినము పరిపూర్ణత నొందెను. ఏమంగళ కరప్రభువుదయవలన నీదినము సుదినమైనదో యాతనిచరణకమల ములయందు లీనుడై యాతని గీర్తించుటయందు నాతని కారేయి గడచిపోయెను. ఈదినము వియ్యాలవారికి విందు చేయుటలధి

యుండుటచే తత్ప్రయత్నమునకై ప్రభాతమున లేచి, ప్రాతర్విధుల నిర్వర్తించి, యూరిలోని యాప్తమిత్రుల భోజనమునకు బిలుచుటకై నానాసాహేబు దేశముఖు మహోల్లాసమున నిల్లువెడలెను. ఇంటిలోని స్త్రీలెల్లరు స్వయంపాక మొనర్చు సందడిలో మునిగియుండిరి.

మాధవరావా సమయమున తనవదినెగారిని గలసికొని యింతవరకు నడచిన తనవృత్తాంతము సవిస్తరముగా నామెకు నివేదించి మిగులవినయమున నిట్లనెను. "వదినే! నేను నిన్ను దీసికొనిపోవుటకై వచ్చి యుంటిని. నాసంసారభార మంతయు నిప్పుడు నీవే భరింపవలయును."

ఈప్రస్తావన నాలకించి సుశీల యిట్లనెను. "నే నిపుడచటికి వచ్చినందువలన మీకయ్యెడి లాభ మేమి? మీరు సుఖముగ సంసారము సేయుచున్నచో నాకుగూడ దాననే సుఖము ఘటించును. కావలసినచో నాబిడ్డను నీపరముం జేసెదను. అయినను నేనొసంగుటకు బూర్వమే మనోరమ వానినిం దనవశముం జేసికొన్నది. వానిని మీరు వెంటదీసికొని పొండు. ఇప్పు డింతకంటె నేనేమిచేయు గలను. నేనచటికి వచ్చినమాత్ర నింతకంటె కలుగబోయెడి దేమి?"

సుశీల పలుకులవలన మాధవరావున కెంతయో దుఃఖము వచ్చెను. అతనికన్నులు బాష్పపూరితము లయ్యెను. వెనుకటి విషయము లన్నియు నొకదానివెంట నొకటిగ వానితలంపునకు రాదొడగెను. తన్ను తోబుట్టువువలెం బ్రేమించువదినెగారి యకృత్రిమప్రేమ తన సోదరునిమరణానంతరము తరిగిపోయెనా యేమని మొట్ట మొదట మాధవరావు మనమునం దోచెను. పిదప నింతవఱకు తా నామె పట్టున నేరీతిగం బ్రవర్తించెనో యది స్ఫురించినంతనే కన్నులు దుడిచికొని యాతం డిట్లనెను. "వదినే! క్షమింపుము. నేను మహాపాతకుండను, భ్రష్టుడను. ఇంతవరకు నేనీశ్వరునకు సైతముం జాలి

పుట్టింపబడిగిన వాఁడను గాను. ఇంతవర కెన్నఁడు ఏశ్వరునియం దైన
నుంచియుండఁగని భక్తిభావ మిన్నిదినముల కీనాఁడు నీయందు నామన
మున నుత్పన్న మైనది. సంసారసంబంధ మగుపనులేమియు నీ
వొనర్ప నవసరము లేదు. నిన్నింటికి దీసికొనిపోయి నా నాస్తికగృహ
మున దేవతగ స్థాపించి పూజించెదను."

మాధవగారియొక్క కరుణాస్పదస్థితియు నాతనియశ్రుపూర్ణనే
త్రములను గాంచినంత సుశీల కింక మాటాడ మన సొప్పదయ్యెను
ఆమెకుఁ గూడ నయనము లశ్రుపూరితము లయ్యెను. తుదకెంతో
కష్టముమీఁద నాయశ్రువులను దుడిచికొని యామె యిట్లనెను
"నీమనసు నొప్పించుట నాయిచ్ఛగాదు. నే నచటికి వచ్చినందు
వలననే నీకు సుఖము కలుగునని తోచినచో నేనవశ్యము వచ్చెదను.
స్త్రీలకు పుట్టినింట నుండు టుచితము కాదు కదా!"

మాధవుఁ డానంద భరితుఁ డయ్యెను. ఈసంతోషవార్త మనోరమ
కెఱిగించుటకై యాతఁడు సత్వరముగ వెడలిపోయెను.

భోజన సమారంభము యథావిధిగ సాంత మయ్యెను. నానా
గారిచేఁ బిలువఁబడిన వారెల్లరు సల్లునిపంక్తికి వచ్చిరి ఎల్లరు నీసమా
రంభము మిగుల నపూర్వ మని తలఁచిరి. నానావిధము లగు లోకాభి
రామాయణములు చెప్పుకొనుచు భోజనానంతర మందరు కచేరీ
చావడిలోఁ గూరుచుండిరి. లోపల లక్ష్మీతల్లియు. లక్ష్మియు చాల
కాలమునకు వచ్చినవిష్ణుపురాలు మొదలగువారికి మర్యాద లొనర్చు
చుండిరి. జగన్నాధుఁడు రాముఁడును తమపినతల్లితో నాటలాడు
చుచు ముద్దులుఁ జూపు చుండిరి. సుశీలకుమారుఁడు మనోరమపిఁపు
బట్టుకొని కూరుచుండెను. ఆటకుఁ గూడ దు తల్లిపైనైన దలఁచుటలేదు.

ఇవ్విధమున నందఱు సంతోషాంతరంగులై యుండ నాకస్మికముగ
నగాళిమిసియింటినౌకరు రచటకు వచ్చి ప్రత్యక్షమయ్యెను. వాఁడు

కళవళపాటున ధాన్యపుకొట్లును, నిల్లు దగులబడిపోయిన వార్తయు అటులనే గంగభయంకరవృత్తాంతమును నివేదించి ఇట్లనికూడఁ జెప్పెను. "గంగగాయి స్వహస్తముననే కొట్లకు నిప్పంటించినది. దాని నఖ్కగాయి యిదిప్రత్యక్షమునఁ జూచినది కాని గంగ భయావహమూర్తినిఁ గాంచుటతోడనే దానికి మనస్తిమితము తప్పినది. ఎవరికైన గేకవేయుటకైన దానికి నోరు రాదలేదు. పిచ్చిదాని వలె నది తెల్లబోయి చూచుచుండెను ఇంతలో గంగ యున్న దిక్కున నిల్లంటుకొనినది. గంగ గడితలుపులను గట్టిగ బిగించికొనిలోన గూర్చుండి యుండెను. తుదకు తా నంటించిన యాయగ్నిలోనే యామె కాలిభస్మమైనది. వెంటనే యూరిలోని జనులుపోయి యగ్ని నార్పఁబ్రయత్నము లొనర్చిరి. కొట్లపైకప్పు తగులబడి ధాన్య మంటుకొనినది కాని వారు మిగుల బ్రయాసమున నార్పివైచిరి. ఇంటిస్థితిగూడ నష్టే యయ్యెను."

గంగవృత్తాంత మాలకించి యెల్లరు విస్మితులైపోయిరి. ఘోర పాతకఫల మెక్కడిదక్కడనే యనుభవ మిచ్చుదానికి ప్రత్యక్షోదాహరణము గాంచి యాపాతకురాలివిషయమున నెల్లరు విముఖులయిరి గంగకొఱకెవ్వరు నంత దుఃఖింపరైరి. కాని యామెకథ పటి హృదయద్రావకస్థితి నాలకించినంత లక్ష్మికిని, మనోరమకును మాత్రము చప్పున కన్నుల నీరుగ్రమ్మెను మేఘము వర్షించుటకు స్థానాస్థానవిచార మెట్లుచేయదో యటులే దుష్టురాలును చండాలురాలు నధమయు నగుగంగకొఱకు కూడ వారిరువురు నశ్రువులు విడిచిరి

ఈవృత్తాంతము దెలిసినతరువాతమాత్రము మరియెవరు నచట నిలువలేదు సుశీల మనోరమ మొదలగువారిని వెంటబెట్టుకొని వెంటనే మాధవరావు తనయూరు చేరెను. అతఁడు వదినెగారియాజ్ఞ

ప్రకారము నూతనసంసారము సేయుచు మనోరమాసహితుఁడై మిగుల నానందమునఁ గాలముగడుపు చుండెను.

సదాశివరావు, వినాయకరావు తమ వారందరితోడను స్వగ్రామమున కరుదెంచిరి. లక్ష్మితండ్రి జామాతకు గృహము మొదలగునవి చక్కఁజేసికొనుటకై విశేషధనసహాయము చేసెను. ఏవిషయమునను లోపము సేయలేదు. కొట్లలోనిధాన్యము పైపైనమాత్రమే తగులబడినది. అందువలన విశేషనష్టమేమియు కలుగలేదు. అందఱు మిగుల సుఖముగ నుండిరి. సంసారముయొక్కయు, నటులనే యితర వ్యవహారములయొక్కయు భారము మాత్ర మిప్పుడు సర్వము లక్ష్మి మీఁదనే పడెను. ఆమెయభిప్రాయము దీసికొనక సదాశివరా విప్పు డేపనియు చేయుట లేదు.

తనయునంగుడదిగెతో బాలకృష్ణుడు కూడ వచ్చి స్వస్థానమునఁ జేరె నని వేఱుగఁ జెప్పనక్కరలేదు.

పార్వతి యిప్పుడు తనతోడికోడలిని నిశ్చయముగ సోదరివలెఁ బ్రేమించు చుండెను. ఇరువురినడుమ వైమనస్యమనునది లేదు. పార్వతికిని రాధకును మాత్రము పూర్వముకంటె విశేషకలహము ఘటిల్లు చుండెను. విచిత్ర మేమన అత్తకోడండ్రకలహములో నిప్పుడు లక్ష్మి తనతోడికోడలిపక్షమునే యవలంబించు చుండెను. పాపము వృద్ధురాలు మాత్రము పరాభవ మొందవలసి వచ్చు చుండెను. కాని యీకలహ మొకవిధ మగుప్రేమకలహము. దీనికి కారణ మేమన కోడండ్రు పనిచేయుట జూచి రాధ స్వస్థముగఁ గూర్చుండఁ జాలదు. ఆమెకూడ నేదోపని చేయుచుండవలయును. కాని యిఁకమీఁద నత్తగారి సేవనియు ముట్టనీయమని కోడండ్రు నిశ్చయము చేసికొనిరి. అందువలన మాటిమాటికి నీకలహప్రసంగము సంఘటిల్లు చుండెడిది. అం దెప్పుడును వృద్ధురాలికే పరాజయము

గలుగు చుండెను. తండ్రియు తనయునపోయి త్యాగమునకు వగచుచు వారిమనసు వచ్చినట్లు చేసికొనవచ్చునని తనయుద్దమనుమలతోడను, ధర్మకార్యములతోడను ప్రొద్దులం బుచ్చుచుండగను. సంసార సంబంధ మామె బొత్తుగ వదలికొనియెను.

మనోరమ తన ప్రియసఖి యగు లక్ష్మిని జూడకుండగను, ప్రతి విషయమునందు నామె హితోపదేశమును బడయకుండగను నెట్లు మనగలదు? ఆమె మాటి మాటికిని తన నెచ్చెలిని జూచి పోవుటకు వచ్చుచుండెను. మాధవరావుకూడ నీవిషయమున నామె నెప్పుడు నభ్యంతరపెట్టలేదు. ఇంకదానుగూడ నప్పుడప్పు డామెను వెంట బెట్టుకొని వచ్చిపోవుచుండెను.

దీక్షితునిగృహము మరల సిరికి పుట్టినిల్లు కా సాగెను. ధనము, గౌరవము మరల వృద్ధిం బొందసాగెను. ఒకసమయమున పేరుప్రతిష్ఠలు నందిన దీక్షితునిగృహము మధ్యకాలమున సంభవించిన విపత్తుల నుండి విముక్తిం జెంది శుభప్రదుండగు నా భగవంతుని యవిరళ కృపవలన మరల బూర్వస్థితికి వచ్చెను.

సదాశివరావు సతినిజజననియు మాత్ర మీశ్రేయము లన్నియు లక్ష్మీబాయియదృష్టఫలము లనిభావించి యామెను మానసములందు స్తోత్రము చేయుచుందురు.

సమాప్తము